SP-MT-2+TEL












మీకు టీ కావలస్తే, మూడీస్ టీ కొనండి. మీరు మూడీస్ టీ కోసం అడిగితే, దానిలో ఎంచుకోవడానికి, ఆనందకరమైన ఎన్నో వివిధ మిశ్రమములు మీకు లభిస్తాయి

హాయికరమైన, రుచిగల రాణి డస్ట్, ఉత్సాహాన్నిచ్చే టి. జి. డస్ట్, ఎక్స్‌ట్రా స్పెషల్ క్రౌన్, శుద్ధమైన డార్జిలింగ్ టీ, ఆహ్లాదకరమైన సువాసనతో బాగా మిశ్రమము చేయబడిన లీఫ్ టీ, సంతృప్తికరమైన చిక్కటి కాన్సర్ట్ లీఫ్ టీ మరియు పొదుపైన మంచి రుచిగల సూపర్ ఫైన్.

మీకు టీ కావలసినప్పుడల్లా, తప్పకుండా మూడీస్ టీ కోసమే అడగండి. ప్రతి వ్యక్తి మూడీస్ టీనే త్రాగును — మీరూ ఎందుకు త్రాగకూడదు? అందువలన మీకు నచ్చిన మూడీస్ మిశ్రమము ఎంచుకొని, ప్రతిసారి దాని పేరు చెప్పి, అడగండి.

# మూడీస్ టీ

భారతదేశములో 1883 నుంచి,
బొంబే బర్మా ట్రేడింగ్ కార్పొరేషన్ వారి ఉత్పత్తి

# ఉత్తరాలు

30–8–68 సంచికలో ప్రచురించిన వినాయకచవితి వ్యాసంలో వేసిన ఫోటోలు శ్రీ ఎస్. రామకృష్ణ తీశారు. పాఠకులు గమనించ కోరుతున్నాము. స్థలాభావంచేత క్షేమేంద్రుని బృహత్ కథామంజరి కథలు, మీరు పుట్టిన ఇంగ్లీషుతేదీ ననుసరించి మీ స్వభావం ? మీ మిత్రులు ? ఈ వారం వెయ్యలేక పోతున్నాము.

—సం॥

### కథలు

(23–8–68) ప్రస్తుత వాస్తవికతకు, ఆర్. వి. జి. కృష్ణమూర్తిగారి 'బతుకు కథ' సన్నిహిత సంబంధం కలిగియుండి, 'కూటికొరకే కోటి విద్యలు' అనే సామెతను ఋజువు చేయుచున్నది. 'సంస్కారానికి సంకెళ్లు' పెద్ద కథలో రమణమూర్తి వంటి సంస్కారం గలవారికి వృత్తి రీత్యా జరిగే అన్యాయాన్ని, సంస్కారం అనే ముసుగులో వచ్చిన సంసారములను కూలద్రోసే దుష్టశక్తుల్ని,చక్కగా చిత్రీకరించిన రచయిత గార్కి నా ధన్యవాదములు.

బేగం (శృంగవరపుకోట)

* * *

16–8–1968 సంచిక పత్రికయందు శ్రీ గెనికెట్టి చిత్రీకరించిన ముఖచిత్రం చాల బాగున్నది. ఈ వారం సంచికలో ప్రచురితమయిన 'సంస్కారానికి సంకెళ్లు' అను పెద్దకథ, 'కుక్క గొడుగులు' అను రెండు కథలు చాల బాగున్నాయి.

సి. కనకాంబరరాజు వ్రాసిన 'బాలల్లారారండి' అను గేయము యీనాటి పిల్లల పరిస్థితిని బట్టి చాల బాగున్నది. యీ వారం ప్రచురించిన కొత్త సీరియల్ 'సుజాత' ప్రారంభం నుండి చాల ఉత్సాహమును కలిగించుచున్నది.

ప్రతి వారం తాజా తాజా కథలు, సీరియల్స్ వస్తున్నందుకు సంతోషం! రచయితలకు నా నమస్కారములు.

వి. సురేష్‌బాబు (నార్పింగి)

* * *

"సంస్కారానికి సంకెళ్లు" కథ చాలా బాగుంది. చివరకు సుఖాంతంగా ముగిస్తారనుకొన్న కథను రచయిత విషాదంగా ముగించారు.

యస్. వెంకటరావు (కటక్)

### సీరియల్

కొత్తసీరియల్ 'సుజాత' చాల బావుంది. మొగలి పొదలు చాలా ఇంటరెస్టుగా యున్నది. శ్రీనివాస్ రాజేశ్వరి పాత్రలు చాలా బావున్నవి.

జె. కుమారి (ఖండవిల్లి) ●


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 6–9–'68
కీలకనామ సం॥ భాద్రపద మాసం పూర్ణిమ

సంపుటము : 61 సంచిక : 2

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: 'బంగారు సంకెళ్లు'లో జమున


జెక్ వాసుల్ని సంరక్షించేందుకు వచ్చాం
దురాక్రమణ
దొంగ నిల్వలు
దొంగ వ్యాపారం
బంగారం కంట్రోలు బిల్లు!!
ఆశావాది
భారత సౌభ్రాతృత్వం
చైనా
ఎంత కష్టం! మరోకుర్రవాడే భా.రా.న్ని మొయ్యాల్సొచ్చింది
పంజాబ్
ప.బెంగాల్
యు.పి.

**న్యూఢిల్లీ లేఖ**

# ప్రధాని పట్ల విశ్వాసం చూపినందుకు మొరార్జీకి వచ్చిన లాభం?

ప్రధానమంత్రి బలపరచటంతో కేంద్ర మంత్రివర్గం ఏకకంఠంతో పలకటంతో ఉపప్రధాన మంత్రి శ్రీ మొరార్జీదేశాయి లోక్‌సభలో శ్రీ మధులిమాయె లేపిన తుఫానుకి తట్టుకోగలిగారు. ఇదంతా నిజమయిన ఐకమత్యమా, లేక బొంబాయిలో శ్రీయుతులు పాటిల్–చవాన్‌లు కలిసి చేసుకున్న రాజీవల్ల బలవంతంగా ఏర్పడిన ఐకమత్యమా? భవిష్యత్తే తెలుపగలదు. శ్రీ దేశాయిమీద పేల్చిన తుపాకికి కావలసిన మందు ఆయన సహాధ్యాయులే కొందరు ఇప్పించారన్న సంగతి ఇప్పుడు అందరికీ తెలుసు. ఆయనకీ తెలిసే ఉంటుంది. ఇటీవల కలిగిన విజయం మొరార్జీ స్వాతంత్ర్యాన్ని కొంత పెంచగలదా? ఈ ఉదంతం జరిగేముందే ఆర్థిక వ్యవహారాలమీద శ్రీ దేశాయి ప్రభావం తక్కువ. అసలే లేదనేవారూ ఉన్నారు. ప్రజల్లో పెద్దపేరు వచ్చే విషయాలలో మాత్రం శ్రీమతిగాంధీ వారికి పూర్తి స్వేచ్ఛ ఇచ్చారు. అసలు శ్రీ దేశాయి మద్యపాన నిషేధం, హిందీ వీటి విషయమై అవసరమయిన ప్రసంగాలు ఇచ్చి అందరికి కోపం ఎందుకు తెప్పించాలి? అస్సామ్ పునర్నిర్మాణం గురించి ఆయన ప్రకటన చెయ్యరాదని ఎవరూ అడ్డుపడలేదు. అయితే, ఆర్థిక విషయమయిన కాంబేఖాతంలో పెట్రోలు పరిశోధనకోసం వెతకటం గురించి ఆయనమాట చెల్లకుండా చేశారు. ఈ సందర్భంలో జరిగిన ఆలస్యం వల్ల దేశానికి కొన్నికోట్ల రూపాయలు నష్టం వస్తున్నాయి. (బాంకుల విషయంలో శ్రీ దేశాయి అంతమాత్రం కలుగచేసుకున్నారంటే, దానికి కారణం లేక పోలేదు; ఇది అమెరికా–రష్యాలమధ్య పోటీకి సంబంధించినదికాదు, శ్రీమతి గాంధీకి ఆర్థిక సమస్యలగురించి అంతగా తెలియదు.) –

చవాన్–పాటిల్‌ల మధ్య సంధి కుదిరిందని వార్త. దీనివల్ల శ్రీ దేశాయికి శ్రీమతి గాంధీపట్ల విశ్వాసం పెరుగుతుందా? 'విశ్వాసం' అనేమాటకి 'బానిసత్వం' అని కూడా అర్థం చెప్పవచ్చు. ఇంతదాకా శ్రీ దేశాయి విశ్వాసం నిష్కల్మషంగా ఉంటూవచ్చింది. దానికితగిన ప్రతిఫలం మాత్రం లభించలేదు.

* * *

ఇటీవల 'మయిరన్ వెయినర్' అనే అతను 'స్టేట్‌పాలిటిక్స్ ఇన్ ఇండియా?' అనే వ్యాస సంపుటిని–వివిధ రచయితలవి–ప్రచురించాడు. ఉత్తర ప్రదేశం గురించి పాల్ ఆర్. బ్రాస్ అనే ఆయన రాస్తూ ఇలా అన్నారు:

'వామపక్షాల వారందరూ సత్యాగ్రహం నిరసన ప్రదర్శనలు తమ జన్మహక్కు అనుకుంటారు. ఈ విషయంలో సోషలిస్టుపార్టీ వారు బాగా ముందంజవేశారు సత్యాగ్రహ, నిరసన ప్రదర్శనలని వీధులలో నేకాక శాసన సభలలో కూడా చేస్తున్నారు శాసన సభాధ్యక్షుడి మాటనికూడా ఎదిరించి సభ కార్యక్రమం కుంటుపడేట్లు చేస్తున్నారు. వీరిని కొన్నిసార్లు 'సార్జెంట్ ఎట్ ఆర్మ్స్' బలవంతంగా బయటికి తీసుకుపోవలసి వస్తూ ఉంటుంది. కొందరు ప్రతిపక్ష సభ్యులు, స్వతంత్రంగా నిలిచి గెలిచిన అభ్యర్థులు–వీరితో కలిసి శాసనసభ కార్యక్రమాన్ని ఆపివెయ్య గలుగుతున్నారు సోషలిస్టులు'

శ్రీయుతులు మధూలిమాయె, జార్జి ఫెర్నాండెస్‌ల ఉపాయాలు పై వ్యాఖ్యతో సమన్వయించుకుని చూడటం అవసరం.

ప్రధానమంత్రి నివాసం సంగతి తీసుకుందాము. ఇంటరిమ్ ప్రభుత్వం ఏర్పడినప్పుడు దానితర్వాత కొంతకాలం మొదటి ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ అప్పటి యార్క్‌రోడ్డు, నేటి మోతీలాల్‌నెహ్రూ మార్గ్‌లో 'బి. 15 'లో ఉండేవారు. ఆ ఇల్లు లాలా హరీష్‌చంద్ర అనే ఒక ఢిల్లీలాయర్ గారి వితంతువుది. నేడు ఆ ఇంట్లో ఇటాలియన్ రాయబారి ఉంటున్నారు.

ఒకసారి ఒక ఇంటిని అప్పటి సేనాధిపతికోసం కేటాయించారు. రక్షణ, కట్టుదిట్టాలకోసం ఈ ఇంట్లో సేనాధిపతి ఉండరాదని మరొక ఇల్లుకట్టి దానికి 'తీన్‌మూర్తి హవుస్' అనే పేరుపెట్టారు. అదే తర్వాత ప్రధానమంత్రి నివాసం అయింది రక్షణదృష్ట్యా ఇది సరయిన నిర్ణయం. శ్రీ నెహ్రూగారు దానితో ఏకీభవించారు. ఎందుకంటే శ్రీమతి గాంధీ శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి ఉన్న ఇళ్ళు వీధివాదకి ఉండి అన్నిరకాల ప్రదర్శనలకి గురిఅవటం జరిగింది, జరుగుతోంది ఇది పోలీసు శాఖవారికి పెద్ద చికాకు, లోపల ఉండేవారి శాంతికి భంగకారణం.

శ్రీ నెహ్రూ చనిపోగానే లాలా గుల్జారీలాల్ నందా తీన్‌మూర్తి హవుస్ నెహ్రూ మ్యూజియమ్ కావాలని ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదన ఆమోదించిన కేంద్ర మంత్రివర్గం నిర్ణయం అన్నివిధాలా తప్పయినది. 10, జన్‌పథ్‌లో కీ. శే శాస్త్రిగారి ఇల్లు కట్టటానికి 10 లక్షల



మదరాసు అమెరికా సమాచారసంస్థ ఇన్‌ఫర్మేషన్ ఆఫీసర్‌గా నియమితులైన శ్రీ క్రిస్టొఫర్ ఎల్. పోల్స్.

రూపాయల వయిగా ఖర్చుఅయింది. మళ్లా శ్రీమతి గాంధీగారికి ఇంకొక ఇల్లు కట్టాలంటే అదనపు ఖర్చు.

శ్రీ నెహ్రూ గొప్పదనాన్ని తీసివెయ్యనక్కరలేదు; శ్రీ శాస్త్రి దేశభక్తిని కాదనవక్కరలేదు; కాని స్మృతిచిహ్నాల నిర్మాణానికిచేసే దుబారాఖర్చుకి అంతుఅంటూ ఉండాలి. అందులోనూ గొప్పవారి సిద్ధాంతాలపట్ల నమ్మకం లేనివారు చేసేఖర్చుకి. న్యూఢిల్లీలోనే నెహ్రూ మ్యూసియమ్, నెహ్రూ విశ్వవిద్యాలయం, నెహ్రూపార్కు అన్నీ కడ్తారుట. నెహ్రూ స్టాంపులు నెహ్రూ నాణాలు—వీటిసంగతి సరేసరి. యమునానది కుడితీరాన్ని మహాత్మాగాంధీ, నెహ్రూ లాల్‌బహదూర్ శాస్త్రుల జ్ఞాపకార్థం నిర్మించిన ఉద్యానవనాలతో నింపివేశారు. వాటికోసం ఇంకా డబ్బుఖర్చు అవుతూఉంది.

శ్రీమతి శాస్త్రీగారు ఆమెభర్త నివసించిన ఇంటిలోకి మారిపోయారన్న వార్త ఇంతకిముందే వెలువడింది. అమె ఆఇంటిని మ్యూసియమ్‌గాచేసి వెయ్యదల్చుకున్నారుట.

శ్రీమతిగాంధి లేనప్పుడు ఈధోరణికి విరుద్ధంగా నిర్ణయం తీసుకున్నందుకు కేంద్రమంత్రి వర్గంవారు అభినందనీయులు. ఈ నిర్ణయాన్ని శ్రీ మధులిమాయె వెంటనే ఖండించారంటే ఆశ్చర్యంలేదు. అప్పటికే ఆయనకి శ్రీ మొరార్జీ ధ్యాస ఎక్కువ అయిపోయిందేమో వెంటనే 'తన ఉద్యోగాన్ని ఉంచుకునేందుకు మొరార్జీ ఈనిర్ణయాన్ని బలపరిచారని ఆరోపించారు. ఇక శ్రీ జార్జి ఫెర్నాండెస్ ప్రధానమంత్రి తీన్‌మూర్తి హవున్‌కి మారరాదని హెచ్చరించారు.

తమ పేర్లు పత్రికలో పడకపోతే, శ్రీయుతులు లిమాయే, ఫెర్నాండెస్‌లకి తోచదనుకుంటాను. అందులోనూ ఎవరినో బెదిరించినట్లు వార్త పడకపోతే! కొంతకాలంకింద ఇద్దరూ పార్లమెంటుని వదిలివేస్తామన్నారు. తర్వాత. తమ నిర్ణయాన్ని మార్చుకున్నారు. వార్తాపత్రికలలో ఈ విషయానికి సంబంధించిన కథలు రెండు రకాలవి వెలువడ్డాయి. వారి పార్టీవారే తమ నాయకుల ప్రకటనలని నమ్మలేదు. ఇద్దరూ పార్లమెంటుని వదిలివేస్తే వారికి ఎవరు ప్రచారంచేస్తారు?

ఇక ప్రజాభిమానం, శ్రేయోభిలాష అంటారా; హిందీకోసం కోట్లు ఖర్చు పెడుతూఉంటే వారిద్దరూ ఎందుకు ఊరుకున్నారు? 'దరిద్ర నారాయణు'డనే మనిషికోసం ఆయన శతవార్షికోత్సవానికి 75 లక్షల రూపాయలు కేటాయించబడింది. బ్రిటన్‌లో 10, డవునింగ్ స్ట్రీట్‌లో ఎందరో ప్రభువులు నివసించారు. అదే ఇంట్లో శ్రీ విల్సన్‌కూడా ఉంటున్నారు. ఎందుకూ? అది బ్రిటిష్ ప్రధాని 'అధికార నివాసం' కాబట్టి.

ప్రధానమంత్రికోసం అధికారనివాసం ఒకటి కట్టటానికి పెద్ద ఖర్చుచేసే బదులు తీన్‌మూర్తి హవున్‌నే అధికారనివాసం చెయ్యటానికి కేంద్రమంత్రివర్గం నిర్ణయించింది. ఒక జార్జి ఫెర్నాండెస్ ఈ నిర్ణయాన్ని ఎదిరించినట్లయితే దానిని బలపరిచేవారు లక్షలమంది ఉన్నారు. ఈ 'యుద్ధం' శ్రీ జార్జి ఫెర్నాండెస్ 'వాటర్లూ' అనవచ్చు. ప్రధానమంత్రి తమబలాన్ని తెలుసుకోగలిగారు. దృఢనిశ్చయంతో ప్రవర్తిస్తున్నారు.

—శ్రీకృష్ణ ●

# ముప్ఫై ఏళ్ళలో మూడవసారి

1938 లో హిట్లర్ చెకోస్లొవాకియాని కబళించినప్పుడు ఎవరూ ఆదేశానికి సహాయం చెయ్యటానికి పూనుకోలేదు 1948 లో రష్యా అక్కడ కమ్యూనిస్టులని అధికారంలోకి తీసుకువచ్చి చెకోస్లొవాకియాని తన ఉపగ్రహాలలో ఒకదానినిగా చేసుకున్నప్పుడూ చెక్ ప్రజలు నిస్సహాయులుగా ఉండిపోయారు. ఆ తర్వాత చెకోస్లొవాకియా రష్యాకి అత్యంత విశ్వాసపాత్రమయిన దేశాలలో ఒకటిగా ఉండిపోయింది. కాని, 1968 లో-రష్యా ఆధీనంలోకి వెళ్ళిన ఇరవయి సంవత్సరాల తర్వాత-చెకోస్లొవాకియాలో స్వాతంత్రోద్యమం ఒకటి బయలుదేరింది. ఈ ఉద్యమం ముందు దేశంలో స్వేచ్ఛ అధికం అవాలనే ఉద్యమంగా, ఆర్థికాభివృద్ధి సత్వరంగా జరిగేఏర్పాట్లు కావాలనే ఉద్యమంగా బయలుదేరింది. '2000 మాటల'లో 70 మంది చెక్ మేధావులు ఒక కోరికల పత్రంమీద తమ సంతకాలు పెట్టారుట; దానిని ప్రాగ్ వార్తాపత్రికలు ప్రచురించాయిట. వెనువెంటనే మరొక 30,000 మందికి పయిగా ఈ కోరికల పత్రంమీద సంతకం పెట్టారుట. రష్యాకి మరీ అనుకూలంగా ఉన్నవారు పోవాలని ఈ పత్రం ప్రత్యేకంగా సూచించిందిట. స్థూలంగా చెప్పాలంటే కొంతకాలంగా కొందరు చెక్ నాయకులు చెయ్యదలచుకున్న ఆర్థిక సంస్కరణలని మహజరుమీద సంతకం పెట్టినవారు ఈ విధంగా బలపరచదలుచుకుని ఉండవచ్చు. అయితే, ఇటువంటి స్వేచ్ఛతో కూడినచర్య కమ్యూనిస్టు అయికమత్యాన్ని చెడగొట్టటమేకాక, చెకోస్లొవాకియా తమ ఆధీనంలోనుంచి తప్పుకుపోగలదనే భయం రష్యా నాయకులకి కలిగి వారు చెక్ నాయకులని హెచ్చరించటం మొదలు పెట్టారు.

ఏ సామ్రాజ్యంలోనయినా కేంద్రాధికారానికి ఎదురు తిరగటం అనేది ఎప్పుడో ఒకప్పుడు జరుగుతూనే ఉంటుంది. టిటో వంటివారు ఎదురుతిరిగి నెగ్గవచ్చు; లేదా 1956 లో హంగేరీలో నాగీవలె ఓడిపోవచ్చు. 1968 లో చెకోస్లొవాకియాలో మితవాద నాయకులలో ప్రముఖుడయిన దూబ్‌చెక్ ఏమి చెయ్యగలుగుతాడో అని అఖిల ప్రపంచం ఆసక్తితో చూస్తూ ఉండిపోయింది. చెకోస్లొవాకియా వ్యాపారంలో 80 శాతం రష్యాతోనే; ఆదేశానికి కావలసిన ముడిసరుకు ఎంతో రష్యానుంచి రావలసినదే. అందుచేత, ఎవరూ దూబ్‌చెక్ దుడుకుతనంతో ప్రవర్తిస్తాడనుకో లేదు. ఎంతో సహనంతో, గడుసుదనంతో రష్యా నాయకులతో ప్రవర్తిస్తూవచ్చాడు. బ్రాటిస్లావాలో 'శిఖరాగ్ర సమావేశం' వంటిది ఒకటి కావాలంటే ఏర్పాటుచేశాడు.

ఈ సమావేశంలో ఏమి జరిగిందో సరిగ్గా తెలియదు కాని దూబ్‌చెక్ మితవాదానికి తగిన విజయం లభించినదని ఎందరో అనుకున్నారు.

చెకోస్లొవాకియాలో సంస్కరణోద్యమాన్ని బలపరిచిన కమ్యూనిస్టు రాజ్యాలలో రుమేనియా, యుగోస్లావియాలు ఉన్నాయి; ఎదిరించినవాటిలో తూర్పు జర్మనీ, పోలండ్, బల్గేరియాలు ఉన్నాయి. పాశ్చాత్య దేశాలలో కమ్యూనిస్టు పార్టీలలో కూడా చెకోస్లొవాకియా పక్షం వహించినవి ఉన్నా

చెకోస్లొవాకియామీదికి రష్యావర్గం దళాలు వెళ్లాయని వార్త వెలువడగానే లోకసభ స్పీకర్ శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ఆ వార్త అఖిల భారత దేశాన్నీ భయభ్రాంతం చేసిందన్నారు. ప్రధానమంత్రి శ్రీమతి గాంధిగారు కూడా విదేశాల దళాలు చెకోస్లొవాకియాని ఖాళీ చెయ్యాలన్నారు. అసలు అవి చెకోస్లొవాకియాలోనికి వెళ్లటమే శోచనీయం అన్నారు. ఐక్యరాజ్యసమితిలో భారత ప్రతినిధి ప్రధానమంత్రి ప్రకటనని చదివి వూరుకున్నారు.

భద్రతామండలిలో రష్యా చర్యని 'ఖండించే' తీర్మానం వచ్చినప్పుడు భారతదేశం వోటు వెయ్యలేదు. 'ఖండన' అనే మాట తమకి ఇష్టంలేదు కాబట్టి ఈ తీర్మానాన్ని బలపరచలేదని భారత అధికార వర్గపు వాదన.

అందరూ ఎదురు చూసినట్లే భారత కమ్యూనిస్టు నాయకులు రష్యా ప్రవర్తనని బలపరుస్తూ మాట్లాడారు. ఇతర ప్రతిపక్షాల నాయకులందరూ రష్యా నడవడిపట్ల బాధ ప్రకటించారు........

## చెకోస్లొవాకియా సంగ్రహ చరిత్ర

సుమారు క్రీ. పూ. మొదటి శతాబ్దంలో నేటి చెకోస్లొవాకియా ప్రాంతంలో 'కెల్ట్' తెగవారు వచ్చి స్థిరపడిపోయారు. క్రీ. శ. మొదటి అయిదు శతాబ్దాలలో 'జర్మానిక్'తెగలవారు వచ్చి స్థిరపడ్డారు. ఆతర్వాత తూర్పునుంచి 'స్లావిక్' జనం అక్కడికి వలసవచ్చారు. 9వ శతాబ్దానికి చెక్ మొరేవియా ప్రాంతాలు మొరెవియా సామ్రాజ్యంలో భాగం అయిపోయాయి. ఈ కాలంలోనే క్రయిస్తవమతం ఇక్కడికి వ్యాపించింది. 10వ శతాబ్దంలో 'వెంచెస్లాస్' రాజుకింద బొహీమియా రాజ్యం ఏర్పడింది. ఆపయిన ఈప్రాంతాలు వివిధ సామ్రాజ్యాలలో చేరి విడిపోతూ ఉండేవి.

లూథర్ తర్వాత ఇక్కడ 'సంస్కరణ' పెద్ద ఎత్తున లేచింది. జాన్‌హువ్ పెద్ద ప్రొటెస్టెంట్ నాయకులలో ఒకడు. హప్స్‌బర్గ్ సామ్రాజ్యంలో చెకోస్లొవాకియా బాగా జర్మన్ ప్రభావానికి గురి అయింది. అభిజాత్య వర్గాలు జర్మన్ మాట్లాడితే జనసామాన్యం చెక్ మాట్లాడేవారు.

చెక్ జాతీయోద్యమం 18 శతాబ్దంలో అంకురం దాల్చింది. 20వ శతాబ్దంలో మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత హప్స్‌బర్గ్ సామ్రాజ్యం నాశనమయిపోయింది. 1918, అక్టోబరు 28 నాడు చెకోస్లొవాక్ రిపబ్లిక్ రూపం దాల్చింది. ఆస్ట్రియన్ బొహీమియా, మొరావియా (ఇవిరెండూ చెక్ ప్రాంతాలు), హంగేరియన్ స్లొవాకియా ఇందులో కలిసిపోయాయి. చెకోస్లొవాకియా మొదటి అధ్యక్షుడు తామస్ జి. మాసారిక్. ఆయన తర్వాత 1935లో ఎడ్వర్డ్ బెనెస్ అధ్యక్షుడయ్యాడు. క్రమంగా ఈదేశం పారిశ్రామికాభివృద్ధిని సాధించినా ఎన్నో రకాల వాళ్ళు అందులో జర్మన్ మాట్లాడేవారు. ఉండటంతో ఎన్నో పేచీలు వచ్చాయి. దీనిని పురస్కరించుకుని 1938 లో మ్యూనిక్ ఒప్పందం జరిపించి హిట్లర్ చెకోస్లొవాకియాని జర్మనీ అధికారం కిందికి తీసుకువచ్చాడు.

యుద్ధం ముగిసిన తర్వాత బెనెస్ తిరిగి అధ్యక్షుడయ్యాడు. 1943లో రష్యాతో స్నేహం కుదుర్చుకుని కమ్యూనిస్టులతో ఒప్పందం చేసుకున్నాడు. కాని, 1948 లో కమ్యూనిస్టులు బలవంతంగా అధికారం చేజిక్కించుకున్నారు. అప్పటినుంచి నేటిదాకా కమ్యూనిస్టులే అధికారంలో ఉన్నారు.

యని వెలువడిన వార్తలవల్ల తెలుసుంది. ఈ చీలికల కారణంగా రష్యా దూబ్‌చెక్ వర్గాన్ని అణిచివెయ్యలేక పోయిందని ఊహించినవారూ ఉన్నారు. ఏది ఎలా ఉన్నా వేయన్నా, బ్రాటిస్లావా సమావేశాల తర్వాత చెకోస్లొవాకియాలో ఒకకొత్తరకం పరిస్థితి ఏర్పడిందని అందరూ అనుకున్నారు. రష్యా వెనక్కి తగ్గిందనుకున్నారు.

కాని, హఠాత్తుగా పోయినవారం 'వార్సా ఒప్పందం' దళాలు చెకోస్లొవాకియామీదకి వచ్చాయి. దూబ్‌చెక్‌తోబాటు మరికొందరు నాయకులని నిర్బంధించాయి—అని వార్తలు వెలువడ్డాయి; అయన ఆచూకీ కొన్నిరోజుల దాకా తెలియిలేదు. చెకోస్లొవాకియా ప్రజలు మాత్రం తమమీదకి వచ్చిన రష్యన్ టాంకులని శాంతియుతంగా ఎదిరించారు. శాంతంగా ఎదిరించినప్పటికీ వారిమీద కాల్పులుజరపటంతో కొందరు మరణించారు

ఈ పరిస్థితిలో 1955 లో హంగేరిలో జరిగినదే ఇక్కడా జరుగుతుందని ఎందరో అనుకున్నారు కాని, వారి ఊహలు సరికావని సూచించే పరిణామాలనికూడాగమనించవచ్చు. మాస్కో భక్తుడయిన నోవోత్నీని తిరిగి పూర్తి అధికారంలో పెట్టలేకపోయారు రష్యన్ నాయకులు; ప్రాగ్‌లో తమచెప్పు చేతలలోఉండే 'బొమ్మప్రభుత్వాన్ని' నెల కొల్పలేకపోయారు; విదేశాలలోఉన్న చెకొస్లొవాకియావారు రష్యా కల్పించుకొనటం తప్పు అని ఖండిస్తూ ఉంటే వారిని ఆపలేక పోతున్నారు స్వొబోదాసేనాని మాస్కోవెళ్ళినప్పుడు రష్యా నాయకులందరూ విమానాశ్రయంలో హాజరయ్యారు...

ఆగస్టు 24 వ తేదీన ప్రాగ్‌నుంచి ఒక వింతవార్త వెలువడింది, డూబ్‌చెక్ నాయకత్వం కిందనే చెకోస్లొవాకియాలో తిరిగి ప్రభుత్వం ఏర్పరచటానికి రష్యన్లు అంగీకరించ వచ్చునని!

ఇది జరగవచ్చు, జరగకపోవచ్చు కాని రష్యా కమ్యూనిస్టు నాయకులలో మాత్రం పూర్తి అయికమత్యం లేదని భావించినా తప్పులేదు (శ్రీ కోసిజిన్ రాజీనామా ఇచ్చారనే వార్త ఈ ఊహని కొంత బలపరుస్తుంది.) చరిత్రలో సడలిపోయిన ఎన్నో సామ్రాజ్యాలవలెనే రష్యా కమ్యూనిస్టు సామ్రాజ్యంకూడా సడలిపోవటం మనం ఇప్పుడు చూస్తున్నాము. .. (కె) ●

ఈ వ్యాసంతోపాటు ప్రచురించిన పటం టైమ్ పత్రిక నుంచి తీసుకొనబడింది.



# ఎందులకో ప్రేమకానుక! ఇదిగో నిజమైనట్టి ప్రతిఫలము!!

జీవన్‌టోన్ సేవించుటకు ఆరంభించి ఎక్కువ లాభమును, మిక్కిలి ఎక్కువ బరువును, శక్తియు పొందినటువంటి ప్రేమికుల ప్రశంసలు పొగడులు వేలకొలది ఉత్తరములు ప్రతిదినము పొందియు కాని అన్నిటిని ఇక్కడ ఇచ్చుటకు వీలులేక కొన్ని ఉత్తరములను మాత్రము మీ ముందు పెట్టుచున్నాము మిగిలిన ఉత్తరములను వ్రాసినవారికిని, ఈ స్నేహితులకును కృతజ్ఞతలు.

ఒక డబ్బా మందు సేవించియు, దానివల్ల ఏ లాభమును పొందలేదు అందువల్లనే తిరిగి ఉత్తరము వ్రాయుచున్నాను మీ ఉత్తరము ప్రకారము 7 డబ్బాలు సేవించితిని ఇప్పుడు నాకు మంచి ఆరోగ్యమును, బరువును చేకూరినది. 99 పౌండ్లు వుండిన నా బరువు ఇప్పుడు 130 అయినది మీరు చెప్పిన ప్రకారము ఫోటోను పంపించెదను. **దాసన్**, 17, సిల్కువీధి, బొంబాయి—20

డాక్టర్ సార్, నేను 6 డబ్బాలు వేరొక మందుకొని సేవించితిని కాని ఏ లాభమును పొందలేదు నా స్నేహితుడు చెప్పిన ప్రకారము 'జీవన్‌టోన్' సేవించుటకు ఆరంభించితిని 4 డబ్బాలు సేవించినవెంటనే 27 పౌనులు అధికమైనది. ఇంకను ఎక్కువబరువు కావలెను అందువలన ఇంకను 3 డబ్బాలు కావలెను పంపవలయును (వి పి పి మూలముగా) **సి పి పాల్**, 27, మేదావీధి, కలకత్తా—19

మేనేజర్ సార్, 1000 రూపాయల బహుమానమును, చిత్రములో నటించుటకు అవకాశమును దొరుకును—మా యొక్క మందును ఉపయోగించినయెడల—అని పత్రికలో చూచి ఆరోగ్యమును, అధిక బరువును, సినిమాలో నటించుటకు మంచి అవకాశమును దొరుకునని ఆశతో మేము అందరముచేరి 10 డబ్బాల మందును తెప్పించితిమి. మేము ముగ్గురు స్నేహితులము సేవించియు లాభము ఏమియు దొరకలేదు. తిరిగి ఆ మందు 10 డబ్బాలు సేవించియు దానివల్ల దేహము మిక్కిలి బలహీనమైపోయినది మాకు ముందుగనే తెలును. 'జీవన్‌టోనును' సేవించినయెడల తటాలున శరీరము లావు అగునని. అదేవిధముగానే ఆ మందు అని తలచి సేవించితిమి. కాని ఏమారిపోయితిమి. మేము దానితరువాతనే నమ్మకమైన మందు జీవన్‌టోన్ అని తెలుసుకొని జీవన్‌టోనును సేవించుటకు ఆరంభించితిమి జీవన్‌టోను కంపెనీ ప్రచురణను బట్టి 6 డబ్బాలు నేనును, 8 డబ్బాలు నా స్నేహితులును, సేవించితిమి వారు చెప్పినట్లుగను, పటములో చూచినట్లుగను తటాలున శరీరము లావైనది కావలసిన బరువును లభించినది. మమ్ములనుచేసి ఒక చిత్రమును తయారుచేయుటకు మిగుల కృతజ్ఞతలు. పాలఘాట్ కంపెనీ చెప్పునటుల 1000 రూ. అవసరములేదు. కాని నిజంగా మీరుతీయుచిత్రములో నటించుటకు అవకాశము దొరికినందుకు కృతజ్ఞతలు. **పి. సుబ్బయ్య**, 132, చెంగొల్పై.

అయ్యా వైద్యుడా, నా స్నేహితులును నాలాగ చాల బలహీనముగా నుండిరి జీవన్‌టోనును వదలక సేవించుటవలన కలిగిన లాభముచే వారు గుర్తుపట్టుటకే తెలియలేనంతగా మిక్కిలి లావుగా పెరిగిపోయినారు. అట్లే నాకును జరుగవలెనని ఆశతో ఒక డబ్బా కొని సేవించి ఏ లాభమును యివ్వలేదు వారికిని ఏ లాభమును దొరకలేదు. 5 డబ్బాలు వదలక సేవించుటవలననే దేహము కొంచెము లావు అయినది. నా స్నేహితులు 8 డబ్బాలు సేవించిన వెంటనే శరీరము బాగుగా లావైనది అదే మాదిరిగా నాకును 3 డబ్బాలు పంపవలసినది. **సి ఎం మత్తాయి**, మధుర

ప్రియమైన డాక్టరునకు, మీరు చెప్పిన ప్రకారము ఫోటో పంపియున్నాను. నేను 9 డబ్బాల మందు సేవించితిని మొట్టమొదట 2 డబ్బాలు సేవించినవెంటనే ఫలము లభించలేదు. అప్పుడు కొంతమంది చెప్పినట్లు వదలక సేవించుటవలన మంచి బరువు లభించినది 38 పౌనులు అధికబరువును లభించినది ఫోటోను పత్రికలో ప్రచురించుటకు నా పూర్ణసమ్మతము. **పి. ఎం. సుందరం**, శివలింగప్పవీధి, కోవై.

వైద్యులగారికి, నా స్నేహితులు మీ యొక్క జీవన్‌టోనును సేవించి, అనుభవించి, అదేమాదిరిగానే నాకును వారివలె లావును, బరువును లభించిన మంచిది. జీవన్‌టోనును సేవించి మిక్కిలి అధికమైన లావును పొందిన వారినిచూచి, తరువాత భుజించినంతటిని. అదే మాదిరిగ నా స్నేహితులకు లభించినది. వారికి దొరికిన మాదిరిగా అధికమైన బరువును, లావును నాకు దొరికిన మంచిది. అందువలన వెంటనే 4 డబ్బాలు వి. పి. పి మూలముగా పంపవలయును. రు 10—00 దీనితో అడ్వాన్సుగా పంపియున్నాను. **ఎం శివం**, మెరైన్ డ్రైవ్, బొంబాయి.

సార్, నాకు ముందుగా పసుపు పిత్తము పట్టియుండినది. వాటినన్నిటిని కుటుంబ డాక్టరు పరిచేసినారు. కాని దేహము మిక్కిలి బలహీనమైనది నా శరీరపుబరువు 72 పౌనులుగా వుండినది నా కుటుంబ డాక్టరు జీవన్‌టోనునే వదలక సేవించుమని చెప్పిరి. అదే మాదిరిగా 7 డబ్బాలు జీవన్‌టోనును వదలక సేవించితిని ఇప్పుడు 109 పౌనుల బరువువున్నాను. మంచి ఆరోగ్యముగను వున్నాను ఇప్పుడు సేవించుటను డాక్టరు ఆపివేయమని చెప్పినారు. మీరు చెప్పినట్లు దీనితో నా ఫోటోను పంపియున్నాను. **జడ్ జార్జి**, 7/32, రిచ్ మవుంటవును, బెంగుళూరు

సార్, 5 డబ్బాల మందు సేవించియున్నది. కాని నేను తలచిన విధముగా 150 పౌనుల బరువు రాలేదు 23 పౌనులు మాత్రమే కూడియున్నది. ఇంకను నాకు 18 పౌనులు కావలెను. వెంటనే 2 డబ్బాలు వి. పి. పి. మూలముగా పంపవలెను. **రవికుమార్**, బోర్డుప్లేయర్, అండమాన్.

వైద్యుడుగారు, నేను జీవన్‌టోనును సేవింప తలచి 3 మాసములు అయినది కాని నా స్నేహితులు చెప్పినట్లు వేరొక మందు ఉపయోగించి చూచితిని అందువలన లాభమేమియు దొరకలేదు వదలక జీవన్‌టోనును సేవింప ఆరంభించితిని. 2 డబ్బాలు మాత్రమే సేవించిన వెంటనే 15 పౌనుల బరువు అధికమైనది. వెంటనే నా స్నేహితులకును చేరి 10 డబ్బాలు టి వి. యస్. లారీ మూలముగా పంపవలసినది. **ఎం. డేవిడ్**, Opp చర్చ్, మండియా, మైసూర్ స్టేట్

డాక్టరునకు, 2 సీసాల మందు దొరికినది కాని 2 సీసాలు విరిగి పోయినవి వెంటనే 2 డబ్బాలు పంపవలెయును. ఇప్పుడు నేను 6 వ సీసానే సేవించుచున్నాను. నాకు 32 పౌనుల బరువు మాత్రమే అధికరించినది. ఇంకను అధిక బరువు కావలెను పైన చెప్పినట్లు 2 డబ్బాలు వెంటనే పంపవలెయును. **సి. మహమ్మదుకుట్టి**, అల్తాం కానా సమీపము, తిరురెంగాడి, కేరళ.


సేవించుటకు పూర్వము

డాక్టరుగారు

రెండు వెలల క్రితము జబ్బు చేసినది. నాలుగు సీసాలు "జీవన్‌టోన్" సేవించగానే జబ్బు నయమైనది. నాలుగు సీసాలు సేవించిన వెంటనే 23 పౌనులు తూకము వచ్చినది. ఇంకా శరీరపుష్టి అవసరము. తిరిగి 5 సీసాలు సేవించి, మొదలు 110 పౌనులు తూకము ఉన్నది, యిప్పుడు 168 పౌనులు తూకము వచ్చినది. నా ఫోటో పంపుతున్నాను. అది పత్రికలలో పడుటకు నా పూర్తి అంగీకారము ఉన్నది. ఫోటో ఖర్చు మీరుపంపవలెను.

జి. పి. సుబ్బారావు, కోడంబాకము.


70 దినముల తరువాత

**జీవన్ టోన్ లాభములు** ఎంత మంచి ఆహారము భుజించినప్పటికిని శరీరములో చర్మముపట్టకపోయినను; పేరుగుడల లేనప్పటికిని, అజీర్ణము, అలసట, ఆకక్కుటలగుట, యౌవనము విడిచి ముసలితనముగాకనబడుట, శరీరము చెడుట, స్పృహ తప్పుట, మొదలగు వానికి "జీవన్ టోనును" సేవించి మంచి ఫలమును పొందవచ్చును. జీవన్‌టోను' కొన్ని దినములు సేవించుచున్నయెడల చాల త్వరలో లావును, బరువును, మంచి పుష్టియు దొరకుట నిశ్చయము. కొంతమంది చెప్పునట్లుగా అన్నిరకముల వ్యాధులకు ఇది పనికిరాదు. జీవన్‌టోనును సేవించు దినములలో కొంచెము దేహపరిశ్రమ చేయుట అవశ్యము. అవిధముగా చేయకపోయినయెడల అనవసరముగా లావగును. కావలసిన బరువును, లావును దొరికిన వెంటనే సేవించుట అపవలెను. లావును, బరువును వున్నవారు దీనిని సేవింపకుండుట మంచిది. అనేక మందులు ఉపయోగించియు ఫలము పొందలేనివారు ఒకసారి జీవన్‌టోనును ఉపయోగించండి. 454 గ్రాముల వెల రూ. 10/-

**పురుషులు మాత్రము సేవించవలసిన మాత్రలు :** దీనిని సేవించిన 10 దినములలో ఫలము లభించును. మిక్కిలి శక్తి కలిగినటువంటి మాత్ర. 60 వయస్సునకు పైబడి వున్నవారికి ఈ మాత్రల మూలముగా ఫలము దొరుకుచున్నది. దాంపత్య జీవితములో ఏమారిపోయినవారు ఈ మాత్ర మూలముగా శక్తియు పొందవచ్చును.

... కోర్సు వెల రూ. 15/- ఈ మాత్రయును, జీవన్‌టోనును ఒకసారి సేవించిన మంచి ఫలము యిచ్చును.

**"స్కిన్‌లీవ్స్"** "స్కిన్‌లీవ్స్" ఉపయోగించి, మొటిమలు, కోసుకొన్న గాయములు, అమ్మవారు పోసి యేర్పడిన మచ్చలు, తేంబల్, చెమటకాయలు... మొదలగువానిని పోగొట్టి అందమైన ముఖమును పొందండి. 1 సీసా వెల రూ. 12/-

*మా రంగుల చిత్రము :* మా అనుభవపూర్వకమైన నిజమైన ఫోటోలను ప్రవేశపెట్టియున్నాము. ఏది నిజమైనదని తెలియవలెనన్న మా రంగుల చిత్రమును చూడ వలెను. ఈచిత్రం ఇండియాలో అన్నిస్థలములలోను వెలుబరచియున్నాము. మద్రాసు గ్లోబు, మిడ్‌లాండ్ కోయింబత్తూరు ఈరుదయా, తిరుచ్చి వెల్లింగ్‌టన్ థియేటర్లలో మేము వెలుబరచిన చిత్రములను చూడవలెను. ఆ స్నేహితుని ఫోటోమ పైన ప్రచురించియున్నాము. —: కొత్త స్టాకిస్టులు. :—

V. P. P. విచారణకై వ్రాయండి.—

**జ్యోతి ఆస్పత్రి,**

రిజిష్టర్డు నెం. 216726

పోస్టు బాక్సు నెం. 1413




32, వెంకట నారాయణ రోడ్డు,
టి. నగరు, మద్రాసు-17.
ఫోన్. 440206




# శూరతిలక

మహేష్

'రావడం యింత ఆలస్యమయిందే'మని చూడామణిని ప్రశ్నించాడు. చంద్రరావు.

'నేను మామూలుగానే బయల్దేరాను. గాని దారిలో 'శూరతిలక' పిచ్చయ్య వూరేగింపు యెదురుగా వచ్చింది. దానిని దాటిరావడంతో ఆలస్యమైంది'

'అసలు పిచ్చయ్యకు శూరతిలక అనే బిరదు యెందుకు వచ్చింది?' అని ప్రశ్నించాడు చిదంబరం.

'దానికి చాలా కథ ఉందిరే!'

'ఏమిటాకథ?' అని చూడామణి ప్రశ్నించగా చంద్రరావు చెప్పడం ప్రారంభించాడు.

'ఉన్నట్టుండి ఒకనాడు పిచ్చయ్యకు స్పృహతప్పిపోయింది. పిచ్చయ్య కుటుంబానికి చాలాకాలంనుంచి వైద్యం చేస్తున్న వీరేశలింగం అప్పుడు వూళ్ళో లేడు. అందుచేత మరో డాక్టరును తీసికొని వచ్చారు'. ఆ డాక్టరు యెన్నో పరీక్షలు చేశాడుగాని పిచ్చయ్యకు స్పృహ తప్పిపోవడానికిగల కారణాన్ని తెల్సుకొనలేకపోయాడు. ఏవో కొన్ని యింజక్షన్లను లిచ్చాడు గానీ వాటివలన గుణం కన్పించలేదు. ఇలాగ రెండు రోజు లయ్యాక వీరేశలింగం తిరిగి వచ్చాడు. అతను కూడా పిచ్చయ్యను పరీక్ష చేశాడు. కాని రోగ కారణం తెలియలేదు.

'పిచ్చయ్య యేమిటి చేస్తుండగా స్పృహ తపిపోయింది?'అని పిచ్చయ్య కార్యదర్శిని ప్రశ్నించాడు వీరేశలింగం.

'ఏదో పత్రికను చదువుతూండగా స్పృహతప్పిపోయింది.'

'ఏదా పత్రిక?'

ఇదుగో అంటూ ఒక పత్రికను వీరేశలింగం చేతికి యిచ్చాడు కార్యదర్శి.

ఆ పత్రికను వీరేశలింగం పూర్తిగా చదివాడు. అందులో ఒక చోట అచ్చయ్యకు సన్మానం జరిగిన వార్త ఉంది. బహుశా పిచ్చయ్య జబ్బుకు యిదేకారణమై ఉంటుందనుకొన్నాడు వీరేశలింగం.

'పిచ్చయ్యకు సన్మానం జరిగి యెన్నాళ్ళైందని' ప్రశ్నించాడు. వీరేశలింగం.

'సుమారు మూడు మాసాలయి ఉంటుంది' అని కార్యదర్శి జవాబు యిచ్చాడు.

'అయితే యింక అనుమానం లేదు. పిచ్చయ్యకు యీ మధ్యను సన్మానం జరుగలేదు. అంతేకాకుండా పిచ్చయ్య ప్రత్యర్థి అయిన అచ్చయ్యకు మొన్ననే సన్మానం జరిగింది. అందుచేత వెంటనే మీరు భారీయెత్తున సన్మానం యేర్పాటు చేయకపోతే పిచ్చయ్య మనకు దక్కడు' అని వీరేశలింగం తేల్చేశాడు.

'ఈ లోపున రోజుకు మూడుసార్లు కర్ణరసాయనం వాడండి. వాడినప్పుడల్లా రెండు గంటలసేపు వాడాలి' అని వీరేశలింగం కార్యదర్శితో చెప్పి యింటికి వెళ్ళిపోయాడు.

'కర్ణరసాయనం అంటే యేమిటో యిక్కడ కొంచెం వివరించవలసి ఉంది. కొన్నాళ్ళక్రిందట పిచ్చయ్యకు చాలా నీరసం చేసింది. డాక్టర్లు యెన్నో యింజక్షన్లు చేశారు. టానిక్కులు వాడారు కానీ గుణం ఏమీ కన్పించలేదు'.

వీరేశలింగం కూడా యేవో మందులు వాడాడు కాని అదికూడా పనిచేయలేదు. అప్పుడు వీరేశలింగం పిచ్చయ్య దేహతత్వాన్ని గురించి ఆలోచించాడు. అప్పుడు అతనికి ఒక విషయం గుర్తుకువచ్చింది. పిచ్చయ్యకు యెప్పుడు సన్మానం జరిగినా, సన్మానానికి ముందు పదిహేను రోజులు తరువాత పదిహేను రోజులు అతని బరువు సుమారు యిరవై పౌనులు పెరుగుతుంది. అందుచేత దానికి సంబంధించిన చికిత్స వల్లనే గుణం కన్పిస్తుందనుకొన్నాడు వీరేశలింగం.

వీరేశలింగం సలహాప్రకారం పిచ్చయ్య కార్యదర్శి వాద్య బృందంతోసహా వెంటనే రావలసినదిగాకోరుతూ ఒక సినిమా నేపథ్యగాయకుడికి టెలిగ్రాం మని యార్డరు పంపించాడు. ఈలోపున వీరేశలింగం పిచ్చయ్యమీద ఒక శతకం దండకం కూడా వ్రాయించాడు.

నేపథ్యగాయకుడు వాద్యబృందంతోసహామూడో నాటికి వచ్చాడు. పిచ్చయ్యకు యిదివరకు సమర్పించిన సన్మాన పత్రాలకు, పంచరత్నాలకు, దరిమిలా వ్రాయించిన దండకానికి శతకానికి కూడా హిట్టయిన హిందీపాటల వరుసలో ట్యూన్లు కట్టారు. వాటి నన్నింటినీ నేపధ్యగాయకుడు పాడగా ఒకటేపు రికార్డరుమీద రికార్డు చేశా. వారంరోజులపాటు ఉదయం రెండుగంటలసేపు సాయంత్రం రెండు గంటలసేపు ఆ రికార్డు వినగా పిచ్చయ్యకు పూర్వపు బలం తిరిగి వచ్చింది. ఆ టేపుకే కర్ణరసాయనం'అని పేరు పెట్టాడు వీరేశలింగం.

పిడతలపాడులో ఉన్న పిచ్చయ్య అభిమాన సంఘాధ్యక్షుణ్ణి వెంటనే రావలసినదిగా టెలిగ్రాం మనియార్డరు పంపారు. ఈలోపున పిచ్చయ్యకు కర్ణరసాయనం వాడడం ప్రారంభించారు.

'పిచ్చయ్య అభిమానసంఘాధ్యక్షుడైన భజనయ్య మర్నాటి సాయంకాలానికి వచ్చాడు. కర్ణరసాయనం వినగానే కాళ్ళు చేతులు ఆడిస్తున్న పిచ్చయ్య భజనయ్య మాటలను విని కళ్ళు విప్పాడు. ఇంక గండం గడచినట్లేనని ధైర్యం చెప్పాడు వీరేశలింగం.'

'డబ్బుయివ్వాళ వస్తుంది. రేపు పోతుంది. ప్రాణంకంటే డబ్బు యెక్కువకాదు. అందుచేత యెంత డబ్బు ఖర్చు అయినాసరే యీసారి పిచ్చయ్య సన్మానం భారీయెత్తున జరిగి తీరవలసిందేనని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు పిచ్చయ్య అన్నగారు'.

అంతేకాదు మొన్న జరిగిన అచ్చయ్య సన్మాన సభలో గంటన్నరకు పదిసార్లు చప్పట్లు కొట్టారంట అంటే సగటున తొమ్మిది నిమిషాలకు ఒకసారి చప్పట్లు కొట్టారు. మన సభలో యింకాయెక్కువ చప్పట్లు ఉండాలి. ప్రతిఅయిదు నిమిషాలకు ఒకసారి అంతా చప్పట్లు కొట్టి తీరవలసిందేనన్నాడు పిచ్చయ్య కార్యదర్శి.

ఈ మాటలన్నీ పిచ్చయ్య పడుకొన్న గదిలోనే జరగాలని వీరేశలింగం సలహా యిచ్చాడు. ఆ ప్రకారమే యీ మాటలన్నీ పిచ్చయ్యపడుకొన్న గదిలోనే జరిగాయి. ఈ మాటలను వినగానే పిచ్చయ్య లేచి కూర్చొని తనుకూడా మాట్లాడడం ప్రారంభించాడు.

'ఈసారి సన్మానసభ మామూలుగా జరుగడానికి వీలులేదు. అందులో కొత్తదనం ఉండాలి' అని యెలాగో వోపిక తెచ్చుకొని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు పిచ్చయ్య.

కొత్తదనం ఉంటే బాగానే ఉంటుంది కాని కొత్తదనం రావడానికి యేమి చేయాలి? అంటూ అందరూ ఆలోచించడం ప్రారంభించారు. ఆఖరుకు పిచ్చయ్య కార్యదర్శి యిలాగ అన్నాడు.

సన్మానసభలుకు మంత్రులు, సినిమా తారలు రావడం మామూలయిపోయింది. ఇక బుర్రకథలు హరికథలు భరత నాట్యాలు చాలా సన్మానసభల్లో జరిగాయి. అందుచేత వీటిల్లో కొత్తదనం యేమీలేదు. కాబట్టి మన సన్మాన సభా కార్యక్రమంలో శాంతికపోతాన్ని పిచ్చయ్యగారు యెగరవెయ్యడం కొత్తదనాన్ని తీసికొని వస్తుంది.

'శాంతికపోతాన్ని యెగరవెయ్యడం బాగా ఉంటుంది కాని సినిమాతార సభకు రాకపోతే సభ కళకట్టదు. జనంకూడా అంతగా రారు. అందుచేత సినిమా తారకూడా మన సన్మాన సభకు రావలసిందేనని తన నిశ్చయాన్ని పిచ్చయ్య వెల్లడించారు.

'ఇవన్నీ యేర్పాటు చేయాలంటే చాలా డబ్బు ఖర్చు అవుతుందన్నాడు భజనయ్య.

'సరే అలాగే కానియ్' అంటూ పిచ్చయ్య అన్నగారు లోపలకు వెళ్ళి డబ్బు తీసికొనివచ్చి భజనయ్య చేతికి యిచ్చాడు.

భజనయ్య అందరి దగ్గరా సెలవు తీసికొని పిడతలపాడు తిరిగి వచ్చాడు. వెంటనే పిచ్చయ్య అభిమాన సంఘ సర్వసభ్యసమావేశాన్ని యేర్పాటు చేశాడు భజనయ్య.

ఆ సమావేశంలో, తాను పిచ్చయ్య దగ్గరకు వెళ్ళడం అక్కడ జరిపిన సంభాషణలు యావత్తూ పూసగుచ్చినట్లుగా భజనయ్య సభ్యులకు చెప్పాడు. 'ఏిహారంతా సన్మానసభలో ప్రతి అయిదు నిమిషాలకు ఒకసారి చప్పట్లు కొట్టవలసి ఉంది'అని భజనయ్య సభ్యులను హెచ్చరించాడు.

'అలాగ అయిదు నిమిషాలకు ఒకసారి చప్పట్లు కొట్టాలంటే ఒక చిక్కు వస్తుంది' అని సభ్యుడైన అప్పారావు హెచ్చరించాడు.

'ఏమిటాచిక్కు? అని భజనయ్య ప్రశ్నించగా అప్పారావు చెప్పడం ప్రారంభించాడు.

(తరువాయి—వచ్చేవారం)

# ఒక వారం విపరీతం




ఫాలాక్షుడు

## మాయమైన బ్రిడ్జి!

గోవాలోని పోండా జిల్లాలో కనీవినీ ఎరుగని అద్భుతం ఒకటి జరిగింది. షేమెపలాన్ అనే చోట కట్టబడ్డ బ్రిడ్జి ఒకటి మాయమయ్యిందట. ప్రభుత్వం దానికోసం వెతుకుతున్నారు. ఆ బ్రిడ్జి బ్లూప్రింటులూ, దానికయిన ఖర్చులు మంజూరు చేసిన వివరాలూ అని రికార్డులు వున్నాయట. ప్రభుత్వ అధికారులు ఆ బ్రిడ్జిని తనిఖీచేసే రహదారిగా, ప్రారంభోత్సవం చేసినట్లు [illegible]టించి




నట్లూ నిదర్శనలు దొరికినా, అసలా ప్రదేశంలో బ్రిడ్జికట్టిన ఆనవాళ్ళు మాత్రం లేవట. మిత్రలాభం కథలలో లాగ పావురాళ్ళుగాని, కాకులుగాని ఒకటిగా జేరి ఆ బ్రిడ్జిని ఎత్తుకుపోడానికి వీల్లేదు కదా! గోవా ముఖ్యమంత్రి శ్రీ బండోద్కర్ యీ సందర్భంలో మాట్లాడుతూ దేశ చరిత్రలో యిది విడ్డూరం అన్నారట— అలా అనడమూ విడ్డూరమే— కదూ!

## తమాషా వ్యాపారం!

బొంబాయిలో ఓ తమాషా వ్యాపారం బయట పడింది. అందమైన అమ్మాయిలను పట్టి అరేబియాకు పంపించే ముఠా పట్టుబడింది. ఈ ముఠాలో ఆడవాళ్ళు కూడా వున్నారట. అందమైన ఆడవాళ్ళను అరేబియాలో అమ్ముతున్నారట. ఆనాటి బానిసల అమ్మకం వాసన యింకా వుందన్న మాట!

## సినిమా నటిపై కేసు!

సినిమా నటి జానకి తనని చెప్పుతో కొట్టానని అరుస్తూ చెప్పు తీసిందని ఓ తమిళ సినిమా సంస్థకి చెందిన ఉపేంద్రన్ అనే ఆయన ఆమె మీద కేసు పెట్టారట. కాల్‌షీట్‌కి పిలవడానికి వెళితే ఆవిధంగా ప్రవర్తించారామె అని ఉపేంద్రన్— తెలియజేశారు.

* * *

తమిళ నటుడు యం. జి. రామచంద్రన్ నటించిన కణవన్ (భర్త) అనే సినిమా మధురలో ఒక హాలులో విడుదలయ్యింది. 80 పైసల టిక్కట్టుక్యూ తొక్కిడి ఎక్కువై, పైన వేసిన ఆస్బెస్టాస్ పలకలు కూలి, ఆ తొక్కిడిలో ఒకవ్యక్తి అక్కడే చనిపోయాడట. ఆసుపత్రిలో చేర్చిన ముగ్గురిలో మరొక వ్యక్తి చనిపోయాడు. ఆ సినిమా అధిపతులు వారి కుటుంబాలకు 5 వేల విరాళం యిచ్చారనీ, యం. జి. రామచంద్రన్ నిధి సేకరించుతున్నారని వార్త. ఇదేవిధంగా అంబసముద్రంలో "రహస్య పోలీసు 115" అనే సినిమా ఆడుతుండగా జరిగిన తొక్కిడిలో ఒకవ్యక్తికి వెన్ను విరిగిపోయి, ఆసుపత్రిలో చేర్చాక, మరణించాడట. ఇదీ యం. జి. ఆర్. సినిమాయే!

* * *

వరలక్ష్మి అనే ఆవిడ తన భర్త చనిపోయాక తనని పరామర్శించడానికి వచ్చే సుబ్రహ్మణ్యం అనే అతన్ని ప్రేమించి, అతన్ని వివాహం చేసేసుకుందట. దానికి ఆ వూరువాళ్ళు హర్షించక, గోల చేసేసరికి మనస్సు విరిగి, తను పెంచుకుంటున్న పసిపిల్లాడు రవితో సహ నూతిలో దూకి, ఆత్మహత్య చేసుకుందట. ఇది అరుంధతి పాళాయంలో జరిగింది.



## నిరాకరణ - ఆత్మహత్య

కరుమాత్తూర్ అనే గ్రామానికి చెందిన బిచ్చెమ్మాల్ అనే ఆమె హోమియోపతి డాక్టరుగా ప్రాక్టీసు చేసుకుంటోందట. ఆమెకు యస్. కె. రాజు అనే వ్యక్తితో సంబంధం వుందట. ఆ రాజు ఆమెను ఒకవెయ్యి రూపాయలు యివ్వమని అడిగాడట. బిచ్చెమ్మాల్ నిరాకరించేసరికి తుపాకీతో ఆమెను కాల్చాడట. ఆర్తనాదం విని జనం వచ్చేసరికి అతను పెరటి దోవన తన యింటికి వెళ్ళి విషం తాగి చనిపోయాడట. అయితే డాక్టర్ బిచ్చెమ్మాల్ మాత్రం ఆసుపత్రిలో కోలుకుంటుందట.

* * *

మనకు రాబోయే రోగాలకు, వచ్చే కలలకు సంబంధ బాంధవ్యాలున్నాయని మాస్కో (రష్యా)లో




డాక్టర్ కసాట్కిన్ అన్నారు. కొండ ఎక్కుతూ బాధ పడుతున్నట్టు, సుడిగుండంలో పడి బయటికి రాలేకపోయినట్టు, గుండె మీద ఏదో పర్వతం పెట్టినట్టు బాధ పడుతున్నట్టు— యిటువంటి కలలు వస్తే క్షయ, బ్రాంకైట్స్ వంటి రోగాలు రావచ్చని ఆయన అన్నారు. రాబోయే రోగాలను హృదయం, మెదడు పసిగట్టడమే దీనికి కారణం అని ఆయన అన్నారట— మనలో ఎవరికైనా యిలాటి కల వస్తే!!

**ఎమ్. ఆర్. ఎస్, మద్రాసు**

భార్యా భర్తలమధ్య రహస్యాలుండ కూడదా ?

ఉండకూడదనే నా అభిప్రాయం.

**బి. డి. ఏ, కామారెడ్డి**

ఈ కాలములో సుఖముగా జీవించే మార్గము ఎలాగండి ?

ఏముందీ ఆడపిల్ల అయితే పెళ్లిచేసుకోవడం (భర్త పోషిస్తాడు) మగవాడైతే బ్రహ్మచారిగా ఉండడం (తనసంపాదన తనే తినొచ్చు) సులభంకదూ?

**ఎం. ఎల్, ఆదిలాబాద్**

అక్కయ్యా, మీ జవాబులు చూస్తూంటే మిమ్మల్నెక్కడో చూసి నట్టుంది. దానికి కారణం సెలవిస్తారా ?

బహుశా జవాబుల్లోని ఆత్మీయత కారణం అందామా సోదరీ?

**ఎం.వి.ఆర్.బి.ఎల్, ఉరవకొండ**

కళలను వ్యాపారంగా మార్చి కళాదేవులు జీవనోపాధిగా కళారంగాన్ని స్వీకరించిన ఈ రోజుల్లో సాహిత్యం కూడా అదే స్థాయిలో తన స్థానాన్ని నిలుపుకుంటుందని చెప్పడం సాహసం కాదేమో?

సాహసం కాదు సోదరీ పచ్చినిజం. చేతనైన కళను జీవనోపాధికని వినియోగిస్తే దోషం లేదు. రచననే వృత్తిగా స్వీకరించిన వారినాడు ఎందరో ఉన్నారు.

**జె. ఎం. డబ్ల్యు, కొత్తగూడెం**

ఏమండీ అక్కయ్యగారూ, పెండ్లికాని పిల్లల మనస్సులో కలిగే ఆలోచనలు ఏమిటో వివరంగా సెలవిస్తారా ?

ఆలోచనలు పైకెలా తెలుస్తాయి సహోదరా!

**కె. పి. ఎస్. బి, నిడుబ్రోలు**

లక్ష్మిగారూ. ఒకమ్మాయి నన్ను చూస్తుంది. కాని నేను కూడా ఆమెను చూద్దామని తలయెత్తితే నాలుక కొరుక్కుని లోనికి వెడుతుంది ఎదుట భయపడి నట్టు నటిస్తుంది. చాటున ఎవరైనా మావాళ్లని నా సంగతి అడుగుతుంది. ఆ అమ్మాయి నన్ను ప్రేమిస్తోందంటారు నా మిత్రులు. నేను కాదంటాను...మరి మీరో?

ఉట్టినే కాదంటున్నావేగాని— పడ్డావనుకో ప్రేమలో!

**ఎస్. ఎం, కదిరి**

నీవు నేను అను పదములకు తేడా ఏమిటి? నీవు నేను దేనికి లొంగి ఉండవలయును ?




ఐక్యభావం ఏర్పడితే 'నేను నీవు' ఒకటే. ఎవరికెవరు లొంగడం అనే ప్రశ్నేలేదు.

**ఎస్. పి, జగిత్యాల**

ప్రస్తుతం దేశంలో చెలరేగుతున్న అరాచకానికి, అశాంతికి మూలకారణం ఏమై ఉంటుందంటారు?

అన్నిటా అసంతృప్తి.

**ఎమ్. ఆర్. ఎమ్, మద్రాసు**

బ్రతకలేను. కాని ఆత్మహత్యా చేసుకోలేను అనే వాళ్లకు మీ సలహా ఏమిటీ

చచ్చినట్టు బ్రతకమని....

**జి. ఎస్. ఆర్, హైదరాబాదు**

ప్రెస్సు మీద నిఘాపై మీ అభిప్రాయం?

ఏముందీ? 'చేతిపై గంటము వస్తే
కోతికి సివమెత్తినట్లు కొందరు మంత్రుల్
నీతి ఎరుంగక బిగుతురు. ...!'

**ఎ. ఎమ్. ఆర్, రాజమండ్రి**

కొందరు కొందరిని పొగుడుతే చుట్టూ వాళ్లు అదోలా చూస్తారెందుకు?

చేసిన పనిని అంతా మెచ్చుకుంటే తప్పు లేదు. కాని మెప్పుకోసం కొందరు కొన్ని పనులుచేస్తూ ఉంటారు అలాంటప్పుడే అదోలా చూడ్డం జరుగుతుంది.

**ఎస్. సి హెచ్. ఆర్. కటక్**

నేనొక అమ్మాయిని ప్రేమించాను. ఆ అమ్మాయి నన్ను ప్రేమిస్తోంది. 'దాని' మాతృభాష నేపాలీ. కాని హిందీ వచ్చు. నాకు హిందీ అంటే పరమ అసహ్యం. నా మాతృ భాష తెలుగు. ప్రేమలేఖ రాద్దామన్నా నేపాలీ రాదు. దానికి ఇంగ్లీషు రాదు. సమస్య నెలా పరిష్కరించే దత్తయ్యా ?

తమరు 'దాని'కంటే ఏమిటో అనుకున్నాను అల్లుడూ! అమ్మాయికా!! ఆమెకి వచ్చిన భాష పట్ల తమరు అసహ్యం పోగొట్టుకోడం ఒకదారి. ప్రేమకి తిలోదకాలివ్వడం రెండోదారి. అమ్మాయిని గౌరవించడం చేతకాకపోతే రెండోదారి చేపట్టు.

**టి. ఆర్. కె, పిఠాపురం**

ఈ కాలంలో మూఢనమ్మకాలను నమ్మవచ్చాండీ?

మూఢనమ్మకాలకి ఏకాలమైనా ఒకటే సోదరా, నమ్మడం, నమ్మక పోవడం మన మానసిక పరిణతిని పట్టి ఉంటుంది.

**సి. ఎల్. కె, హైదరాబాదు**

భర్తలెలా ఉండాలి మీ దృష్టిలో?

సతికి ఉచిత గౌరవం బిచ్చి సతతము కృపను
కాంచి, ఏకపత్ని వ్రత కలన నిల్చి
అన్య లామెను మన్నించునట్లు చేసి
తగిన నగలిచ్చి పోషింపతగును మగడు!

**శాంతమూర్తి, హైదరాబాదు**

ముక్కు పచ్చలారని చిన్నపిల్లల్ని తీసుకువెళ్లి ఇంగ్లీషు మీడియమ్ స్కూల్లో చేర్పించి 'అ ఆ'ల కంటే ముందు ఎ బి సి డి లు నేర్పించడం అంత మంచిదంటారా?

కాదు. దారుణం. స్కూలంటే పీడగా భావిస్తారు అలాంటి పిల్లలు. ఒక వయస్సు (కనీసం ఏడెనిమిది సంవత్సరాలు) వచ్చేదాకా మాతృభాషలో చదువు నేర్పిస్తే ఉత్సాహం కల్గుతుంది. తరువాత ఏ మీడియమ్‌కు మార్చినా బాధ ఉండదు.

**ఎస్. ఎస్. ఎన్, పిఠాపురం**

రచయితల లక్షణాలేమిటి? రచయిత అవ్వాలంటే ఏం చెయ్యాలి?

ఆ లక్షణా లేమిటో నాకు తెలియవు. కాని వరంగల్లు రచయితల సభలకి వచ్చి రచయితలని చూసి నిరుత్సాహ పడ్డట్టు సూచించారు సోదరి పవని నిర్మల ప్రభావతి వారి ఆకార వికారాల మీద సోదరి వాసిరెడ్డి సీతాదేవికి వేరే అభిప్రాయం ఉన్నట్టు సూచించారు. రచయిత లెలా ఉండాలి? అని ఇప్పుడు ఏారడుగుతే నేనేం చెప్పను? పై సోదరీమణు లేం తేలుస్తారో వేచి చూద్దాం బ్రదర్. ఇక రచయిత అవడానికి పెద్ద చిట్కాలేం లేవు— రాస్తూ ఉండడమే. గుడ్డివాడి చేతి రాయిలా ఏదో ఒకటి అచ్చుపడ్డంతో రచయితగా మారి పోతావు.

మీ జీవితంలో ఏదైనా గొప్ప ఘనకార్యం చేసారా ?

రోజూ చేస్తూనే ఉంటాను. ప్రతిసారి వంట చేసి నప్పుడు, ప్రతిసారి ఓ కథ రాసినప్పుడు గొప్ప ఘనకార్యం చేసినంత గర్వపడే అల్పబుద్ధి నాది!




"అదండీ సంగతి!" అన్నాడు జాయింట్ సెక్రటరీ.

"ఏమి సంగతోనయ్యా..... రేప్పొద్దున్న ఏ పార్లమెంటుమెంబరో, పబ్లిక్ అకవుంట్స్ కమిటీ మెంబరో పట్టుకుని ఝూడించి పారేస్తాడు. ఏవిటీ దుబారా ఖర్చు — అంటూ........ 16 లక్షలని అంచనా వేసి మొదలెట్టిన ఈ భవన నిర్మాణం అంతా ముగిసేసరికి 42 లక్షల యిందనడం కాస్త ఎబ్బెట్టుగానే వుందిస్మీ—"అన్నాడు సెక్రటరీ.

"అయ్యా! మీరు దీని గురించి హేమీ విచారపడకండి. అదేదో నాగార్జునసాగరని ఆంధ్రాలో కడుతున్నారే దాని సంగతి చూడండి. ఏ 79 కోట్లో అవుతుందని మొదలెట్టారా, తీరాచేస్తే సగంపని కూడా పూర్తికాలేదు. కాని ఖర్చు మాత్రం వందరెట్లు అయిపోయింది. దానితో పోలిస్తే మన భవనం ఎంతో మేలు కాదుటండీ—" అన్నాడు జాయింట్ సెక్రటరీ.

"అవుననుకో—!" అని నస్సుగుస్తున్న సెక్రటరీకి మరికాస్త ధైర్యం నూరిపోయసాగాడు జాసెక్.

"ధరల పెరుగుదల— డివాల్యుయేషను—పనివాళ్ళసమ్మె—ఇట్లా ఎన్ని బలాతిబలమైన కారణాలు లేవండీ ఈ ఖర్చు పెరగడానికి...... కనుక మీరేమీ ఇదవకండి..... అట్లాంటి 'క్వెరీ' అంటూ వస్తే డబుల్ స్ట్రాంగ్ నోట్ ప్రిపేర్ చేయించిస్తానుగా..."

జాసెక్ తెలివితేటలు చూసి కాస్సేపు సంతోషపడి ఆతర్వాత భయపడనారంభించాడు సెక్.

"ఏటన్నిటికన్న ముఖ్యమైన కారణం వోటుందండోయ్...." అని జాసెక్, కుర్చీలోంచి లేచివెళ్ళి గది తలుపు గడియ గట్టిగా వేసివచ్చి, కూర్చుని రహస్యంగా చెప్పాడు. "ఈ భవనం తాలూకు కంట్రాక్టు ఎవరిదనుకున్నారూ...... మన మంత్రిగారి అల్లుడిదండీ బాబూ! సాక్షాత్తూ శ్రీవారి జామాతది! ఇహ మనకు బెంగెందుకు చెప్పండి. ఇంతటి తురుఫాసు మనచేతవుంది కనుకనే పనిలోపని మీ ఇంటి ఫస్టు ఫ్లోర్ కానిచ్చెయ్యండీ— అని నేను మనవి జేశా!... మరి మీరేమో విసరైతిరీ....."

అయ్యబాబోయ్, ఈ జాసెక్‌గాడు దేవాంతకుడు. —వీడు ఇక్కడే గనుక మరి కొన్రోజులుంటే నాకే ఎసురు పెట్టేయగలడు..... వీడినింకో శాఖకు వేయించేయడం చాల అవసరం — మోస్టు ఇమ్మీడియట్— అని లోలోపల తీర్మానించుకున్న సెక్, బయటికి మాత్రం తలవూపి, చిరునవ్వు నవ్వి, ఫైలు మీద సంతకం పెట్టేశాడు.

—అక్కడితో, పదకొండేళ్ళ క్రిందనుండి, అనగా 'కిరణ్ భవన్' నిర్మాణ ప్రతిపాదన మొదలయినప్పటినుండి సదరు ఏడంతస్తుల భవనం పూర్తయి, దానిలోకి కుళాయిలు, దీపాలు వచ్చేదాక—జరుగుతూ, పెరుగుతూ వచ్చిన ఇరవైయూరు వాల్యూముల ఫైలు—ముగిసింది.

తర్వాతి దశ ప్రారంభమయింది.

ఏమిటా దశ?

ఉత్సవాల దశ!

ప్రభుత్వ భవనం దేనికయినా ఒక ఉత్సవం కావాలి. ప్రారంభోత్సవం, ఆవిష్కరణ మహోత్స

వం కావాలి. ఆ ఉత్సవానికి అధిష్ఠాన దైవంగా ఒక అమాత్యులను పిలవ్వాలి. వారు ప్రసంగం ఇవ్వాలి. మీటనొక్కాలి. లేదా రిబ్బను కత్తిరించాలి. అప్పటికికాని ఆ భవనం బ్రతుకు మొదలవదు.

నిజానికి గుమాస్తాలూ, ఫైళ్ళూ, సిరాబుడ్లూ కిరణ్ భవన్‌లో కాపురం మొదలెట్టిన నెలరోజుల తర్వాత, సెక్ జాసెక్ లిద్దరూ కుస్తీలుపట్టి—పందిళ్ళు వేయించి, ఆర్క్ దీపాలు వేయించి, పూల మొక్కలు అద్దెకు తెప్పించి, తివాసీలు పరచి, సోఫాలు వేయించి, పత్రికలవారిని పిలిపించి, ఫోటోలు ఏర్పాటు చేయించి, అల్పాహారవిందు కావించి—నిష్ఠ విధివిధానమూ తప్పకుండా ఉత్సవం కావించారు.

ఉత్సవ విగ్రహం గారు— అదే మంత్రిగారు అనర్గళంగా, అజేయంగా అయోమయంగా—మాట్లాడేస్తున్నారు.

''ఈనాడే గనుక వాల్మీకి మహాముని బ్రతికివుంటే ప్రియతమమైన మన భారతవర్షపు ప్రగతిని చూచి ఎంత గొప్పకావ్యం రాసేవాడో.....'' అని ఆలోచిస్తూ ఒక నిముషం—

''నా చిన్నప్పుడు మా కోనోరిపాలెంలో ఏం జరిగిందంటే—'' ఆత్మకథ చెబుతూ మరో నిముషం—

''మన సరిహద్దులలో పొంచి వున్నారు. వేచి వున్నారు. కాచుకొని వున్నారు. నక్కి వున్నారు.. వున్నారు. వున్నారు...... ఎవ్వరు?? మన శత్రువులు—'' అని హెచ్చరిస్తూ మరో నిముషం.....''

''కనుక, ఈ క్లిష్ట పరిస్థితులలో మీరు, మీ జీతం వంద రూపాయలయినాసరే, ఏదో కొంత పొదుపు చేయాలి. ఆ పొదుపే మన దేశానికి మదుపు'' అని ఉద్బోధిస్తూ, అంతకుముందారగించిన జాంగిరీలను త్రేనుస్తూ మరు నిముషం—

ఈ విధంగా మంత్రిగారు మూట రెండవ నిముషం తమ ఉపన్యాసాన్ని పేల్చేస్తుండగా, అక్కడకు చేరివున్న రెండువందల చిల్లరమంది శ్రోతల నదనా కాశాలలో మాత్రమేగాక, దేవుడు మననెత్తిమీద పెట్టిన ఒరిజినల్ ఆకాశంమీద కూడా కారు మేఘాలావరించాయి.

సెక్ జాసెక్ వైపు చూశాడు.

జాసెక్ చూపులతోనే— ''మన్నేముందండీ.... ప్రస్తుతం మంత్రి రూపంలో వున్న భగవంతుడి చేతి కీలుబొమ్మలం ...నిమిత్తమాత్రులం....'' అని చెప్పాడు.

విలేకరులు వెళ్ళిపోయి వాళ్ళ పత్రికలకు రిపోర్టు విచ్చివేయడం కూడా ఐపోయింది.

శ్రోతలూ ''బయటకుదారి'' వైపు జారుకోసాగారు.

వాన చినుకులూ పడసాగాయి.

వో ఇరవై నిముషాల తర్వాత, షామియానా తప్పతడిసి, వో సందుగుండా వాననీరు కారి, మంత్రిగారి తెల్లటి షెర్వాణీమీద చల్లగా నల్లగా పడింది.

ప్రసంగ ప్రవాహం ఓ క్షణం ఆగింది.

ప్రక్కకు తిరిగి ఆయన సెక్‌తో—''వర్షం పడుతూందేమిటి?'' అన్నారు.

సెక్ హడావిడిగా లేచి, చేతులు కట్టుకుని, అతి వినయముగా ''అవున్సార్.... వర్షమే సార్...పడుతూంది......'' అని మనవి చేశాడు— అవాడు వర్షానికి ఏమీ భయభక్తులు లేకుండా వున్నందుకు తానేంతో చింతిస్తున్న ధోరణిలో.

దాంతో మంత్రిగారు ''మన కావ్యాలలో వర్షం'' అన్న విషయం మీద సోదాహరణంగా ప్రసంగం ఎత్తుకున్నారు. ఈ పాటికింకా వుండిన అరవై ఇద్దరు ఇద్దరు శ్రోతలలో నికరంగా ఆర్గురు మిగిలారు. ఆమహాసభలో..... ఆ ఆర్గురిలో ముగ్గురు సెక్కూ, జాసెక్కూ మరియు మంత్రిగారూ!

సరే ఎలాగయితేనేం, కిరణ్ భవనం, ఆ శనివారం సాయంకాలం ఏడున్నర గంటలప్పుడు జడివానలో మంత్రిగారి ఆశీస్సులతో ఆవిష్కరింపబడింది.

ఆరాత్రి సెక్— ఇంకా జాసెక్ గాడిని వదలించుకోవడం ఒక్కటే బాకీ— అన్న తలపుమినహాయిస్తే హాయిగా ఆదమరచి నిద్రపోయాడు. అవివాహితుడైన జాసెక్కూ జమ్మున నిద్రాదేవి బిగికౌగిలిలోకి వెళ్ళిపోయాడు......

కాని ఆ సాయంకాలం మంత్రిగారు ప్రసంగాన్ని కురుస్తుండగా మొదలయిన వర్షం మాత్రం—నిద్ర కాదుకదా కునుకయినా లేకుండా కురవసాగింది.

శనివారం రాత్రెల్లా కురిసి, ఆదివారం పగలెల్లా కురిసి, కురిసి, ఆదివారం రాత్రిలోకి కూడా తన తడి తడి అడుగులతో నడచి వెళ్ళడానికి సిద్ధమయింది వర్షం.

ఆ ఆదివారమంతా, సెక్,జాసెక్ ఆదిగాగల నాగరికులు ఎవరిళ్ళల్లో వాళ్ళుగా, ఏదో విధంగా పొడి పొడిగా కాలక్షేపం చేశారు.

ఆదివారం రాత్రి..... అర్ధరాత్రి గడిచాక..... సెక్ గారింట టెలిఫోన్.... మహాసభలో మంత్రిగారి పలె, అదేపనిగా అరవసాగింది.

సెక్‌గారి భార్య ఫోన్ అందుకుంది.

అవతల జాసెక్ ఉన్నాడు. 'నీ మొగుణ్ణి లేపవమ్మా తల్లీ'' అని బ్రతిమాలుతున్నాడు.

ఏ అరవైమంది సభ్యులో ఉన్న పళంగా అవతలి పార్టీలోకి వెళ్ళి పోయారేమో, తత్ఫలితంగా ప్రభుత్వంకాస్తా పడి పోయిందేమో అనుకుంది 1967 లో ఈదేశంలో జీవించిన ఆ ఇల్లాలు.

వెంటనే నాథుడిని లేపింది.

మొదట నిద్రమత్తుతో 'లో... లో....' అంటున్న సెక్రటరీ మరునిముషం కళ్ళు తెరచి, నోరింకా తెరచి— ''హెవిటి!?!'' అన్నారు.

ఆయన గొంతులోని ఆందోళనను విన్న ఇల్లాలు —ఇదేదో కేవలం పార్టీల ఫిరాయింపు కాదు ..... సైనికుల తిరుగుబాటే— అనుకుంది. గజగజ వణికిపోం ంది.

''అయ్యా! మన కిరణ్ భవనంలోని బేస్‌మెంట్, గర్భగృహం వుంది చూశారూ! అదిపూర్తిగా నీళ్ళతో నిండిపోయిందట. ఫైళ్ళూ, కుర్చీలూ తేలుతున్నాయట......'' అన్నది జాసెక్ చెప్పిన దాని సారాంశం. సెక్‌కు బుర్ర బద్దలయినంత పనయింది.

''ఒకవేపు కొంపంటుకు పోతుంటే.... ఐయామ్ సారీ ..... కొంప మునిగి పోతుంటే..... తాపీగా ఫోన్ దగ్గర కూచుని మాట్లాడుతావేమిటయ్యా.... తక్షణమే అచ్చోటికి అంఘించి, ఫ్లష్ చేసి, రిపోర్టు తయారు చెయ్యక.....'' అని కోప్పడిన సెక్రటరీ ఐ. సి. ఎస్.గారు—''ధూర్తే రి... ఈ ఐ. ఏ. ఎస్. గాళ్ళెప్పుడూ ఇంతే'' అని విసుక్కున్నాడు.

జాసెక్ ఇంకా పూర్తిగా ప్రభుత్వోద్యోగి అయిపోలేదు. కనుక కొంత మామూలు జ్ఞానం అతడిలో మిగిలివుంది. అందుకనే—''రిపోర్టు సరే తయారు చేస్తానుకోండి.. ఇపుడా నీళ్ళను అక్కడనుండి తీయాలి — అది మన మొదటి కర్తవ్య మనుకుంటానండి'' అన్నాడు.

''వాటెవరిటీస్.. నువ్వు తక్షణం కారు తీసుకుని ఇక్కడికి రావోయ్. నేనీలోగా చీఫ్ ఇంజనీర్‌ని పిలుస్తాను. ముగ్గురం కలిసి వెళ్దాము''అని సెక్ ఫోన్ పెట్టేసి, వో కప్పు తేనీరు సేవించి, బట్టలు మార్చుకుని, టై, గట్రా బిగించి సిద్ధమయ్యే సరికి చీఫ్ ఇంజనీరూ జాసెక్కూ వచ్చారు.

ముగ్గురు కలిసి కారులో బయలుదేరారు.

కిరణ్ భవనానికి నలభై గజాల దూరాన కారాపారు.

ఇరవై అడుగుల దూరాన రెండడుగుల లోతు నీటిలో రోడ్డు మీద నిలబడి చూశారు.

కిరణ్ భవన్—సముద్రం మధ్య వోడలా వుంది.

పరీక్షిత్తు మహారాజు కట్టించుకున్న ఒంటి స్తంభం మేడలా వుంది.

వానవేళప్పుడు ఆడుకుంటున్న కాగితం పడవలా వుంది.

జాగ్రఫీలో చెప్పే 'ద్వీపము'న కో చక్కని ఉదాహరణలా వుంది.

సెక్ స్కైకి చూశాడు. వర్షం ఆగినట్లనిపించింది. నక్షత్రాలు బయట పడడానికి సిగ్గుపడుతున్నట్లున్నాయి.

''ఎంత, రెండడుగుల నీరుందేమో''.. అన్న అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు సెక్.

''కాదండి ... ఈ రోడ్డు మీదే రెండడుగులుంది కనుక అక్కడ కనీసం పదహారడుగులయినా వుండాలి'' అన్నాడు జాసెక్.

''ఎందుకని?'' అని అడిగాడు సెక్.

''బేస్‌మెంట్ వుందికదండీ.. అందుమూలాన్ని''

అవును బేస్‌మెంటుంది. ఆ ఏడంతస్తుల కిరణ భవన్‌లో క్రింగి అంతస్తుకు క్రిందుగా నేల మట్టానికి దిగువగా ఒక భూగర్భగృహం లాంటిది ఉంది. రికార్డులకని, స్టోర్‌కని, ఫర్నిచర్‌కని, అది వుంది.

ఇంజనీర్ మొదట వేసిన ప్లాన్‌లో అది లేదు. కాని మరో లక్ష రూపాయలతో బోలెడంత చోటు కలిసి వస్తుంది. అన్న మంత్రిగారి సలహా మేరకు ఆభూగర్భ గృహం నిర్మించబడింది. దానిలోకి మొన్న శనివారంనుండి తిన్నగా వాననీళ్ళు మాత్రమే కాక రోడ్డు మీదినీళ్లుకూడా ప్రవహించ సాగాయి. వారి నీరు వల్ల మేరు గు ను క దా ! భవుతిక శాస్త్రంలోని సూత్రం మేరకు రోడ్డు మీది నీటి మట్టమూ కిరణ్ భవన్ ఆవరణలోని నీటి మట్టమూ ఒక్కటయ్యేదాక నీరు ప్రవహించి, ప్రవహించి ఆ

భూగర్భ గృహాన్ని అదృశ్యం కావించింది. అక్కడి ఫైళ్ళని వాన్నివేసి తేల్చి వేసింది.

ఇంతసేపూ వూరుకున్న చీఫ్ ఇంజనీర్—

"మీరెన్ని అన్నా అనండి సెక్రటరీగారూ! ఇన్ని అడుగుల నీటిలో మున్నా ఆరుగంటలు నానుతూ కూడా పడిపోకుండా నిల్చింది. ఈ భవనం అంటే మన ఇంజనీర్ల ప్రతిభ ఎటువంటిదో ఆలోచించండి!" అని గర్వంగా పలికాడు.

సెక్ ఆయన్ని ఉరిమి చూశాడు.

"మొట్టమొదట నీళ్ళ— ఇదిగో ఈ నీళ్ళ ఇట్లా లోపలికి వచ్చేయడానికి కారణం ఏమిటో సెలవియ్యండి—" నిలవేశాడు చీఫ్‌ని.

"దానికి పెద్ద ప్రశ్నకూడా ఎందుకండీ...... వాన...మళ్ళై...రెయిన్... బ్రిటిష్. బారిష్...అదీ కారణం."

"అదికాదయ్యా స్వామి! మళ్ళై కురిస్తే కురవనీ గాక ఊళ్ళోవాళ్ళంతా కలిసి ఈ భవనంలోకి రావడం

# నీరు పల్లమెరుగు

ఏమిటి అంటా? ఇదేం ఆఫీసా లేపోతే రిజర్వాయరా? అని దబాయించి మరీ అడిగాడు సెక్.

భుజా లెగరవేశాడు చీఫ్ ఇంజనీరు. ఆ పైన చెప్పసాగాడు — "మహానుభావా! ఆ విషయం నన్నడక్కండి. ఈభవనం తాలూకు పునాదినే నేలమట్టంనుండి ఆరడుగుల ఎత్తుకు లేపాలి అని నేను సూచించాను ప్లానులో. అందుకు విరుద్ధంగా పధ్నాలుగు అడుగుల లోతున ఈ భూగర్భంకావాలని మంత్రిగారన్నారు. వీలులేదయ్యా "ముడియాదు' 'ఇంపాజిబుల్' అని గట్టిగా చెప్పాను. ఫైలు మీద రాసిచ్చాను కూడా. అయినా వినిపించుకోక ఈ పాతాళ గృహం కట్టుకున్నారు. కనుక ఇది రిజర్వాయరా, బే ఆఫ్ బెంగాలా అని మీ రడగవలసింది నన్ను కాదు, గౌరవనీయులైన మంత్రిగారిని..." అన్నాడు.

"ఇంకో రెండు రోజుల్లో రిటైరు కాబోతున్నాడు.....వీడికేం ఎన్నన్నా చెబుతాడు. భయం భీతీ లేకుండా" అనుకున్నాడు సెక్

చివరకు అందరూ కలిసి మంత్రిగారిని సమీపించారు.

తెల్లవారింది.

శ్రీవారు ఖుద్దున వచ్చి పరీక్షించారు.

నీటిమధ్య నిలబడివున్న కిరణ్ భవనాన్ని చూసి ఆయన కళాహృదయ ముప్పొంగి పోయింది.

"ఎంత అద్భుత దృశ్యం!" అన్నారాయన.

సెక్‌కి అంత తడిలోనూ ఒళ్ళు రవరవ మండింది. అయినా ఏం చెప్పగలడు, అవతల పలికింది మంత్రిగారాయె.

కనుక చేతనయినంత భయ భక్తులతో— "చాలా నీళ్ళొ వెళ్ళిపోయాయండీ భవనంలోకి. ఇప్పుడు వాటిని బయటకు తీయించాలి" అని మనవి చేశాడు.

నెత్తి మీద సుత్తితో కొట్టినట్లు నేలు కున్నారు మంత్రి.. "ఆ..అరెరె... అవునయ్యోయ్ అయినా, ఇదేం దారుణం ఆఫీసు బిల్డింగులోకి ఇలా నీళ్ళు వచ్చేయడం ఏమిటి — త్వరగా తీయించేయి వాటిని .... కావలసినన్ని బాల్చీలా అవీ తెప్పించండి." అని అమూల్యమైన సలహాని పారేశారు. దాని నెవరూ ఏరుకోలేదు.

"కాని సార్, నీళ్ళను బాల్చీలతో తోడిన తర్వాత ఎక్కడపోయాలిసార్? అన్ని ప్రక్కలా నీళ్ళున్నాయికదా కనుక ఎక్కడ పోసినా అవి పల్లాన్ని వెతుక్కుంటూ ఆ గర్భగృహంలోకే వస్తాయి" అని వివరించాడు చీఫ్ ఇంజనీర్. తమ అపూర్వ ప్రతిభ ఎదుర్కోలేని జటిల సమస్యను ప్రతిపాదించిన ఆ అనాగరికపు మనిషి మీద మంత్రిగారికి బలే చెడ్డచిరాకు కలిగింది. విని వినా నడవసాగారు. అరఫర్లాంగు కవతల నీళ్ళ ఎక్కువ లేనిచోట నిలుచునివున్న తమ కార్లోకి ఎక్కి కూచుని—సెక్‌ని చూచి,

"ఈ సమస్యా పరిష్కారానికి త్రిసభ్య సంఘాన్ని వేస్తున్నాను. దానికి అధ్యక్షులుమీరు. మిగతా ఇద్దరు సభ్యుల్ని మీరే వేసుకోండి. నాకు మాత్రం పదింటిలోపుగా ఒక చిన్న నోట్ పంపితే సభ్యుల ఎదుట వుంచుతాను." అని వెళ్ళిపోయారు.

...ఫైలు లేని ప్రభుత్వోద్యోగి—రెక్కలు లేని పక్షి—వొత్తి లేని దీపం—ప్రాణంలేని దేహం.

కనుక—

"అమూసేసిన ఫైలులో ఇరవై యిదో వాల్యూము తెరవాలి..." అన్నాడు—మంత్రిగారు చెప్పిన మేరకు చర్యలు తీసుకోదలచిన సెక్.

"ఆ ఫైలుయొక్క ఇరవైయ్యారు వాల్యూములూ ఆ బేస్‌మెంటులో వున్నాయి కదండీ" అన్నాడు జూసెక్.

ఏదో ఫెళ ఫెళ మన్నట్లు విన్పించింది.

"అయ్యబాబోయ్ ఫైలే లేకపోతే నేనేమి చేతురా దేవుడా" అని శోకించసాగిన సెక్‌కు చీఫ్ ఇంజనీరు ఎందుకు పరుగెత్తుతున్నాడో అర్థమే కాలేదు.

**ఈ జోక్ నంతా చూసి కిరణ్ భవన్ పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వ సాగింది.**

# ఆహ్లాదకరమైన పరిమళము మరియు తాజావంతమైన అద్భుత అనుభవాన్ని పొందుతారు

ఆ చల్లదనం రోజంతా వుంటుంది...ఎక్కువ సేపు నిలిచే పరిమళము త్రోవపొడుగునా ఉత్సాహాన్ని చేకూరుస్తుంది. పట్టువలె మృదువైన, శాటిన్ వలె నునుపైన కుటికురా టాల్కం పౌడరు. చల్లుకొనిన ప్రతిసారి పూర్తిగా మీదే.

కొద్ది ఔషధములు కలుపబడిన కుటికురా మీ చర్మానికి అవసరమైన మృదు సంరక్షణను కలిగిస్తుంది. చెమట పొక్కులు, వాసనవలచే చెమట మరియు చర్మపు చికాకుల వల్ల కలిగే హానినుండి రక్షణను కలిగిస్తుంది. క్రమబద్ధంగా వాడేటట్లయితే కుటికురా మీ ముఖవర్చస్సుకు సౌందర్యాన్ని చేకూరుస్తుంది.

పసిపాపకు కూడా సుఖాన్ని చేకూరుస్తుంది... పసిపాప మృదువైన చర్మము మీద సున్నితంగా పనిచేసి పాప చర్మాన్ని మెత్తగాను, ఉపశమనకరముగాను ఉంచుతుంది.

నేడే ఒక కుటికురా డబ్బాను కొనండి.




కుటికురా

కుటుంబానికంతటికూ బహుళ ప్రయోజనకరమైన టాల్కం పౌడరు

NAS 17

# పలుకే బంగారమా!



కె. రామలక్ష్మి

జగన్నాథం మేష్టారు పిల్లలపాలిటి పిడుగేగాని పెళ్ళాంపాలిటి ప్రియుడే (నాకు తెలిసినంతవరకు!) స్కూల్లో పిల్లలమీద విసుగూ కోపం ఎంత ఎక్కువో అంతకంత శాంతింగానూ ఉంటారింట్లో. చిన్నప్పటి నుంచి చనువు ఉండడంతో నాకాయన దగ్గిర భయం పోయిందిగానీ, ఇప్పటికీ క్లాసులో నించోపెట్టి 'సత్తకి కళ్ళెన్ని?' అని అడిగితే చచ్చానన్నమాటే!

అలాంటి మేష్టారొచ్చి 'రావుడూ చాలా గమ్మత్తు జరిగిందోయ్' అంటే మరి కుతూహలంగా ఉండదూ ? 'మా

ఆవిడ చాలా గమ్మత్తుగా తయారైంది. అదేమిటో దాన్నిట్టే అర్థం చేసుకునే వాణ్ణి ఈ ధోరణికీ తలాతోకా దొరకడం లేదు' అన్నారు. ఏమైందిట?... రోజూ లాగే సాయంత్రం కూర్చుని రేడియో ఇరుసు తిప్పుతున్నారట (వచ్చిన స్టేషన్ల మీద అసలు గౌరవం ఉండదు కొందరికి, తెగతిప్పి బర్ బర్ మనిపించి ఎదుటివాళ్ళ ప్రాణాలు తోడుతారు—(మేష్టారిది బి.బి.సి. జబ్బు!) సడన్‌గా ఉప్పెనలాగా వచ్చి రేడియో ఆపేసి 'నాతో మాట్లాడండి' అంది కోపంగా. ఆశ్చర్యం నుంచి తేరుకుని మళ్ళీ రేడియో ఆన్ చేశారుట. (అది వేరేసంగతి!) కష్టపడి అలసిపోయి వచ్చాక కాస్సేపు హాయిగా రేడియో తిప్పకోకుండా ఏం మాట్లాడాలి ? (రేడియో వినడాని కెలాగా పాత్రప్రోగ్రాము లేగా ? అంచేతే అలా అలా ప్రపంచం అంతా తిప్పి సంతోషించడం)... 'ఏడుస్తూ వెళ్ళి అలక పాన్పెక్కింది. మా సంగతి నీకు తెలుసుకదా! ఇద్దరం పరపొచ్చాలు లేకుండా హాయిగా కాలం గడిపాం ఇంత కాలం. ఒకరి ఊహలని ఒకరు చదివేయ కలం— గడగడా. అలాంటిది ఇప్పుడిదేమిటంట ? ఈ ధోరణికి అర్థం ఊహించ కలనా ?' అంటూ నిలదీశారు.

నాకు నవ్వొచ్చింది — ఒకరి నొకరం గడగడ చదివేయగలం అంటే. మేష్టారి నమ్మకం అది! నా ఉద్దేశ్యంవేరు—అయినే కనుక అలా ఆమె ఊహలుకూడా చదవ గలిగిఉంటే — ఇంతగా భార్యగారు మాట కోసం మొహంవాచి పోతారా? ఆయన కంటే నాకే ఆవిడ ఊహలు గ్రహించేశక్తి ఉందేమో—పాపం—రోజంతా చాకిరితో సతమతమై సాయంత్రం భర్తరాకకోసం ఎంతో ఆశగా ఎదురుచూసే ఆమెకి ఎదురయ్యే దేమిటి? ఏదో పిచ్చాపాటీ కబుర్లు, ఓపిక ఉంటే మెదడుకు మేతవేసే విషయాల చర్చలు— అబ్బే అవేం లేదు ! రేడియో బర్ బర్‌లు! నిజమే అలసిన ఆయనగారికి విశ్రాంతి కావాలి. ఆమెకీ కావాలి. ఆమె

పోది కబుర్లని ఉత్సాహంతో వినలేక పోవచ్చు. కాని ఒక్క సంగతి జ్ఞాపకం ఉంచుకోవాలి — గృహిణి జీవితం చాలా రొటీనుగా చప్పగా తయారై కనీసం విస్తృతమైన పరిధులుకూడా లేని విసుగు జనింప చేసేదిగా ఉంటుంది. రోజూ ఒకటే పనికదా. అందుకే బర్‌బర్‌లని కొంచెం బలిపెట్టి అదీ ఇదీ కొంచెం కబుర్లు చెప్తే ఏం పోయింది? అని అడగాలని పించింది. అప్పుడాయన బెంగ పడుతున్న ఈ వింత ధోరణి మటుమాయం కావచ్చు. నా మామయ్య ఉన్నాడు ఇలాంటి చిన్న విషయాలలో మహా తెలివితేటలు ఉపయోగిస్తాడు. వస్తూనే 'సీతా డియర్' అంటూ ప్రేమతో పలకరించేసి 'ఏంచేసేవీ దీనుడికి' అంటూ ప్రాధేయపడే సరికి అత్తయ్య అయిసయిపోయి — తిన్నగా వంటింట్లోకి వెళ్ళిపోయింది — మామయ్య హాయిగా పేక తీస్తాడు! — అలా వుండాలి తెలివంటె — ఒకే దెబ్బకి రెండుపిట్టలు అన్నట్టు — అటు అత్తయ్య సంతోషంతో — రాదర్, తన్మయంతో ఉప్మా కలియ బెడుతూంటే ఇక్కడ ఓగంట పేషంట్సు ఆడుతాడు మామయ్య. ఇంతమంది విద్యార్థులని క్రమశిక్షణలో పెట్టే మాస్టారికిలాంటి చిట్కాలెందుకు తోచలేదు? అని ఆశ్చర్యం వేసిందిగాని— ఊరుకున్నాను.

మెకానికల్‌గా కాఫీగ్లాసు అందుకుంటూ కూడా ఊరంత డైలాగు దొర్లించినంత నేర్పు ప్రదర్శిస్తారు కొందరు భర్తలు. కొందరు బెల్లంకొట్టిన రాళ్ళలాగా ముఖం చిట్లించుకుని అందుకుంటారు — మనుషుల్లో ఎన్నో రకాలు—వాటిలో ఇవి కొన్ని— ఇంట్లో—ప్రేమమాటలు, కోపంమాటలు— పోనీ అసలు మాటలులేని మాటలు — అన్నిటిదీ ఒకటే ధ్యేయం — ఉనికిని గుర్తించమని అఘోరించడానికే. కమ్యూనికేషన్‌కే. అదే లేకుంటే... కొంపలు కొంపల్లా ఉండవు — అంతమాత్రాన ఇంట్లో పలుకే బంగారం కానక్కరలేదు— కొళ్ళవాన వెలసినట్టూ కానక్కరలేదు — ఏమంటారు?






దక్షిణఅమెరికాలో నుండే వింత స్తన్యజీవి ఇది. శరీరాన్ని తల కిందుగా ఉంచి, 2 జతల కాళ్ళని కొక్కేలుగా ఉపయోగిస్తూ, నెమ్మదిగా కొమ్మలమీద పోవడం దీని ప్రత్యేకత — మామూలుగా జంతువులకు భూమి కనబడుతూంటే, దీనికి ఆకాశం కనబడుతూంటుందన్నమాట. సాధారణంగా నేలమీదకిరావు. నేలమీద ఉంచితే వీటిఅవస్థ చెప్పుకోవలసిందే కొద్దిగానైనా ముందుకు సాగడం కష్టం అయిపోతుంది.

ముందు, వెనుక కాళ్ళకు మూడేసి (ముందుకాళ్ళకు కొన్నిటిలో రెండే) వేళ్ళు కొక్కేలుగా నున్నవి ఉంటాయి. అవి పట్టు వదలి కిందకు జారడం, అసంభవం అన్నమాట. వీలయితే అపుడప్పుడు క్రిందనున్న కొమ్మలకు ఆన్తాయి.

చర్మంమీద వెంట్రుకలు చాలా అసహ్యంగా ఉంటాయి. కొన్నిటికి వెంట్రుకల్లో పచ్చని 'ఆల్గే' వృక్ష జాతి ఉండడంచేత, చెట్లలో శత్రువుల కంట పడకుండా కొంత తప్పించుకోగల్గుతాయి. వర్షాలకు మీదపడే నీళ్ళు నిలిచి పోకుండా, క్రిందకు జారడానికి వీలుగా ఉంటాయి ఈ వెంట్రుకలు. తల చిన్నదిగా ఉంటుంది. చెవులు చిన్నవి. తోకశూన్యం.

పగలంతా విశ్రాంతి తీసుకొని రాత్రికాలంలో తమ శాఖాహారాన్ని తింటాయి. శరీరానికి కావలసిన నీటిని, ఆకులనుంచే గ్రహిస్తాయి.

సుమారు లక్షసంవత్సరాల క్రింద, నేలమీదనే కొన్ని స్లాత్‌లు నివసిస్తూండేవి. మెగాతీరియం, మైలోడాన్ లాటివి అవి. సుమారుగా 20 అడుగుల ఎత్తున ఉండేవి ఇవి. పెద్ద పెద్ద చెట్ల కొమ్మలను సహితం నేలమీద నుంచే అందుకొనేవి సునాయాసంగా.

—జమ్మి కోనేటిరావు

దేవతలయినా సరే, తాము మానవుల కంటె గొప్పవారమనే అభిప్రాయంతో గర్వించకూడదు. వారికి కూడా రాక్షసులను జయించేటప్పుడు మానవలోకంలోని మహావీరుల అవసరం వస్తూనేవుండేది. గర్వం ఎక్కడవున్నా దానికి పరాభవం తప్పదు. ఇది ముమ్మాటికీ నిజం.

పూర్వం నరకుడనే రాక్షసరాజు దేవతలను నానాబాధలూ పెట్టి, అదితి కుండలాలను అపహరించుకుని వెళ్ళిపోయాడు. ఆమె పుత్రుడు యింద్రుడు తల్లి విచారాన్ని చూస్తూ, చేతగాక ఊరుకోవలసి వచ్చింది. దేవతలూ, మునులూ ప్రార్థించగా శ్రీ కృష్ణుడు నరకాసురుణ్ణి చంపాడు. అప్పటి యుద్ధంలో సత్యభామ శ్రీ కృష్ణునికి ఎంతగానో తోడ్పడింది.

నరకాసురుణ్ణి చంపినతర్వాత శ్రీకృష్ణుడు అతనిదగ్గరున్న అదితి కుండలాలను ఆమెకు యివ్వడానికి స్వర్గలోకానికి వెళ్ళాడు. అతని వెంట సత్యభామ కూడా ఉన్నది. పోయిన తన కుండలాలు తిరిగి లభించినందుకు అదితి ఎంతో సంతోషించింది. శ్రీ కృష్ణుడినీ, సత్యభామనూ మిక్కిలి గౌరవించింది. ఆమె దగ్గరే వారు కొన్నాళ్ళు వున్నారు.

ఒకనాడు శచీదేవి— ఇంద్రుని భార్య — కూడా సత్యభామను ఆతిథ్యానికి ఆహ్వానించింది. ఎంతో గౌరవించింది. సత్యభామ ఆమెదగ్గర వుండి వినోదంగా మాటలాడుకుంటున్నప్పుడు ఒక నౌకరు వచ్చి కొన్ని పారిజాత పుష్పాలను తెచ్చి శచీదేవికి సమర్పించాడు. ఆమె ఆ పువ్వుల నన్నిటినీ తన కొప్పులో పెట్టుకుంది. మర్యాద కయినా ఒక్క పువ్వు కూడా సత్యభామ కివ్వలేదు. అంతతో తీరిపోయిందా? శచీదేవి సత్యభామను చూసి చిరునవ్వు నవ్వుతూ 'ఓ సత్యాదేవీ! పారిజాత పుష్పాలు అన్నీ నేనే తలలో ముడుచుకున్నాననీ, ఒక్కటయినా యివ్వలేదనీ మనస్సులో ఏమీ అనుకోకు! నీవు ఎంత కృష్ణుడి భార్యవయినా మనుష్య




స్త్రీవి. మేము దేవతలం! దేవతలు ధరించదగినవాటిని మానవులు ధరించడానికి అర్హులు లేదు. అందుకోసమే నేనివ్వలేదు, ఏమీ అనుకోకు' అన్నది.

ఈ మాటలు విన్న సత్యభామకు పట్టరానికోపం వచ్చింది. దేవతల గొప్పతనం యేమిటి? తాను శచికంటె తక్కువదా?— ఆమె వెంటనే బసకు వెళ్ళి అలకతో ముసుగుతన్ని పడుకున్నది.

విచారగ్రస్త అయిన సత్యభామను చూచి శ్రీ కృష్ణుడు సంగతి సందర్భాలు తెలుసుకున్నాడు. తన దేవికంటే తనకే ఎక్కువ కోపం వచ్చింది శచీదేవి మీద. అంత గర్వించిన శచీదేవికి యికమీద పారిజాత పుష్పాలు లభించకుండా చెయ్యాలనే సంకల్పం కలిగింది అతనికి.

శ్రీకృష్ణుడు తను ఊరికి తీసుకు పోడానికి పారిజాతవృక్షాన్ని పెళ్ళగించాడు. తన పైకి యుద్ధానికి వచ్చిన దేవతలనూ, ఇంద్రుని ఓడించి ఆ వృక్షాన్ని భూలోకానికి తీసుకుని వచ్చాడు.

సత్యభామకు శచీదేవిమీద కసి తీరింది; సంతోషానికి మేరలేకపోయింది.

అప్పటినుంచి స్వర్గంలో పారిజాత వృక్షం లేదు. దాని పుష్పాలు దేవతలకు దక్కకుండా మానవులకే దక్కాయి.

శచీదేవిగర్వం ఆమెకు ప్రతీకారం లేనట్లుగా ప్రాయశ్చిత్తం కలిగించింది!






**జరిగిన కథ**

రెండో పెళ్ళివాడయిన గోపాలంతో సుభద్ర పెళ్ళి జరిగింది. అతనికి ఆమెతో వయసున్న కొడుకు శ్రీనివాస్ ఉన్నాడు. గోపాలం మరణం, శ్రీనివాస్ చదువు సుభద్రని కష్టాలపాలు చేశాయి. జగదీశ్ ఆమెని మోసం చేశాడు. తత్ఫలితంగా ఆడపిల్లని కంటుంది. ఫకీరు పంచలో ఆమెకి ఆశ్రయం లభిస్తుంది. రాజేశ్వరి శ్రీనివాస్‌ని వెతుక్కుంటూ వస్తుంది. ఇద్దరూ పెళ్ళి చేసుకోవాలనుకుంటారు. రాజేశ్వరికూడా ఉద్యోగంలో చేరింది. అక్కడి పరిస్థితులు నచ్చక మళ్లీ విరమించుకున్నది. ఫకీరు మరణిస్తాడు. సుభద్ర చేతులు మారుతున్నదని ముకుందం ద్వారా విని — ఆమెని వెతుక్కుంటూ వస్తాడు శ్రీనివాస్. రాజేశ్వరి శ్రీనివాస్‌తో తెగతెంపులు చేసుకుని అమ్మగారింటికి వెళ్ళిపోతుంది.

## 13

నెలరోజులకే శ్రీనివాస్ రంగులో, నడకలో, ప్రవర్తనలో అన్నిట్లో మార్పు వచ్చేసింది. ఒక ఛాయ తగ్గి సంస్కారహీనంగా శరీర భాగంలో పటుత్వం తగ్గిపోయినట్లు ముప్ఫై నిండని శ్రీనివాస్ అంతలోనే నలభై దాటినట్టు కనిపిస్తున్నాడు.

స్కూలు నుంచి రాగానే అతను గది గుమ్మంలో అడుగుపెట్టి వింతగా చూస్తున్నాడు. బాబు తల్లి గుండెల్లో నిద్రపోతున్నాడు హాయిగా.

అతని మనసు చివుక్కుమంది.

'ఈ ప్రశాంతిని వాడికి దూరం చేశావేమో' శ్రీనివాస్ కలతపడిన మనసుతో పక్కమీద అలాగే కూర్చుండిపోయాడు. చప్పుడు విని మెలుకువ వచ్చిన రాజేశ్వరి అతన్ని చూస్తూనే నిర్ఘాంతపోయింది. తను వున్న రోజుల్లో అందాన్ని చిదిపి దీపం పెట్టొచ్చు అనేది. ఆ అందం కరిగిపోయి యిలా బికారిలా కనిపిస్తున్న భర్తని చూడగానే వుప్పెనలా ముంచుకుని వచ్చింది దుఃఖం. అతని పాదాలు తడిపేస్తూ యేడుస్తూంటే 'యెందుకు? యిప్పుడు నిన్నేం అన్నానోయ్,' అన్నాడు.

అతని గొంతు చాలా నీరసంగా పలుకుతోంది.

'నన్ను క్షమించండి. పాపిష్ఠిదాన్ని మిమ్మల్ని కష్టపెట్టాను. నేను యింతకు మించిన నరకం అనుభవించాను.'

'పోన్లే. అవన్నీ పాస్ట్. జరిగిందంతా మరిచిపోదాం. కొత్తగా బ్రతుకుదాం. నిన్ను నేనే విషయాలూ అడగను. నీ యిష్టం యెలా అవుతే అలా వుండు. నా జీవితం పూర్తిగా శిధిలం అయిపోయింది. నన్ను ప్రశాంతంగా గడపనీ. బాబుకి తల్లిగా నీ బాధ్యత మరిచిపోకు.'

'నన్ను నారాయణబాబు పంపారు. మీరు నన్ను యేలుకుంటారో లేదో అనుకున్నాను.'

'యిప్పుడు నువ్వేం తప్పు చేశావనీ'

'మీకు చంద్రవహాళిగారు చెప్పే వుంటారు,' రాజేశ్వరి భుజాలు తడుముకుంటోంది.

'నేను నిన్ను అడగలేదోయ్ ఆ విషయాలు.'

'దేవదాసు వచ్చాడు యీ వూరు. అప్పుడే నేను పబ్లిక్ గార్డెన్స్‌కి మనసు బాగో లేక వెళ్ళాను. అక్కడి నుంచి వచ్చే బస్సులు తక్కువై పోయాయి. వర్షం వస్తూంటే తప్పనిసరిగా అతని రిక్షాలో రావడం చంద్రవహాళిగారు చూశారు.'

శ్రీనివాస్ యెంత నిగ్రహించుకున్నా దేవదాసు పేరు అతన్ని పెట్రోలు పోసి మంట పెడుతోంది. కడుపులో యెంతటి సంస్కారం వున్నా తన మనసు ఒప్పుకోవడం లేదు. అలా తన భార్య మరొకడితో ఒకే రిక్షాలో రావడం. బస్సులో సీట్లు లేకపోతే కూర్చోవడం తను అభినందిస్తాడు. ఆడది మరీ అలా శిక్ష అనుభవిస్తూ నిలుచునే బదులు యెవరి పక్కన అయినా ఓ ఘడియ కూర్చోవడం యే మాత్రం తప్పుగా అనిపించదు. కానీ దేవదాసు విషయం వేరు. రాజేశ్వరి మనసులో అప్పుడప్పుడు మోజుకొద్దీ తొంగి చూసే మనిషి. తన పినతల్లిని వారం రోజులు తన యింట వుంచుకున్న ఆ వ్యక్తంటే శ్రీనివాస్‌కి పరమ అసహ్యం. ఇంకేమీ మాట్లాడలేదు. అతనికి కోపం వచ్చిందని రాజేశ్వరికి బాగా తెలుసు. వున్నంతలో తింటూ గొప్పంగా వుండడమే మంచిదనిపించింది.

రాజేశ్వరికి యిప్పుడు ధైర్యం కూడా లేదు తను ఉద్యోగం చేస్తానని అనేం దుకు. పసివాడి ధోరణిలో అప్పుడప్పుడు పశ్చాత్తాపం దోబూచులాడుతూనే వుంది 'ఎందుకొచ్చిన వాదాలు పెంచుకున్నాను' అని—తిండికి కటకటలాడిపోయే సమయాల్లో మరోరకంగా అనుకునేది అమ్మ పిలు స్తూంటే ఈ దరిద్రంలో చిక్కుకున్నా నేమిటి అని?

* * *

రెండురోజులు నాటక సమాజంలో గొంతు విరుపు యిచ్చేందుకు శ్రీనివాస్ వెళ్ళిపోయాడు. అతనికి అడ్వాన్సుగా అరవై రూపాయలు కూడా యిచ్చారు పిల్లాడికి పాలడబ్బా, రాజేశ్వరికి పిల్కుచీరా కొన్నాడు.

దేవదాసు హఠాత్తుగా వూడిపడటం రాజేశ్వరి గుండెల్లో రైళ్ళు పరుగులు పెట్టాయి యెంత చెప్పినా వినలేదు

'నువ్వు యెన్నైనా చెప్పు అలా చీటికీ, మాటికీ అనుమానించే మనిషితో నువ్వేం సుఖపడతావు'

'లేదు దేవదాసు ఆయన నిరాశ్రయంగా వున్నప్పుడు చోటు చూపించారు నేను నీతో తిరగడం అసలు నాకే బాగులేదు' దేవదాసు పాకెట్టు విప్పి మంచి ఖరీదైన రెండు వాయిల్ చీరలు యిస్తూంటే అంది: 'నాకు యివి వొద్దు నా కాపురం కూల గొట్టుకోను నువ్వు యిచ్చే కానుకలు తిరస్కరిస్తున్నానని అనుకోకు స్నేహంగానే అంటున్నాను ఆయన్ని వంచించి నేను బాగుపడేది యేమీ లేదని గ్రహించాను'

'అవన్నీ వట్టి కబుర్లు రాజేశ్వరీ ఇల్లు చూస్తే యింత కటిక చీకట్లో, తిండి చూస్తే' దేవదాసు ప్రాణానికి యిల్లు అలా కనిపిస్తోంది

'ఏదో ఆ సమయంలో అలా చెప్పుకోవలసి వచ్చింది. నాకు యిప్పుడేమీ లోటులేదు. నన్ను ఆశపెట్టి ఏవేవో కబుర్లు చెప్పకు. నాది అసలే చంచలమయిన మనసు'

దేవదాసు వూహాలోకాల్లోకి, పంపిస్తున్నాడు అంతకంతకు రాజేశ్వరి మనసు పటుత్వం తప్పిపోతోంది 'పిల్లాడిని రాజులా చూసుకుంటాను. నువ్వు నాదగ్గర వుండిపో'

రాజేశ్వరి చెవులు మూసుకుంది 'ఒద్దు



దేవదాస్. నాకింకేవీ చెప్పకు రాజేశ్వరి మాటలు ఆపేయగానే దేవదాసు బయటికి వెళ్ళిపోయాడు.

అనుకున్న రోజుకు ముందుగానే శ్రీనివాస్ రావడం, బజారునుంచి వచ్చిన దేవదాసు రాజేశ్వరియెదుట వంటయింట్లో కూర్చుని దీర్ఘంగా చర్చించడం— శ్రీనివాస్ హృదయం భగ్నమంది.

'బాగున్నావా,' దేవదాసు పలకరింపుగా అన్నాడు.

'ఆఁ'

రాజేశ్వరి తలెత్తి స్థాణువై పోయింది. చాలాసేపు తను ఒక్కడే మాట్లాడుతూ విసుగువచ్చి దేవదాసు బయటికి వెళ్ళిపోయాడు. శ్రీనివాస్ కళ్ళు నిప్పులు చెరుగుతున్నాయి.

'వీడెప్పుడు వచ్చాడు?'

'మొన్న'

'యీ రెండు రోజులూ యెక్కడ వున్నాడు?'

'పగలు యిక్కడే'

'రావద్దని చెప్పకపోయావా?'

'అంత కుసంస్కారం నాకు లేదు.'

దండెంమీద వ్రేలాడుతున్న చీరలుచూసి అవగాహన చేసుకున్నాడు. 'మనమధ్య యేదో పైశాచిక శక్తి ఆవరించుకుంది. నా మనసుని నేను మభ్యపెట్టుకోలేను. పిన్ని సంగతి తెలిసీ నువ్వు దేవదాసుకి అంత గౌరవం యిస్తున్నావంటే...'

'అతను మావూరివాడు'

# మొగలి పొదలు

'చూడు రాజేశ్వరీ! బ్రతుకంటే ఆట కాదు. గాజుపాత్రలాంటి యీ జీవితాన్ని అపురూపంగానే చూసుకోవాలి. నువ్వు ఏదో వ్యామోహంలో కొట్టుకు పోతున్నావు. నీయిష్టం? నీకూ నాకూ మధ్య యింక సరిపడదు. నేను అనుమానం మనిషిని అను, నాకు సంస్కారంలేదను, నీయిష్టం వచ్చిన పేరుపెట్టి పిలు. నువ్వింక యీ యింట్లో వుండడం, ఆ దేవదాసు నీకోసమే ప్రత్యేకం రావడం నేను సహించలేను'

నిబ్బరంగా అంది. 'మీది మొదటినుంచీ పాడుబుద్ధే. నేను నిజంగా చపలమనిషిని అయితే దేవదాసును చేసుకునేదాన్ని అని అనక పోయేదాన్ని. ఆఫీసులో పని చేయడం యిష్టం వుండదు మీకు. ఘోషా స్త్రీల మాదిరి పరదాలమధ్య బ్రతకలేను నేను.'

'నేను నిన్ను అలా శాసించలేదు.'

'మీరు చీటికీ మాటికీ అనుమానిస్తున్నారు.'

'నువ్వు నారాయణబాబుతో ఎన్ని అబద్ధాలు ఆడావు'

రాజేశ్వరి తొణకలేదు! 'నేనేమీ చెప్పలేదు'

'అయితే ఆయనే కల్పించారా?'

'అదేమో'

'అప్పుడుకాదు యిప్పుడు అంటున్నాను. నాకడుపులో చిచ్చుపెట్టావు. నా ప్రశాంతిని భగ్నంచేశావు. నాగొంతులో పీసం కార్చి పోస్తున్నావు. నీకు మంచిబుద్ధులు రమ్మంటే యెలా వస్తాయి?

'మీ అమ్మలాగే వొక మొగుడు కాకపోతే మరొకడు. డబ్బుకావాలి మీకు. సాంఘిక నియమాలు అక్కర్లేదు'

రాజేశ్వరి చెంపలు ఆక్రోశంతో అదిరిపోయాయి! 'అవును మంచి బుద్ధులు మీ పిన్ని దగ్గర నేర్చుకుంటాను'

'యిడియట్. మాపిన్ని కాలిగోటికిపోలవు నువ్వు. ఆవిడ సంగతి నీకేం తెలుసును?'

'అంతే-అంతే మీరు అలా సమర్థించక యేం చేస్తారు. మనపిల్ల యెప్పుడూ పతివ్రతే అనుకుంటుంది తల్లి'

'నీలా మొగుడు బ్రతికివుండగా పిన్ని మరో వెధవ తెచ్చినచీర కట్టుకోలేదు.'

'అవును ఎలా కట్టుకుంటుంది? చీరలు మార్చుకున్నట్లు మనుషుల్ని మార్చుకుంటూ వెళ్ళిందిగానీ'

'నీతో నాకు వాదన అనవసరం తెగిన సంబంధాన్ని యింక సాగే ప్రయత్నం చేయడం నాకు యిష్టంలేదు. రెండుసార్లు క్షమించాను. రాజమండ్రీ వెడతానని తిరుమలగిరిలో కాపురం పెట్టినపుడు, పిల్లడిని మీఅమ్మకి చూపిస్తానని రాజమండ్రీలో వారంరోజులు దేవదాసుతో షికార్లు కొట్టినపుడు. రాజేశ్వరి మనసు పరుగులు పెట్టింది. అప్పుడు...

రాజేశ్వరికి వరుసగా వారం పదిరోజులు వొంట్లో బాగులేకపోయేసరికి శ్రీనివాస్ పిచ్చివాడిమాదిరి అయిపోయాడు. చంద్రమౌళి నాటక సమాజం డైరెక్టరు. అంతే కాకుండా మిలటరీ ఆఫీసులో యిప్పుడు సీనియర్ ఆఫీసరు కూడా అయ్యాడు. అతనికున్న పేరు ప్రఖ్యాతులు అందరికీ తెలిసినవే. శ్రీనివాస్ కంఠస్వరం అంటే అతనికి తగని ప్రేమ. అందుకే అతన్ని 'ఏమోయ్' అంటూ ఆప్యాయంగా సంబోధించి అంతస్తుల తారతమ్యాలూ, కులమత భేదాలూ మరచిపోయి విశృంఖలంగా మాట్లాడతారు భార్యాభర్తలు యిద్దరూ. శ్రీనివాస్‌కి అతనంటే పంచప్రాణాలూ. గౌరవంగా 'యేమోయ్' అనుకున్నా సన్నిహితానికి యేమాత్రం లోటులేదు. చంద్రమౌళి భార్య చదువుకుని కొన్నాళ్ళు వుద్యోగం చేసి అతనితో ఢిల్లీ, కలకత్తా, పూనా, బొంబాయిలాంటి ప్రదేశాలు చూసి



## మొగలి పొదలు

నవీన పద్ధతిలో తనను తాను మలుచుకున్న యిల్లాలు.

'ప్రభావతీ', చంద్రమౌళి పిలిచాడు.

'యేమిటీ?' అంటూ వచ్చి శ్రీనివాస్‌ని చూసి పలకరింపుగా నవ్వింది.

'రాజేశ్వరిగారికి వొంట్లో బాగుండడంలేదుట. నువ్వు ఒక్కసారి వెళ్లి చూసి వస్తావా?', అతని అంతరార్థం గ్రహించింది ప్రభావతి.

'అలాగే, స్టౌమీద పప్పు వుడుకుతోంది. అన్నం డైనింగ్ టేబిల్‌మీదే వుంది: మీరు వడ్డించేసుకుని సామాను అక్కడే పెట్టేసి వెళ్లిపొండి. డూప్లికేటు 'కీ' వుంది నా దగ్గర. నేను రాజేశ్వరిని హాస్పిటల్‌లో చూపించి వచ్చి భోజనం చేస్తాను.'

'మీకు శ్రమ యిస్తున్నట్లున్నాను,' శ్రీనివాస్ నొచ్చుకున్నాడు.

'శ్రమేం వుంది యిందులో. దగ్గర్లో వున్నాం కనుక ఆదుకోగలం. లేకపోతే యెవరి పాట్లు వారికి తప్పవు,' చంద్రమౌళి కూడ అన్నాడు.

'నీకు యెలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో.'

'నీ గొంతు నాటక సమాజానికి అంకితం చేసి...' చంద్రమౌళి హాస్యం చేశాడు. శ్రీనివాస్ అక్కడ జరిగింది తు. చ. తప్పకుండా భార్యకు చెప్పాడుకుండా ప్రభావతి యెదుటే. శ్రీనివాస్‌ని పంపేసి రాజేశ్వరి పక్కనే కూర్చుంది ప్రభావతి.

'నువ్వు మనసులో యేదో వుంచుకుని యిలా బెంగపడిపోతూంటే వచ్చిన రోగం తిరుగుముఖం పట్టమంటే యెలా పడుతుంది?' ప్రభావతి చనువుగా అంది.

'లేదక్కా. నాకు బెంగేమీ లేదు'

'వుందో లేదో నీ మొహంచూస్తేనే తెలుస్తోంది. శ్రీనివాస్ యేమైనా అన్నాడా? మీ యిద్దరూ బాగానే వుంటున్నారు కద'

'ఆయన యేమీ అనలేదు'

'మరి?'

రాజేశ్వరి మౌనంగా వుండిపోయింది.

ప్రభావతి నవ్వుతూ అంది: 'మీరు ప్రేమించి చేసుకున్నారు. మీకు మధ్య పోట్లాటలు యేమిటి నా మొహం నేనేదో అన్నాను గాని...చూడు రాజేశ్వరీ ప్రపంచంలో మనుషుల సంగతి నాకు అంతగా తెలీదుగాని మీ బావగారు అంటూంటారు శ్రీనివాస్‌వంటి బుద్ధిమంతులు వుండరని'

రాజేశ్వరి మనసులో నిప్పులు చెరుగుతున్నాయి. 'ఈ వాడు శ్రీనివాస్ అందరి కళ్లకీ మంచివాడులాగే కనిపిస్తాడు: కాదు మరి అందరిదగ్గరా తన కష్టాల్ని యేకరవు పెట్టేసుకుని తను వారాలు చేసుకుని చదువుకున్నానని ప్రకటిస్తే అందరికీ పుట్టుకువస్తాయి యెక్కడలేని లభిమానాలూ—ప్రభావతి వెంటనే అంది: 'అయినా మనకెందుకు మగవాళ్ల విషయం', రాజేశ్వరి ముఖంలో భావాలు చదివేయగల్గే శక్తి లేకపోతే ఎం. ఎ. సైకాలజీ పాసయ్యేది కాదు ప్రభావతి. అడపా తడపా ప్రభావతి వస్తూనే వుంది.

రెండువారాలు గడిచిపోయాయి. పిల్లడు పాలకోసం యేడుస్తూంటే రాజేశ్వరికి శ్రీనివాస్‌మీద కోపం కట్టలు తెంచుకుంది; 'యీ యింట కాలుమోపింది మొదలు యేనాడూ సుఖపడలేను. పుట్టిన పిల్లడైనా సుఖంగా బ్రతకడం లేదు. ఈ కరువులో వాడినికూడా పోగొట్టుకుంటానేమో.' రాజేశ్వరి గుండెలమీద చేతులుంచుకుంది భయంగా.

రెండోసారి పెద్దసైజు వుత్తరం వచ్చింది. ఆరోజు సాయంత్రం శ్రీనివాస్ రాగానే 'నేను రాజమండ్రి వెడతాను. మాలమ్మ వుత్తరం రాసింది' అంది.

'యేమనేమిటి?'

'ప్రతి తల్లి కూతురికి యేం రాస్తుందో అదే'

'అంటే'

'నన్ను రమ్మని రాసింది'

'అయితే వెడతావా?'

'అవును అమ్మదగ్గర వుంటే కొంచెం మనశ్శాంతి వుంటుందేమో అని.'

'యిక్కడ నీకు అంత మనశ్శాంతి లేకుండా వుందా రాజేశ్వరీ'

'అది మీకు తెలియాలి'

'నిన్ను నేను వన్నెలిస్తే వొక్కమాట అనడం లేదు.'

'వేరే అనాలా'

'అయితే యేం చేస్తున్నానంటావు?'

'కూటికి గతిలేనియింట్లో నేను వుండలేను. యింకా యెన్నిసార్లు అనిపిస్తారు

వాచేత'

'రాజేశ్వరీ' శ్రీనివాస్ తెల్లబోయాడు. 'నిన్ను అంత మాడుస్తున్నానా?'

'నేను వచ్చిబాలింతరాలిని, నాకు మేజర్ ఆపరేషన్ కూడా అయింది. కుట్లునొప్పి పెడుతూవుంటే వొక్క మందు నీసాకి తెచ్చుకోలేదు ... అందరిచేతా, ముఖ్యంగా ప్రభావతికూడా నన్ను యెన్నిమాటలు అంది'

శ్రీనివాస్ తల దించుకున్నాడు అపరాధిలా 'అవిడేమంది మధ్య' అతను అను కున్నాడు మనసులోనే.

'అందుకే అంటున్నాను నేను మా యింటికి వెడతాను'

'మళ్ళీ యెప్పుడువస్తావు?'

'అక్కడ విసుగు పుట్టినపుడు' రాజేశ్వరిలో అహంకారం బయటికి వస్తోంది. బాబుని అందించి కాళ్ళు ఆడ్చుకుంటూ బయటికి వచ్చాడు శ్రీనివాస్.

*　　*　　*

పుట్టి పెరిగిన వూరు. అడ్డుగా వున్న రామదాసు కాలగర్భంలో కలిసిపోయాడు. రాజేశ్వరి అంటే పద్మావతికి పంచప్రాణాలూ. రోజుకో రకంగా పిండివంటలు చేస్తూ వండి వారుస్తూ వుంటే రెండువారాలకే పచ్చగా దబ్బపండుఛాయలో మంచి ఆరోగ్యంతో మిసమిసలాడి పోతుంది రాజేశ్వరి. హైదరాబాదులో శ్రీనివాస్ యిల్లూ ఆ గది గోడలూ కళ్ళ ముందు కదులుతూంటే చిరాకు పడేది.

ఆ రోజు రాజేశ్వరి వచ్చిందని తెలిసి దేవదాసు పరుగున వచ్చాడు.

'బాగున్నావా', రాజేశ్వరి సోఫాలో కూర్చుని అతన్నీ కూర్చోమని మాటల్లో దిగింది.

దేవదాసూ రాజేశ్వరీ ఒకే బళ్ళో చదువుకుని, వొకేసారి మెట్రిక్ పరీక్ష పాసయ్యారు అతన్ని మొదట్లో రాజేశ్వరికి యిచ్చి చేయాలని రామదాసుకి పట్టుదలగా వుండేది. అనేక తిరుగుళ్ళు తిరిగిన స్థిరం లేని మనిషని అప్పట్లో ఆ ప్రయత్నాన్ని విరమించింది పద్మావతి.

'అత్తా నీ కూతురు దిట్టంగా బలిసింది', దేవదాసు అంటూంటే పద్మావతి ముసిముసిగా నవ్వింది. దేవదాసు వెళ్ళిపోగానే అంది పద్మావతి. 'నువ్వు మొదటి నుంచీ కష్టాల్లోనే పెరిగావు. నీకు ఆ దరిద్రపు బాధ తెలిసి. హాయిగా యీ పదికరాలు నీకూ విజయకీ రాసిస్తాను. అతన్ని వదిలి వచ్చేయి.'

'అమ్మా', రాజేశ్వరి ఉలిక్కి పడింది శ్రీనివాస్ జాలిగా ఆవిడ కళ్ల ముందు కదులుతూంటే భయపడి పోయింది. అతన్ని తను వదులుకోలేదు. తను లేకపోతే శ్రీనివాస్ పిచ్చివాడై పోతాడు. అయినా తను ఒక పిల్లడికి తల్లికూడా.

'నేనేం తప్పుగా అన్నాను? కన్న తల్లిని కనుక కష్టాల్లో వుంటే చూడలేక నాకు తోచింది చెప్పాను. నీకు యింత కష్టంగా వుంటుందనుకోలేదు. అయినా వాడిని యేం చూసి చేసుకున్నావు?'

'నీకు పుణ్యం వుంటుందమ్మా, ఆయన్ని యేమీ అనకు. తను నాకు ఆ రోజు నిలువుండుకి నీడ చూపించకపోతే నా బ్రతుకు యిప్పుడు యెలా అయిపోయేదో'...

'యేం అంత బాగుందనుకుంటున్నావా నీ బ్రతుకు యిప్పుడు. వాడు నీకేదో మాయమాటలు చెప్పి నిన్ను యిక్కడికి పంపాడు. మీ బాబాయి వున్నప్పుడు లేని ధైర్యం యిప్పుడు యెలా వచ్చింది?'

'ఛ! అనవసరంగా అనకమ్మా. ఆయనకి అసలు యే విషయాలూ తెలియవు.'

'పోనీ. రెండు రోజులుండి వెళ్లేదానివి. నీతో యేమిటీ వితండ వాదం,' పద్మావతి మరి మాట్లాడలేదు.

దేవదాసు రోజూ [illegible] వచ్చి నాలుగైదు గంటలు మాట్లాడి వెడుతూంటే రాజేశ్వరి మనసు నీళ్ళో పడ్డ దూదిలా తేల్చేసుకునేది. కార్లో దిగి ఠీవీగా అడుగులో అడుగువేసే దేవదాసును తను యెందుకు వదులుకుంది అనుకునేది లీలగా. పద్మావతి పదేపదే దేవదాసుని పొగుడుతూంటే ఆ అభిప్రాయం నీరుపోసి పెంచినట్లు యింతింతై, వటువంతై నోకి దిగింది. దేవదాసు వచ్చి అన్నాడు 'శ్యామలా టాకీసులో మంచి పిక్చరుంది. వెడదాం వస్తావా అత్తా.' అనకన్నా ముందుగా కూతుర్ని వొత్తిడిచేసి లేవదీసింది పద్మావతి. యేదోవిధంగా తన కూతురు ఐశ్వర్యంలో తులతూగే దేవదాసు యింట స్థిరంగా వుండాలి. దేవదాసు ప్రతిఫలం ముట్టజెపుతున్నపుడు పద్మావతి విశ్వాసం చూపిస్తోంది అతనికి. కొంతలో కొంత ఆ సంగతి రాజేశ్వరి గ్రహించింది కూడా.

రెండుమూడుసార్లు వరుసగా పిల్లడిని యింట్లోవదిలి సినిమాలకీ, గోదావరి వొడ్డుకీ వెళ్ళడం రాజేశ్వరికి తప్పుగా తోచలేదు. సమయం దొరికినప్పుడు కొంచెం దగ్గరగా మెసులుతూ, పరధ్యానంగా చేతిలో చేయివేస్తూ, వుషారుగా కబుర్లు చెప్పేస్తూ తన సంగీత పాండిత్యానికి అందరూ యెలా అభినందిస్తున్నారో వెల్లడిచేస్తూంటే రాజేశ్వరికి వింటున్నంత సేపూ మతిపోయేది. ఆ ఆకాశ వీధాలని అందుకోవాలని మనసు తహతహలాడేది. రాజమండ్రివి కలలో కూడా వదులుకోవాలనిపించేదికాదు.

(ఇంకా ఉంది)

# శాస్త్ర పరిశోధనలో కథ



ఈ గ్రీక్ శాస్త్రజ్ఞుడు ఆర్కిమెడిస్ స్నానం చెయ్యబోయి పెద్ద సిద్ధాంతాన్నొక దానిని కనిపెట్టాడని స్కూళ్లలో చెప్తారు. అలాగే న్యూటన్ నెత్తిమీద (?) ఆపిల్‌పండు పడి అతని భూమ్యాకర్షణశక్తి సిద్ధాంతానికి దారితీసిందంటారు. (ఈకథని ఫ్రెంచి తత్వవేత్త వోల్టేయిన్ ప్రచారంలోకి తీసకు వచ్చాడుట!)

ఖనిజాలలోనుంచి లోహాలని తియ్యటం కూడా ప్రమాదవశాత్తుగా కనిపెట్టిన పద్ధతేనని వూహించవచ్చు. అయితే కొంతకాలంగా శాస్త్ర పరిశోధన క్రమ పద్ధతిన జరుగుతుంది కదా, ఇంకా 'కనిపెట్టడాలు' ఎదురు చూసినట్లు మాత్రమే జరగడంలేదా? లేదని ఒక సుప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు చెప్పాడు. 'లుడ్విగ్‌మోండ్ స్మారక ఉపన్యాసం' (ఫిబ్రవరి 29, 1968—మాంచెస్టర్ విశ్వవిద్యాలయం) ఇస్తూ ఆర్. వి. జోన్స్ (ఎఫ్. ఆర్. ఎస్.) కొన్ని వింత కథలు చెప్పాడు. ఈ ఉపన్యాసం 'కెమిస్ట్రీ ఎండ్ ఇండస్ట్రీ' పత్రిక, ఏప్రిల్ 13, 1968 సంచికలో పడింది. అందులోనుండి కొన్ని ఈ కింద వెయ్య పడుతున్నాయి.

## చిలుము-పరిశుద్ధి

లుడ్విగ్‌మోండ్ పేరు రసాయన శాస్త్రం చదువుకున్న వారందరికీ సుపరిచితం. నిక్కెల్ లోహం తీసే పద్ధతి ఆయన కనిపెట్టినదే. అయితే ఆయన ఈ పద్ధతిని ఎలా కనిపెట్టాడు? విన్నింగ్టన్ అనేచోట మోండ్‌కి ఒక క్లోరిన్ ఉత్పత్తి కర్మాగారం ఉండేది. క్లోరిన్ వాయువు నిక్కెల్‌ని ఏమీ చెయ్యదని ఆయన నిక్కెల్ కొళాయిలు వాడాడు. అయితే ఈ నిక్కెల్‌మీద బొగ్గుపూత ఏర్పడటం గమనించి ఎందుకా అని పరిశోధించగా మోండ్‌కి ఒక వింత విషయం తెలిసింది, యంత్ర సామగ్రిని నత్రజనితో 'శుద్ధి' చేసినప్పుడు, ఆ నత్రజనిలో కలిసి ఉన్న కొంత కార్బన్‌మోనాక్సైడ్ వాయువు నిక్కెల్‌తో కలిసి 'నిక్కెల్‌కార్బొనయిల్' అనే పదార్థం ఏర్పడేది! వెంటనే లుడ్విగ్‌మోండ్ ఈ విషయాన్ని నిక్కెల్ తయారీకి మూలసిద్ధాంతంగా వాడాడు. నిక్కెల్ ఉత్పత్తి పద్ధతిని 'మోండ్ పద్ధతి' అంటారు! ఆయన దీనిమీద ఎంతో డబ్బు గడించాడు...అంటే, నిక్కెల్‌కి చిలుము పట్టదనుకుని దానిని వాడగా దానికి బొగ్గు పట్టింది. ఈ మసిపట్టడం ద్వారా శుద్ధమయిన నిక్కెల్ లోహం చేసే పద్ధతి బయట పడింది. ఇది విచిత్రమే కదా?

పరిశోధకుల అజ్ఞానంవల్ల ప్రగతి ఉండవచ్చునని ప్రొఫెసర్ జోన్స్ చక్కగా నిరూపించాడు. కాంతి కణాలలాగ ప్రవర్తిస్తుందా, తరంగాలలాగ ప్రవర్తిస్తుందా అన్న ప్రశ్నకి లూయిూద్‌బ్రోగ్లీ అనే మహాశాస్త్రజ్ఞుడు ఇచ్చిన సమాధానం ఆయన రెండు ముఖ్యసిద్ధాంతాల విషయంలో కొంత పొరపడటం వల్లనే సాధ్యములుందనవచ్చునని ప్రొ. జోన్స్ అంటాడు...

## భయం—ఆకర్షణ

ఇక దైనందిన జీవితంలో జరిగిన మరొక వింత విషయం: లాప్‌లాండ్‌లో రెయిన్‌డీర్‌లు ఎక్కువ అందరికీ తెలుసు. దుప్పులవంటి ఈ జంతువులు రయిలు పట్టాల మీదకి వచ్చి ఎంతో ఇబ్బంది కలిగిస్తూ ఉండేవి. ఎవరో ఒక మేధావి దీనికొక మందు కనిపెట్టాడు. తోడేలు అరుపులని రికార్డుచేసి, రయిలు ఇంజనుకి లవుడ్‌స్పీకర్లు పెట్టి ఆ అరుపుల శబ్దాలని వినిపించి రెయిన్‌డీర్లని తరిమి వేయించవచ్చునన్నాడు. ఇది కొంతదాకా బాగానే పని చేసింది. రెయిన్ డీర్లయితే పారిపోయాయి కాని తోడేళ్లు గుమిగూడాయి!



## పియానో—నమూనా

బి. బి. సి. రేడియో కేంద్రాలయంలో ఒకపెద్ద పియానో ఉండేదిట. దీనిని ఎందుకో మరొక పెద్ద హాలులోకి మార్చవలసి వచ్చింది. అయితే దానిని కొన్ని మధ్య గదులలో నుంచి తీసుకుపోవాలి. ఈ గదుల పరిమాణాలు దీనికి సరిపోతాయా? పెద్ద పియానో ఎక్కువగా కదిలిస్తే చెడిపోవచ్చు. మరేలాగు? ఒక నిపుణుడు దీనికొక మార్గం చెప్పాడు. ఆ పెద్ద పియానో లోపల తీగలులేని చవక నమూనా తయారుచేసి కదిపి చూడమన్నాడు. చవక నమూనా దగ్గిర ఒక షాపులో చేయించారు. కాని, ఆ నమూనాని ఆ షాపులో నుంచి బయటికి ఎలా తీసుకు రావాలో ఎవరికీ అర్థం కాలేదు!

## తోక

యుద్ధం కోసం సాంకేతిక ప్రగతిని ఎంత త్వరగా సాధిస్తారో చరిత్రే చెప్తుంది. ఈ రోజు మనం చూస్తున్న ఎన్నో సాధనాలు మానవ విధ్వంసం కోసం కనిపెట్టినవే. అయితే ఆధునిక యుద్ధాలలో చేసిన పరిశోధనలు చాలా వింత పరిణామాలకి దారి తీసేవి!

ఉదాహరణకి: 1943 లో జర్మనీ మీదకి ఎన్నో బాంబర్లు పంపించేవారు మిత్రమండలివారు. ఈ బాంబరు విమానాలు రాత్రిపూటల దాడి చేసేవి. వీటికి 'రాడార్' యంత్రాలు పెట్టారు—విమానాల వెనకవయిపున. ఎందుకంటే బాంబర్లని పడగొట్టటానికి చిన్న విమానాలు వచ్చేవి, అవి వస్తున్నాయా లేదా అని తెలుసుకునేందుకు. ఈ రాడార్ యంత్రాల వల్ల బాంబర్లు మరికొన్ని కూలిపోయాయి! దీనికి కారణం ఏమిటో తర్వాత తెలిసింది. ఈ రాడార్ కిరణాల వల్లనే జర్మన్ విమానాల చోదకులు బాంబర్లని కనిపెట్టి వెంటాడేవారు..

## మాయమయిన గుర్తు

యుద్ధసమయంలో మరొక వింత జరిగింది. 'లిహార్వ్' అనే ఊరు దగ్గిర బ్రునెవాల్ అనే మరొక ఊరు ఉండేది. ఇక్కడ జర్మన్‌లు ఒక రాడార్ కేంద్రం నెలకొల్పారు. దీనిని ఎలాగయినా నాశనం చెయ్యమని బ్రిటిష్ సెయినిధికారులు తమ బాంబర్ల వారికి చెప్పారు. బాంబులు వేసిన తర్వాత చుట్టుపక్కల ఎన్నో కట్టడాలు పోయినప్పటికీ రాడార్ కేంద్రం ఒకటే మిగిలింది. మళ్లీ దానిని నాశనం చెయ్యటానికి బాంబర్లు వెళ్లగా అదే అదృశ్యం అయింది. జరిగినదేమిటంటే, జర్మనులే ఆ కేంద్రం ఆ ప్రాంతానికి ఒక గుర్తుగా ఉండి బాంబర్లకి సౌకర్యంగా ఉందని దానిని పడగొట్టేశారుట..

## నీడ బదులు ఎండ

వియత్నామ్ విశేషం ఒకటి— వియత్నామ్‌లో చెట్లు బాగా దట్టంగా ఎదుగుతాయి. వియత్‌కాంగ్ వారు వాటి కింద దాక్కుని విమానంలో వారికి కనిపించేవారు కారు. అమెరికన్లు చాలా చెట్లని కొట్టేశారు. అయితే, చెట్ల నీడ పోయి సూర్యరశ్మి వల్ల క్రింది పొదలు మరింత పెరిగి వియత్‌కాంగ్ వారు అసలే కనిపించటం మానేశారు...

### లీక్

1940 లో జర్మన్లు బ్రిటన్ మీద విపరీతంగా బాంబుదాడులు జరిపేవారు. కాని, వారు ఏ ప్రాంతాన్ని దాడి చెయ్యపోయినా బ్రిటన్, సిద్ధంగా ఉండి పోరాడే వారు. ఇది ఎందుకో జర్మన్ నాయకులకి అర్థం కాలేదు. తన పక్షం వారిలో గూఢచారులు ఉన్నారేమోనని వెతికి వెతికి చూశారు. ఎవరూ దొరకలేదు. అసలు జరిగిన దేమిటంటే— జర్మన్ బాంబర్ల కోసం వాడే రేడియో ప్రసారాల యంత్రాలని ఎప్పుడూ తనిఖీ చెయ్యలేనంత రహస్యంగా ఉంచారు. కాని, ఆ యంత్రాలలో 'లీక్'లు ఏర్పడి నాటిలో నుంచి వచ్చే ప్రసారాలని బ్రిటీషు వారు తేలికగా తెలుసుకునేవారు...

### పాము పేరు

ప్రొ. జోన్స్ మరొక చిన్నకథ చెప్పారు. అమెరికాలో 'సయిడ్ విండర్' అనే చోదితాస్త్రాన్ని తయారు చేస్తున్న సమయంలో ఆయన అక్కడికి వెళ్ళటం జరిగింది. సయిడ్‌విండర్ అంటే ఒక రకమయిన పాముకి పేరు. ఈపాములు 'ఇన్‌ఫ్రారెడ్'



కాంతి కిరణాల ద్వారా 'చూస్తాయి' అందువల్ల ప్రొ. జోన్స్ అక్కడి శాస్త్రజ్ఞులని ఆ చోదితాస్త్రం ఇన్‌ఫ్రారెడ్ కాంతి వినియోగం మీద ఆధారపడినదా అని అడిగాడుట. 'మీకెలా తెలిసింద'ని వారు అడగగా ఆయన ఊహ బయట పడింది. అసలు సంగతి వేరు: ఆ ప్రాంతంలో ఈ పాములు ఎక్కువ. అవి పక్క పాటుగా కాటు వేస్తాయి. ఈ అస్త్రం ఎగురుతున్నప్పుడు పక్కకి పోతూ ఉండేది. అందుకని 'సయిడ్ విండర్' అని పేరు పెట్టారు!

### పెళసరితనం

శాస్త్ర వినియోగం అతిగా ఉంటే వింత ఫలితాలు రావచ్చు. 1940 లో మోటారు సయికిలు నడిపేవారికి శిరోరక్షలు చెయ్యవలసి వచ్చింది. ఎన్నో లెక్కలు వేసి నిపుణులు వారికి కావలసిన పదార్థం గుణాలు— ఘనపరిమాణం, బలం వగయిరా వివరించారు. ఈ గుణాలని పట్టి అన్నిటి కన్నా తగిన పదార్థం గాజు అని అనుమానించవలసి వచ్చింది. కాని గాజుని శిరోరక్షగా వాడితే ఎలా? నిపుణులు తమకి కావలసిన గుణాలన్నీ చెప్పారు కాని అక్కర్లేని ఒక గుణం సంగతి చెప్పలేదు. శిరోరక్షకి కావలసిన పదార్థం పెళుసుగా ఉండరాదు, అని.'

### పండితు డెవరు?

చదువుకున్నంత మాత్రాన చాలదు ఆచరణ వల్లగాని ఎన్నో సంగతులు తెలియవు, అనే నిజాన్ని గుర్తించాలని చెప్తూ, ప్రొ. జోన్స్ హాప్‌కెన్స్టుంగే చెప్పిన వాక్యాలని కొన్నిటిని ఉదహరించాడు.

"పండితుడు' అన్నవాడు తన ఇల్లు దాటి వెళ్లకుండానే ప్రపంచంలో జరిగేదంతా తెలుసుకొనగలడనే నానుడి సాంకేతికాభివృద్ధి లేని పాతకాలానికి చెందిన వట్టిమాట, ఈ సాంకేతిక యుగంలో ఈ నానుడినిలోని నిజం గ్రహించగలిగే అవకాశం ఉన్నప్పటికీ స్వయంగా జ్ఞానం సంపాదించే వారు ఆచరణలో మునిగి ఉన్నారు ప్రస్తుతం, ఈ ఆచరణ వల్ల 'జ్ఞానం' సంపాదించగలిగినప్పుడే, వారి జ్ఞానం రాతవల్లా, సాంకేతికాభివృద్ధి వల్లా ఇతరులకి అందు



బాటులో ఉన్నప్పుడే 'పండితుడు' అనే వాడికి పరోక్షంగా 'ప్రపంచంలో జరిగేదంతా' తెలుస్తుంది.

—ఆర్

## మనిషి స్నేహం కోరే డాల్ఫిన్

సముద్రంలో నివసించే చేపవంటి యీ జంతువుకు మానవునితో స్నేహం చేయడమంటే సరదాట. ఇది జంతుశాస్త్రరీత్యా చేప జాతికి చెందినది కాదనీ, దాదాపు మనిషి జాతికి చెందినదే అని శాస్త్రం తేల్చింది. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఒక విమానంకూలి, ఐదుగురు వైమానికులు రబ్బరు పడవలో పసిఫిక్ మహాసముద్రంలో దూకారట. వారిని ఒక డాల్ఫిన్ చూచి, ఆ పడవను సురక్షితంగా ఒడ్డుకు తీసుకు వెళ్లిందట. అలా తీసుకు వెళ్ళడానికి దానికి కొన్నిరోజులు పట్టిందట. నేపుల్స్‌లో ఒక చిన్న పిల్ల సముద్రస్నానం చేస్తూ ఒక డాల్ఫిన్‌తో రోజూ ఆడుకునేదట. ఇలా వో మూడేళ్ళయ్యాక ఆమె చనిపోతే ఆ డాల్ఫిన్ కూడా చనిపోయిందట. ఇలాటివన్నీ పుక్కిటి పురాణాలు కావు.

1945—46ల మధ్య కాలంలో ఒక చిన్నపిల్ల ఒక డాల్ఫిన్‌తో స్నేహంచేసి, దాని వీపుమీద నిర్భయంగా ఎక్కికూర్చున్నదట. డాల్ఫిన్ ఆ పిల్లను సముద్రంలోకి తీసుకు వెళ్ళి, తిరిగి సురక్షితంగా ఒడ్డుకు చేర్చేదట. డాల్ఫిన్ గొంతు ఇంచుమించుగా చిలుక గొంతును పోలివుండడంవల్ల దీనిని "సముద్రపు చిలుక" అని పిలుస్తారు. ఎవరైనా సముద్రంలో యీత ప్రారంభిస్తే ఇవి యింటికుక్కల్లాగా వాళ్లకూడా ఈదుతూ, షార్కువంటి చేపలు మనిషి జోలికి రానీయకుండా కాపాడుతాయట. తనకు పిల్ల పుట్టగానే ఆపిల్లను తెచ్చి ఒడ్డున వదేస్తుందట. డాల్ఫిన్ పిల్ల మొదటి శ్వాస గాలిలోనేనట. (నీటిలో కాదట). ఎంత నడిసముద్రంలో వదలినా, సురక్షితంగా గురితప్పకుండా ఒడ్డుకు చేరగలవట ఇవి. తెలివితేటలలో చింపాంజీకన్నా ఎక్కువట. (ఈ తెలివితేటలు మెదడు బరువు, శరీరం బరువు నిష్పత్తిలో ఆధారపడి వుంటుందట.) చింపాంజీ మెదడు 0.7 శాతమయితే డాల్ఫిన్ మెదడు బరువు 1.2 శాతమట. (మనిషి మెదడు బరువు 2.05 శాతం.) కనుక దీన్ని మనిషి మచ్చిక చేసుకుంటే సముద్రంలో చాలా విషయాలు తెలియవచ్చని అభిప్రాయపడుతున్నారు.

—పాలాక్షుడు

# సిగ్గుతెరలు



సీత పెళ్ళి పెడాకులూ చేసుకుంటుందా? చేసుకున్నా — ఆ మొగుడుతో కాపురం చేస్తుందా? అనుకున్నవాళ్ళంతా — 'సీతకు పెళ్ళిట'అని వినగానే ఆశ్చర్యంతో క్వశ్చన్ మార్కుల్లా వుండిపోయారు.

'దీనికోసం పూజచేసిన మహానుభావు డెవడో?' అని వెటకారమూ చేశారు!

సీత చిన్నప్పటినుంచీ [illegible] [illegible] కాదు. [illegible] ముద్దు[illegible] అణకువగా ఆడపిల్లలా వుండడం ఎవరూ చూడలేదు! మొగాడికి మొగుడిలా వుండేది; చెట్లెక్కడం, బిళ్ళాకర్రా ఆడడం, మగపిల్లలతో కలియబడి జట్టీలాడుతూ వుండడం—చెప్పి చెప్పి తల్లిదండ్రులు విసిగి ఇక దండం పెట్టి వూరుకున్నారు!

స్కూలుకి వెళుతున్నపుడు బాయ్స్ దగ్గర [illegible], ఇంట్లోనూ పైనా, ఆడవాళ్ళ[illegible] మగవాళ్ళకి భయపడుతున్నట్లు, వాళ్ళేమన్నా ఏదో తప్పు చేసినట్టు ఏమీ అనకుండా తలవంచుకు వూరుకోవడం — యిలాటివి ఆమెకి నచ్చేవికాదు! ఎవరయినా ఏమయినా అంటే, అక్కడే నిలబెట్టి నాలుగూ దులిపేసేది ముఖ్యంగా మగవాళ్ళను చూసి, సిగ్గుపడిపోయి ముడుచుకుపోవడం అంటే సుతరామూ కిట్టేది కాదు. 'మనకన్నా వాళ్ళేం ఎక్కువ' అనేది.

పెద్దయి తనలో మార్పు వచ్చాక,— తను ఒకసారి వారివయిపు చూస్తే చాలు తరించిపోతాం అన్నట్టు, మాటాడితే చాలు, దాసోహం అన్నట్టు, కొంగు తగిలితే చాలు మోక్షం లభించినట్టు, ప్రవర్తించే యీ మగపిల్లల చేష్టలుచూసి, ఆమెకు ఒక విధమయిన గర్వం, అహంభావం వాళ్ళవయిపు చూసీ చూడనట్టు చూసి, నవ్వీ నవ్వనట్టు నటించి వాళ్ళను ఏడిపించడం సరదాగా వుండేది! ఆమె ఎవరికీ అర్థంగాక గింజుకొనేవారు.

'ఒక ఇంటర్వ్యూలా మగపిల్లలు పెళ్ళిచూపులకి రావడం, వాళ్ళముందు-ఆఫీసర్ల ముందు నౌఖర్లలా నిలబడి అడిగిన వాటికి జవాబులు చెప్పడం ఏమిటి? మనమే అలా వెళ్ళి వాళ్ళను ప్రశ్నిస్తే ఎలా గుంటుంది? పోనీ నచ్చిన తర్వాత, డబ్బిచ్చి వాళ్ళ తీసుకు వెళ్ళాలిగాని, తిరిగి మనం కట్నం యివ్వడ మేమిటి? మాగొప్ప మనల్ని ఉద్ధరిస్తారని?' అని అనేది

కాని సీతకూడా కలలు కంటుందని— ఆ కలలు ఎవరికీ అర్థంకానంత మాత్రంలో మొహమాటం, కపటం లేని ఆమె హృదయం, మనసూ వెనక ఏం రూపకల్పనలు చేసుకుంటూందో ఎవరికి తెలుసు?

ఏదయినా పండేరోజు వస్తుంది!

అలాగే సీత కలలుకూడా పండేరోజు వచ్చింది...తీయని వూహలతో రుచిచూడబోయే అనుభవాన్ని తలుచుగుంటూ పరధ్యాన్నంగా వుంది

వుండదూమరి! ఈరోజుల్లో పాతికేళ్ళు వచ్చేక పెళ్ళిచేయడమే, వేగిరం చేయడం! మరి పూర్వంరోజుల్లో నయితే యువతల శోభనానికి ముస్తాబుచేసినప్పే అవతల ఆపిల్లవెళ్ళి ప్రక్కింటి అమ్మాయిలతో బొమ్మల పెళ్ళిళ్ళాట ఆడుకుంటూ వుండేదట!— పాతికేళ్ళు వచ్చేసరికి నలుగురపిల్లల అనుభవంతో స్త్రీలా మారిపోయేది!

బొరిగ్గా అంత చిన్నతనంలో చేయడం దడ్డేఅయినా...స్త్రీ జీవితంలో 'స్వర్ణయుగం' లాటి 'టీన్‌ఏజ్' అంతా అడవిగాచిన వెన్నెలలా 'వృధాచేయడం ఈ రోజుల్లో—అంత మంచిపని మాత్రం కాదు! అనుభవించవలసిన రోజులు, రాత్రుళ్ళు నిద్రలో స్వప్నాలలోనే గడిపేస్తే యింకేముంది?

స్నేహితులువచ్చి పరిహాసంచేస్తే సిగ్గుతో 'పోండి మరీనూ' 'మీకూ అవుతుంది పెళ్ళి' అనాళ్ళే సారి పెళ్ళికూతురు—సీత—కమలా, శారదా, వచ్చి పరిహాసం చేసేసరికి గంభీరంగా...

'నా కలలు చెరిగి పోనివ్వకండి! నన్ను డిస్టర్బ్ చేయవద్దు!' అన్నట్టు నవ్వింది!

ఇరుగుపొరుగు అమ్మలక్కలు, వుండి వుండి వచ్చి పలకరిస్తూవుంటే— 'యీ అమ్మలక్కల గొడవేమిటీ మధ్య! పానకంలో పుడకల్లా!' అని విసుక్కుంది!

పొద్దుస్తమానం నాల్గుగంటలకల్లా లేమ్మన్నారు సీతని—స్నానం చేయించి తెల్లచీర కట్టించి కూర్చోబెట్టేరు!

అంతవరకూ బాగానే వుంది!

పిన్ని సుభద్ర గంపతో గంపెడుపూలు; చేమంతి, గులాబి, దవనం, మరువం యిలా అన్ని రకాలూ వున్నాయి అందులో—మొగలి పూవుల రేకుల్ని కత్తిరించి తయారుచేసి వుంచింది.

'రావే సీతా!' అంటూ కూర్చోబెట్టి ఒక ఘంటన్నర కదలకుండా ముస్తాబు పూర్తి చేసింది!... 'ఏదో నాజూకుగా, ఒకటో రెండో పువ్వులు పెట్టుగోవాలిగాని...ఏమిటీ దొడ్డంతా! జడ బరువుకి మెడలు లాగేస్తున్నాయి బాబూ!' అని అనేసరికి—

'నీకేం తెలుసే రతీ దేవిలా వున్నావు ఇప్పుడు తెలుసా?' అంటూ జానకి వచ్చి ముద్దుపెట్టుకున్నంత పనిచేసింది. అదే సమయానికి సీత జడని ముందుకు విసిరింది... జానకి 'అమ్మయ్యో' అంటూ 'కవిస్లాలా తగిలిందే! నీజడ బంగారంగానూ!' అంది నవ్వుతూ—

'వోటు సరసం చేస్తే మరేమవుతుంది!'

'సత్యభామ జడలా... అందుకే పూర్వం ప్రియులని జడతోనే కొట్టేవారట ప్రణయ కలహాల...లో...'

అంటూ కళ్యాణం బొట్టుపెట్టి... బుగ్గచుక్కా పెట్టింది వదినగారు... నవ్వుతూ...

'అయినా ఏమిటిది వేషం కట్టినట్టు' అని విసుక్కుంది సీత.

అందరూ కలిసి మొత్తంమీద సీతని శృంగారానికి, సింగారంచేసి బంగారు బొమ్మలా చేశారు...గునుస్తూనే చేయించుకుంది యీనాటు సారి పెళ్ళికూతురు సీత ప్రతిపనినీ విమర్శిస్తూ.

ఎంత రెండుజడల సీత అయినా ఒంటి జడ వేసుగుని ఆక్షణం దగ్గరవుతున్నకొద్దీ భారంగా నిట్టూర్చడం, భయంగా గుండె కొట్టుకోడంచేత కళ్ళు మూసుగోడం మొదలెట్టింది, ఏదో చెప్పలేని సంతోషం, ఆనందం వళ్ళు పులకలెత్తింటే ఆలోచనలూ వీటివలన సిగ్గు దానంతటే ముంచుగొస్తూంది! ఎంత ధైర్యంగా మామూలుగా వుందామని ప్రయత్నించినా వలుగుర్నీ మొహం ఎత్తిచూడలేకుండా వుంది!

'అందరికీ తెలిసినట్టు ఎందుకో యీ తంతూ, ఆర్భాటమూ, పెద్ద ఎడ్వర్టయిజ్‌మెంటులాగ' అని అనుకుంది.

'పెళ్ళి ఎలాగూ అందరిముందూ చేశారుగా...ఇంక ఆ దంపతుల కర్మానికి వారిని వదిలేయకూడదూ, వాళ్ళే వీలు చూసుకోరూ? నలుగురిముందూ... ఎందుకో... ఏమిటో యీ ఆచారం...ఛీ...' అనికూడా అనుకుంది...గాని... పైకి అనే ధైర్యం చాలిందికాదు...

'ఇంతకీ... ఆయన ... ఇన్నిటికీ...ఎలా ఒప్పగున్నారో...అతనే ఏమీ అనలిది— తనకేమి? ఎలా అనగలదు?...' అని ఆలోచించింది.

అవతలగదిలో వదినగారూ, అక్కయ్యలూ, కిలాకిలా నవ్వుతూ గది అలంకరిస్తున్నారు! సీతకోసం! సీత ఆనందం కోసం—సీత మొదటిరాత్రి కోసం!

స్నేహితురాలు జానకి నవ్వుతూ గబగబా వచ్చి సీత రెక్కపుచ్చుగుని తీసుకువెళ్ళి గదిలో నిలబెట్టింది.

'ఏమే తర్వాత మమ్మల్నేవు! యిప్పుడే చూసుకో—ఎలావుంది గది?' అని ఎగతాళి చేసింది పగలబడి నవ్వుతూ—

'ఛీఫో నీలాగేం కాదు!'—అని అంటూ సీత ఏడ్చినంతపనిచేసి అక్కణ్ణుండి తుర్రుమంటుందనుకున్న వాళ్ళందరూ—

సీత—గదంతా కలయజూసి—'సినిమాల్లో చూసినట్టు అచ్చంగా వుంది! కిటికీకి దగ్గరా...గది గుమ్మానికి ఎదురుగా...మరీ పాతకాలం పద్ధతి!...ఆ మంచం...యీగోడ వయిపు...' అని తన అభిప్రాయం కుండబద్దలు కొట్టినట్టు చెప్పేసరికి—ఆశ్చర్యపోయి—మారు మాటాడలేక పోయినారు—

జానకిమాత్రం! 'కావాలనే వేస్తే' అని వాలిక్కుర్చుకుంది'

'ఏట్లా తోస్తాయో!' అని యీసడించుకుంది కోపం కనబరుస్తూ.

రాత్రి తొమ్మిది గంటలనుండి సీతని, ఆమెభర్తని కుర్చీల్లో కూచోబెట్టి—సీత అనుకున్న అర్థంలో—నానా యాతనపెట్టారు. అందరూ ఆడవాళ్ళే! ఆ హాస్యాలకూ సరసాలకూ అంతులేదు. గంధాలు పూయించి, సెంట్లు పూయించి, పేర్లు చెప్పించి, నవ్వించి, చేసిందే చేయించి, సంతోషిస్తున్నారు.

అదిసిగ్గో, కోపమో, తెలియలేదుగాని, అన్నిటికీ మనసులో ఏమనుకున్నా...ఎదిరించి చెప్పే ధైర్యంలేక సీత అన్నిటికి వూరుకుని అట్లాగే బలవంతాన్ని చేస్తూనే వుంది. పెళ్ళికొడుకు మాత్రం పాత పెళ్ళికొడుకుల్లానే చేస్తున్నాడు!

ఎంతఅయినా వాళ్ళకి సరదా తీరడం లేదు—యీ ఆడవాళ్ళకి పెళ్ళితోనే సిగ్గుపోతుందా అనిపిస్తుంది! మామూళ్ళు రోజుల్లో ఎంత ఎరగనట్లు, నోరు లేనట్టు వుంటారో శుభకార్యాలు ఏమయినా వస్తేచాలు అంత ముందడుగు వేస్తారు! వాళ్ళమాటలకు అంతే వుండదు! చేష్టలకు మితి వుండదు! నవ్వులకు అడ్డే వుండదు—

ఇట్లాంటప్పుడే—ఆకధా కార్యం చూడ్డానికి వచ్చిన భార్యాభర్తలమధ్య చిటపటలు చూస్తూంటాం ... ఆవిడగారు కొంచం హుషారుగా నవ్వుతూ, అందరిలోనూ హాస్యాలాడుతూ తిరుగుతూండేసరికి చాలు యువతల మగవాడికి వళ్ళు మండిపోతూ వుంటుంది. తను ఎంతమందితో హాస్యాలాడినా, సరసాలాడినా, తనభార్యా ఏమనుకుంటుందోనని అయినా లెక్కచేయుడు'... అలాంటిది—తన భార్యా కొంచం కలివిడిగా వుంటేచాలు సహించలేడు!...

ఆ ఘడియ రానే వచ్చింది...సీతని అందరూ పట్టుకుని—గదిలోకి నెట్టేరు!

స్ప్రింగులా పీళ్లలోకి వచ్చేస్తుందను కున్నారు కామోసు కాని సీత అలాంటిదేం చేయులేదు. 'ఎంత వేగిరం వదిలి పోతారా కొస్త వూపిరి పీల్చుకుందామా!' అని అను కుందో ఏమో! అడుగులు వెయ్యనట్టే వేసి గదిలోకి వెళ్లింది... తలుపులు మూసు గున్నాయి. ఆ వెనకాలే-తలుపుదగ్గర—గుస గుసలూ, కిసకిసలూ—సీతకు మనసు చచ్చి పోయినట్టు అపలేదుగాని. అసహ్యంవేసింది!

తలుపుకి వున్న కర్టెన్ దించేసి యిటు వయిపు క్రీగంట తననే చూస్తున్న భర్తని చూసేసరికి సిగ్గు ముంచుకొచ్చింది! తనకు తెలియకుండానే ఆ తలుపుదగ్గరే తలవంచుకు వుండిపోయింది! అంతవరకూ తనవాళ్ళు, వదిన, అక్కయ్యలూ, స్నేహి తులూ, ముత్తయిదువులూ అందరూ తీసుకువచ్చారు! యింక ఎవరు తీసుకు వెళతారు? స్వర్గానికి చేరుకుందికి ఎన్నో దార్లు వున్నాయి.—ఎంతోమంది ఎన్నోదార్లు చూపెడతారు...అంతా స్వర్గద్వారం వరకే యింక అందులో ప్రవేశించడానికి ఎవరో ఎందుకు? ఆ స్వర్గం తనదే అయినపుడూ, తనకోసమే అయినపుడూ?...గాని ఏమో! ఎందుకో ఆ బెరుకు? అడుగు ముందుకు వెయ్యలేకపోతోంది? ఎవరూ లేరుగా? తనూ, అతనేగా...ఎందుకింక యీ భయం? తన ప్రవర్తనకి తనకే నవ్వొస్తూంది? యిలాంటి సమయాల్లో ఎలా వుండాలో ఎన్ని సార్లు ఆలోచించుకున్నది? యీ సిగ్గూ,

# సిగ్గుతెరలు

బిడియాలూ ...యీ పాతకాలపు సాంప్ర దాయాలూ, లేకుండా...మామూలుగా భర్త దగ్గరికి ఎందుకు వెళ్లలేమూ?...మాటాడ లేమూ? అని ఎన్నో అనుకున్నది ... నేటి వరకూ యీ ఆడవాళ్లు చేస్తున్నదంతా, విన్నది నెమరువేస్తూ చేసేనటన! తలుచు కుంటే మామూలుగానే వుండగలదు అను కొవేది? కాని తనవరకూ వచ్చేసరికి, అప్రయత్నంగా చూపులు క్రిందికి దిగి పోతున్నవి, కాళ్ళు వెనక్కిలాగుతున్నాయి, శరీరం అంతా అదో విధమయిన, సిగ్గుతో ముడుచుకుపోతూంది! ఇది నిజమా?

తననే చూస్తూ తనకోసమే ఎదురు చూస్తున్న భర్తని తేరి చూడలేక తలదించు కొని, కాలితో నేలరాస్తూ వుండిపోయింది.

అలా పావుఘంట...అరఘంట అయింది.. అయింది...అతను...రాలేదు!

పొంగుతున్న కోర్కెలు! మత్తెక్కి స్తున్న పరిమళాలు! మైమరపిస్తున్న వాతావరణం! ఉవ్విళ్లూరుతూన్న యవ్వనం— పులకరెత్తిస్తున్న ఆలోచనలు... పరచివున్న పూలపాన్పు!...అబ్బ! అతనువచ్చి తనను తీసుకుంటే బాగుండుననుకుంది — కాని 'అతను రాడేం?...తనే వెళ్లలేదా?...తనలో తనకే నవ్వువచ్చింది! ... అరె! తను కాల యినా కదప సాహసించలేక పోతూన్నది? ఇదేమిటి? యుగయుగాలనుండీ మొదటి రాత్రినాటి స్త్రీత్వమే...ఆ వారసత్వమే తన నరనరాల్లోనూవుండి యిలా చేయిస్తూందా? లేదు...తనలో ఏదో తనకు తెలియనిశక్తి, బంధాలు వేస్తూంది. అది సహజంగానే వుంది! అంతేగాని క్రొత్తగా ఏంకాదు!

అంతేనా? సృష్టి ఆదినుండి! స్త్రీ పౌరానన్నే వహించడమూ పురుషుడే మొదట ప్రయత్నించడమూనా? మార్పు రాదా?...కాని-ఆమార్పు వస్తేనే అసహజ మేమో?

మరయితే తను ఎంత ప్రయత్నించినా తనలో మార్పు రాలేదే? తాను మార్చుకో లేక పోయిందే?...ఏమిటో ఆ క్రొత్త... ఆ తొలి అనుభవం ఆశ్చర్యంగా వుంది! బహుశా అతనుకూడా యిలాగే సిగ్గుపడు తున్నడేమో? ... మగవాళ్లకీ సిగ్గు వుంటుందా? వాళ్లూ మనలాగే అయితే యింక యీ సమస్య విడేది ఎప్పుడు? అతని భావాలెలా వున్నాయో?'... అని తలపోస్తూ అలా నుంచునే వుండిపోయింది గాని తెగించి ముందుకు పోలేదు సీత—

ఇన్నాళ్లూ స్వప్నవీధుల్లో ఎన్నెన్ని తీయని కలలు కన్నది! యీరోజు కోసం! ఎంత పవిత్రంగా ఎదురు చూసింది?—ధన వంతుడు ధనం కూడబెట్టి కోటీశ్వరుడౌ తాడు! పుణ్యాత్ముడు పుణ్యంచేసి మోక్షం పొందుతాడు అలాగే తనూ, యీ యవ్వనం, మనస్సు, శరీరం, పవిత్రతా...అంతా యీ రోజుకోసం, యీక్షణం కోసం దాచుకుంది. యీ సమయంకోసం ఎదురుచూస్తూ పదిలపర్చుకున్నది. తనకాబోయే భర్తకోసం తన సర్వస్వం దోచుకొమ్మని యిచ్చి తరిద్దా మనుకుంది.

అటువంటిది, ఆ రోజు వచ్చింది! భర్త...తను కలలుకన్న భర్త రాడేం?... దగ్గరకు తీసుకోడేం?

ఎంతో ఆశతో అలా నుంచొనే వుంది. అలా ఎంతో సేపయింది — అయినా అతను కదిలిరాలేదు. అంత ఆశలోనూ సీతకి కాళ్లు పీకడం, మొదలెట్టేయి! ఎంతకని అలా బొమ్మలా నుంచుంటుంది! ఒకసారి తల ఎత్తి చూసింది. అతనూ అలాగే తనవైపు చూస్తున్నాడు! తప్పితే — పోనీ రమ్మని సంజ్ఞ కూడా చేయులేదు!

ఇంక సహించలేక పోయింది సీత—, అడు గులో అడుగు వేసుకుంటూ మెల్లగా నడచి



## సిగ్గు తెరలు

మంచం దగ్గర కుర్చీవుంటే అక్కడకు వెళ్ళి కూర్చుంది!

ఆమె దగ్గరకు రావడం చూసి అతను కూడా కుర్చీ దగ్గరకు వచ్చేడు!

అది చూసి 'కాస్తనయం!' అనుకుని ఆనందించింది సీత! ఇద్దరూ దగ్గరలో వున్నారు. ఒకరి గాలి ఒకరికి తగులుతూన్నది. సీతకు సిగ్గో ఏమో తెలీదుగాని ఎదురుగుండా నిలబడలేక కుర్చీలో కూర్చుండి పోయింది! అతనేమన్నా దగ్గరకు వచ్చి ముట్టుకుంటాడేమో అని ఆశతో చూసిందిగాని మళ్ళీ అతనిలో చలనం లేదు!' అలా నిలబడి వుంటేనే బావుండేది అని అనుకుంది కాని ఎంచేత ధైర్యంగా నిలబడలేక పోయావా? అనిపించింది!

సీతకి ఇంకో ఆశ్చర్యం కూడా వేసింది! అతనికి ఏమీ అనిపించలేదా? తనని చూసి అతనేమీ అనుకోలేదా? అతనిలో ఏ భావాలూ కలుగలేదా? ప్రేమ, ఉద్రేకం, తపనా, లేదా? తనతో మాటాడాలని, దగ్గరగా తీసుకోవాలని లేదా?, లేక తనలో ఆకర్షణ లేదా? ఏదయినా లోపం వుందా?... స్త్రీ గనుక తనకు—సిగ్గంటే సహజం? కాని అతనికేం? అతను మగవాడు అతనికి కూడా అంత కంటే సిగ్గా!

ఈవిధంగా సీత ఆలోచించడం మొదలు పెట్టింది. అలా కుర్చీదగ్గర అరఘంట అయింది. ఎక్కడ వాళ్ళక్కడే వుండి పోయారు! తను ఎంత ఆశించిందో అంతా యిలా జరుగుతోందేమిటి?...సీతకు మరో భయం—ఏమిటంటే—

వెనక తలుపుదగ్గర సందడిగా వుంది! అమ్మలక్కలు తక్కువవాళ్ళు కాదు! గోడలకి కళ్ళు చేసేరేమో!...సహజంగా... పాతే భుజాలు ఎగురవేస్తారు లేదూ ఏదయినా వింటూ దూరం జరిగితేనే... ఆ కళ్ళు తెరుచుకుని వీధిలోకి వస్తుంది! అతనికేదేమీ పట్టినట్టు లేదు! విగ్రహంలా చూస్తూ మంచమే వున్నాడు.—సీత యిహ వుండబట్టలేక పోయింది!... పోనీ తనొక్కసారి ముందడుగు వేసిచూదాం! అని అనుకుని అక్కడ పళ్ళెంలో తమలపాకుల చిలక ఒకదానిని తీసి అతనిచేతిలో వుంచింది!

అతడు సరసుడే! చిలకను తీసుకుంటూ నట్టే చేతినికూడా పట్టుకున్నాడు!... అతను లేవనెత్తలేదు గాని — ఆ అదును తీసుకుని, లేవనెత్తినట్టే లేచి మంచమ్మీద సీత అతని దగ్గరగా!

అతని చెయ్యి వణుకుతూంది! సీతకి ఆపాదమస్తకం పులకరించిపోయింది...ఏదో విద్యుత్తు శరీరం అంతా ఒక్కసారి ప్రాకినట్టయింది! కళ్ళు వాటంతటవే బరువెక్కి మూతలుపడ్డాయి!

కళ్ళుతెరిచేసరికి అతని రెండుచేతులూ ఆమె భుజాలమీద వున్నాయి సీత పరవశించి హృదయంమీద వాలిపోయింది! క్రింద పడకుండా ఆయనగారు ఆమెను పట్టుగోక తప్పలేదు. మొట్టమొదట పురుష స్పర్శ ఆమెను ఏదో లోకాలలోకి తీసుకు పోయింది! మంచం దగ్గరగా వుండడం వల్ల ఆమె ఆయనని పట్టుగు వాలిపోయిందో, అతనే ఆమెను పట్టుగు వ్రాలిపోయాడో తెలియడం కష్టం — మొత్తం మీద యిద్దరూ మంచంమీద కూర్చుండి పోయారు!...సీతకు నవ్వు వచ్చినా ఆపుకుంది—యిష్టం లేకపోయినా లేచి అంతా సర్దుకుని దూరంగా సిగ్గుపడుతున్నట్టు జరిగి కూర్చుంది...అతను దగ్గరగా వచ్చి—తీసుకుంటాడనే భ్రమతో — ఆ బెట్టు చేసింది? ఉహూ! అతను అలా చేస్తే యికనేం? ఆ కూర్చున్నవాడు కూర్చున్నట్టే మిడుతూ, మిడుతూ చూస్తూ కూర్చున్నాడు!

ఛీ ఎందుకు తొందరపడ్డానా! అని అనుకుంది! ఎంత చేసినా యింతే యితను కామోసు అని. ఈపాటికి అతని వడిలో లాలింపబడుతూ వుండవల్సింది! తను బెట్టు చేస్తూంటే అతను మరీ మరీ చేరదీయవలసింది! సిగ్గు తెరలను అతను తొలగించవలసింది — అంతాపోయి అతనే ఈవిధంగా సిగ్గుపడుతూండడం — సీతకి అర్థం కాలేదు! తెగించి అంతకన్నా విపులంగా తన కోర్కె ఎలా చెప్పగలదు? బొత్తిగా పురుషపాత్ర ధరించడానికి యిది నాటకం కాదుగా! మరి అతని వాలకం మాస్తే అలా వున్నది!

సీతకి లోన కోర్కెలు సముద్ర కెరటాల్లా పొంగి ప్రవహించి వెనక్కువెళ్ళి

పోతున్నాయి: ఒకే ప్రక్కమీద దగ్గరగా వుండి కూడా విడివిడిగా వుండడం! ఒకరి గాలి ఒకరికి సోకకుండా వుండడం దుర్భరంగా వుంది!

అతని మౌనం, సీతకు రోషం కలుగ జేస్తూంది! ఈపాటికి ఎంతో ఆనందంగా, ఒకరి కౌగిలిలో ఒకరు, సుఖాల తీరాలలో గడపవలసిన కాలం అంతా వృధా అయి పోతూంది!

ఇంక ప్రయోజనం కనబడలేదు! పోనీ అని తనే ముందుగా చొరవ తీసుకున్నా లాభం లేకపోయింది. ఇహ ఆ రాత్రి అంతా అట్లానే జాగరమవుతుందనే నిరాశా పూరితమయిన వూహ వచ్చేసరికి, సీతకు అనుకోకుండా దుఃఖం పొంగిపొరలి వచ్చింది! కళ్ళంట నీళ్ళు తెలియకుండానే, బొట బొట రాలేయి! అప్రయత్నంగా:

ఆ దెబ్బతో ఎదురుగుండా విగ్రహానికి చలనం వచ్చినట్లుంది! ఇంకా ఏమిటో తమాషా చూస్తున్నట్లు చూస్తూ ఆమె కళ్ళంట నీళ్ళు చూసేసరికి గబుక్కున లేచాడు ఆమె దగ్గరకు జరిగి ఆమె ముఖం తన వయిపు త్రిప్పుకున్నాడు!

'ఏడుస్తున్నావా ఛా! ఎందుకూ?' అని అడిగేడు.

అతను చేతులతో పట్టుకొని అలా సానుభూతి చూపేసరికి — సీతకు దుఃఖం వెల్లువలా ముంచుకొచ్చింది! ఆశ్చర్యం! వెక్కివెక్కి ఏడవడం మొదలెట్టింది!

తన పంచ కొంగుతో కంటి నీరు తుడుస్తూ.

'ఇలాటి సమయంలో కంటి నీరా? ఛే... తుడుచుకో! యిప్పుడేమన్నానని?' అని అడిగేడు!

సీతకు ఏడవాలో నవ్వాలో తెలియలేదు, అతను ఏమీ అనకపోవడం చేతనే తను ఏడుస్తున్నదని అతనికి తెలియనందుకు విచారించింది! కాని తనకలా అప్రయత్నంగా ఏడుపు ఎట్లా వచ్చిందో ఆశ్చర్యం కలిగింది! అచ్చంగా ఆడవాళ్ళలాగే తనూ ప్రవర్తిస్తూందా? లేకపోతే, యిలాటి పనులను విమర్శించిన తను మాత్రం ఏం చేస్తూంది! ...సిగ్గుపడడం, ... జవాబు చెప్పక పోవడం, మౌనం...బెట్టుచేయడం—ఏడవడం...యివన్నీ...కాని ఏదీ—తను చేయాలని చేయలేదే?...అదే ఆశ్చర్యంగా వుంది,

అయితే పాతకాలం స్త్రీలూ యిట్లాగే చేసే వారో ఏమో? ఆఖరికి, తిరుగులేని యీ అస్త్రం, ఏడుపుకూడా విడిచి, సాధించింది! ఆడదానికి అది దేముడిచ్చిన వరం అంటే నమ్మేది కాదు!

ఇట్లా ఆలోచిస్తూ తల దించుకు జవాబు చెప్పకుండా కూర్చొనే సరికి ... ఆమె యింకా ఏడుస్తున్నదనే అనుకొని అతను యింకా దగ్గరగా జరిగాడు ఓదార్చడానికి!

ఇంతలో కరంటు ఆఫ్ అయిపోయింది కాబోలు... బెడ్‌లైట్ ఆరిపోయి అంతా చీకటయి పోయింది! చీకటిలో సిగ్గుతెరలు తొలగి పోయినాయి. ఆ చీకటికి భయపడి నట్టు నటిస్తూ, అదే సమయమని సీత అతనిని గట్టిగా అదుముకుని వుండి పోయింది! ఇద్దరి వూపిరులూ కలిసి పోయినాయి,... అతని సిగ్గు—ఆమెకి భయ

# సిగ్గు తెరలు

పడి పారిపోయింది, ఆమె సిగ్గు కనబరుస్తూనే ఎంతో సుకుమారంగా, చాకచక్యంగా తన భావాలను ప్రదర్శించింది?

రామకృష్ణ కదే ఆశ్చర్యం కలిగించింది! సీతేగాని సిగ్గులేకుండా పురుష పాత్ర ధరిస్తే ఎట్లా వుండేది?...తనకి ఆజన్మాంతం స్త్రీ అంటే, విరక్తి అసహ్యం, భయమూ కలిగేదేమో?

తలుపుదగ్గర ముగ్ధ మోహనా కారంలో తలవంచుకు అజంతా శిల్పంలా నిలబడ్డ సీతను చూసినపుడే ... పరవశంతో లేచి—ఆమెను కౌగిలించి ఎత్తుగుని తీసుకు వద్దామా అనుకున్నాడు!... కాని ...తాను యిన్నాళ్లనుండీ అనుకున్నదంతా...వృథా అయిపోతుంది! యీ క్షణంలో కనక నిగ్రహించుకొనక పోయినట్లయితే.. తెలుసుకోవటం ఎట్లా అనేకదా వూరుకున్నాడు?

రామకృష్ణకి పాతికేళ్లపైనే వుంటాయి. జ్ఞానం వచ్చి—అమ్మాయిలంటే 'ఇది' కలిగినప్పటినుండి—పుస్తక జ్ఞానం ఎక్కువయి పోయింది: ప్రాక్టికల్‌గా ఏ అనుభవం లేకపోయినా, థియరిటికల్‌గా కొన్ని భావాలూ, అనుభవాలూ వున్నాయి అతడికి—అందులోనూ స్త్రీగురించి పుస్తకాల్లో వ్రాసిన వాటికి సమాధానం దొరకాలంటే—మరి తన భార్యే ఆన్సరు పేపరు అనుకున్నాడు!

స్త్రీకి సిగ్గు...తన మనసు బయట పెట్టదు—ఏమీచెప్పదు పురుషుడే ఆమె ప్రవర్తనబట్టి గ్రహించుకుపోవాలి!' అని... ఆనాటి కొక్కోక శాస్త్రంనుండి...యీనాటి సచిత్ర కామశాస్త్ర పత్రికలవరకూ వరవడి రాస్తున్నదే అది!...ఇదే తెలుసుకోవాలని నిశ్చయించాడు. అవసరమయితే, ఆ అమూల్యమయిన మొదటిరాత్రి అంతాకూడా వృధాగా గడిపి అయినా తానుమాత్రం ఏ చొరవా ముందుగా తీసుకోకూడదని నిర్ణయించుకున్నాడు—'

'ఆనాటి స్త్రీలయితే, విద్య వివేకమూ లేక, పురుషునిమీదే అన్నివిధాలా ఆధారపడి బానిసల్లా వుండేవారు కాబట్టి అలా వుండేవారు!...కాని యీనాటి నవనాగరికలయిన స్త్రీలు కలిసిమెలిసి ఎలా తిరుగుతున్నారు? క్లబ్బుల్లోనూ కాలేజీల్లోనూ ఎంత కలివిడిగా - మాటాడుతున్నారు? అనవసరమయిన ఆ పాతకాలపు సిగ్గుముద్రని త్రోసిపుచ్చి, తమకూ వ్యక్తిత్వం, ప్రత్యేకమయిన కోరికలూ, వున్నాయని నిలబడి ఎలా చెప్పగలుగుతున్నారు? అలాగే — యిదీని...పురుషులతోపాటు అన్ని హక్కులనూ కావాలంటున్న యీతరం వాళ్ళ యీ హక్కునుకూడ తీసుకుంటారేమో? చూద్దాం!' అనుకున్నాడు...అందుకే సీత ఎంతసేపలా నిలబడుతుందో చూద్దామని, చూస్తూ వూరుకున్నాడు! ఎవరు గెలిచినట్టు? ఆఖరికి మాచ్ డ్రా అయిందా?

సిగ్గుపడుతూ, బెట్టుచేస్తూనే, వద్దంటూనే, మనసిచ్చే ఆకిటుకే స్త్రీలలో లేకపోతే స్త్రీ పురుషులమధ్య యీ తీయని విడరాని బంధం, మోజా వుండేదికాదేమో?.. అంచేత సిగ్గులేని స్త్రీ అంటే వూహించుకోలేక పోయాడు...అది స్త్రీకి ప్రత్యేకమయిన హక్కు! అందులో పురుషుడికి వంతు లేదు అని తెలుసుకున్నాడు!

# మహీధరోక్తులు

మహీధర నళినీమోహనరావు



ప్రజలసొమ్ము దొంగ వర్తకావళిపాలు
పైళ్లపాలు సుమ్ము ప్రభుత సొమ్ము
ప్రముఖ నటుల సొమ్ము వ్యసనాలపాలురా
హృదయవర్తి యీ మహీధరోక్తి.

మారువోము లోక్కసారి రంకొనరింప
సరియటన్న సొమ్ముమెరుగవొక్కొ
మదతికేనోము సులభపద్ధతి యుండ?
హృదయవర్తి యీ మహీధరోక్తి.

అగ్గినురుకవచ్చు నద్దిలో బడవచ్చు
కాలకూట విషము గ్రోలవచ్చు
వాచరువనిమాత్ర మాచరింపగరాదు
హృదయవర్తి యీ మహీధరోక్తి.

'మొగిలుగాంచి నెమలి పురివిప్పినర్తించు
బిగడి రాజహంస మొగము ముడుచు
సకలజనులమెప్పు సాధింప లేమయా!
హృదయవర్తి యీ మహీధరోక్తి.

పరుల వర్ణభేద భావమ్ము ఖండించు,
కొడుకు కులముదప్పు గొంవెట్టు
పరులకంతికన్న బాధరా తన కంతి
హృదయవర్తి యీ మహీధరోక్తి.

# విద్యార్థులకు

## గొప్ప అవకాశము!

## చార్జీలలో

# 30% తగ్గింపు

విద్యార్థులైన మీకు ఇప్పుడు విమాన ప్రయాణం అందుబాటులో వుంటుంది. యూరప్‌కు వెళ్లే విద్యార్థులకు, అక్కడ నుంచి వచ్చే విద్యార్థులకు చార్జీలో 30% తగ్గింపు యివ్వబడుతుంది. 12 సంవత్సరములకు పైన 31 సంవత్సరములు లోగల వారికి ఈ సదుపాయము లభిస్తుంది.

ఇంతే కాదు తగ్గింపు చార్జీలో 15% మాత్రమే ముందు చెల్లించి ప్రయాణము చేయవచ్చును మిగతా రొఖము 20 నెలవారీ వాయిదాలలో కడితే చాలును.

**ఈ పట్టీని చూడండి:**

| క్రింది చోటునుండి | లండన్‌కు వెళ్లడానికి కాని, లేదా లండన్ నుండి రావడానికి కాని, ఎకానమీ తరగతి చార్జి | పూర్తి రొఖము ఇవ్వనిదే మొదట చెల్లించ వలసిన రొఖము |
|---|---|---|
| | రూ. | రూ. |
| బొంబాయి | 2015 | 303 |
| కలకత్తా | 2265 | 340 |
| ఢిల్లీ | 2015 | 303 |
| మద్రాసు | 2248 | 338 |

ఇతర వివరములకు మమ్మలిని గాని, మీ ట్రావెల్ ఏజంట్‌ను గాని కలుసుకోండి



# ఎయిర్-ఇండియా

దహకారులు: బి.ఒ.ఎ.సి. మరియు క్వాంటాస్




ఉన్నవ విజయలక్ష్మి

### జరిగిన కథ

సుజాత టీచరుగా పని చేస్తూ మానేసి టైపు నేర్చుకున్నది అన్నపూర్ణా ఇంజనీరింగు వర్క్సులో టైపిస్టుగా చేరింది. ఆ కంపెనీ అధిపతి నీలకంఠం. అతని కొడుకు శ్రీధర్ శ్రీధర్‌ని ఎక్కడో చూసి నట్టు అనిపిస్తుంది సుజాతకి సూర్యం సుజాతకి మేనబావ ఆమెని వెతుక్కుంటూ వస్తాడు వాళ్లిద్దరికీ పెళ్ళి చెయ్యాలని తలిదండ్రులు చిన్నప్పుడే అనుకున్నారు సూర్యం అందంగా వుండడు చదువు కూడా అబ్బలేదు సుజాత అతన్ని తప్పించుకు తిరుగుతూ వుంటుంది. మొదట్లో ఏదో అనుకున్నా, రాను రాను సుజాతని సూర్యాని కివ్వాలనే ఆలోచనని విరమించుకున్నారు ఆమె తల్లిదండ్రులు

## 4

అప్పటికి ప్రసంగం ఆగిపోయినా నాలుగురోజులు పోయాక ఆవిడ మళ్లీ అదే విషయం కదిలించింది. 'అది కాదండీ— అమ్మాయి అత్తవారింటికి వెళ్లిపోతుం దంటే నాకూ దిగులుగానే వుంది—అలాగని ఎన్నాళ్లు ఇంట్లో కూర్చోపెట్టుకుంటాం. ఈబాధ్యత ఇవాళ కాకపోతే రేపయినా తీర్చుకోవలసిందే— సరే మనకి వున్నదేదో అమ్మాయికే చెందుతుందనేది అందరికీ తెలిసినవిషయమే అనుకోండి — అలాగని ఇవాళ బోలెడు కట్నం గుమ్మరించగల స్థితిలో మనం లేముకదా—ఎంత తక్కువలో చేసినా అప్పుచెయ్యక తప్పదు' అని, మెల్లిగా అసలుసంగతి బయట పెట్టింది. 'మొన్న సుందరమ్మగారి అక్కకొడుకు వచ్చాడు—కుర్రాడ్నిచూస్తే ముచ్చటేసింది— అతనినాటాకి పదెకరాలు వస్తాయిట ఆస్తిలో. సరే బ్యాంకిలోవుద్యోగం, రెండొందల పైనే వస్తుందిట—కట్న కానుకలమీద అంతగా ఆశలేదుట—'

'ఆ, లేదుట ఉంటేమాత్రం ఇంతోటి గుమస్తాకి కట్నం ఎవరు గుమ్మరిస్తారనో...' ఈసడించి పారేసింది సుజాత.

'నీకింకా చిన్నతనం మంచీచెడ్డా తెలియటంలేదు — గుమస్తా ఏమిటి క్రమంగా ఇంకా పెద్దపని అవుతుందట. ఏ ఉద్యోగం లేని వాడికే వేలకి వేలు గుమ్మరించి పిల్లనిచ్చి ఆతరువాత వీళ్లకాళ్లు వాళ్లకాళ్లు పట్టుకుని ఉద్యోగం వేయించుకుంటున్న రోజులివి—మీరేం మాట్లాడరేమండీ...'

'ఏం మాట్లాడక్కర్లేదు — నేనా సంబంధం ఏమైనాసరే చేసుకోను, హాయిగా చదువుకుంటాను' మధ్యలోనే కస్సుమంది సుజాత.

'అబ్బ పోనీలే ఇవాళే అంత మునుచుకు పోయిందేముంది — ఆ సుందమ్మగారి అక్క కొడుకు కాకపోతే మరో సూరమ్మగారి పిన్ని మనవడు దొరక్కపోడులే' అన్నాడు రంగనాథం ఆ సమస్యని అంతటితో తేల్చేస్తూ.

నిజం చెప్పాలంటే, కూతురికి ఇష్టం లేదనే కారణం ఒక్కటేకాదు అసలు అతనికీ అప్పటికప్పుడు ఆ సంబంధం మాట్లాడుకోవాలనిపించ లేదు— ఇంతకన్నా విధాల మెరుగయిన సంబంధం వచ్చి తీరుతుందని అంతరాంతరాల్లో ఏదో గట్టి నమ్మకం—తనవూహకి తనకే నవ్వు వచ్చింది— వెనక ఓసారి స్టాఫ్‌రూమ్‌లో జరిగిన సంభాషణ గుర్తువచ్చింది —

'మీ మేనగోడలికి సంబంధం నిశ్చయం అయినట్లేనా' అని అడిగాడు రంగనాథం జగ్గరాజుగారిని, ఆయన వారం రోజుల క్రిందట రెండురోజులు శలవపెట్టి ఏదో సంబంధం చూడటానికి వెళ్తున్నానని చెప్పటం గుర్తువచ్చి

'అబ్బే ఎక్కడండీ— ఒకటి బాగుంటే మరొటి నచ్చటంలేదు. ఇప్పటికి మూడేళ్లనుండి అడుగుతున్నాడు మాబావ— దానికి ఎప్పటికి కళ్యాణయోగం వుందో మరి.' అన్నాడు జగ్గరాజుగారు.

అప్పటిదాకా పేపరు చదువుకుంటూ కూర్చున్న సదానందం పేపరు మడిచి బల్లమీద పడేసి, 'ఎంత ప్రయత్నం చేసినా ఎక్కడా సంబంధాలు కుదరటంలేదు అని గోల పెడతారే కాని, నన్నడిగితే అందుకు సగం కారణం ఆడపిల్లల తల్లిదండ్రులే', అన్నాడు రవంత నిర్లక్ష్యంగా.

రంగనాథం చిన్నగా నవ్వేశారు కాని జగ్గరాజుగారు దెబ్బతిన్నట్లు చూశారు.

'అహ మీ విషయంకాదు—లోకం తీరు చెప్తున్నాను — తనకి కలిగినంతలో కాస్తో కూస్తో ముట్టచెప్పి అందుబాటులో వున్న సంబంధం చెయ్యాలని చాలామంది అనుకోరు — అల్లుడింతటివాడు కావాలి, అంతటివాడు కావాలి అంటూ కోరికలు పెంచుకుంటారు మరి అలాంటివాడు వూరికే వస్తాడా — వేలకి వేలు గుమ్మరించాలి — అందుకు ఎక్కడో అప్పు చెయ్యటం లేకపోతే ఉన్న ఆస్తి తాకట్టు పెట్టి డబ్బు తేవటం ఆ తరువాత అది తీర్చేమార్గం లేక ఇల్లూ వాకిలీ అమ్ము

కోటం మనం చూస్తూనే వున్నాం — అలా కాకుండా నా కింతకన్న శక్తిలేదు, చదువు కొస్త తక్కువయినాసరే శక్తి లేకపోయినా సరే పిల్లవాడు బుద్ధిమంతుడై నాలుగు రాళ్ళు సంపాదించుకుంటే చాలు అని వాళ్ళు అనుకున్నరోజున నిమిషాలమీద కుదురు తాయి సంబంధాలు—ఎవరిదాకానో ఎందుకూ, మా స్వంత బావమరిదే వున్నాడు — అది కావాలి ఇదికావాలి అంటూ హిరణ్యాక్ష వరాలు మనస్సులో పెట్టుకునీ, వచ్చిన సంబంధాలన్నీ చెడగొట్టుకున్నారు. ఈ రోజుదాకా ఆ అమ్మాయికి పెళ్లి చెయ్య లేక పోయాడు — ఇప్పుడా అమ్మాయికి నలభై ఏళ్లు దాటుతున్నాయి— మరి చేసే దేమిటి లెండి...'

'చూస్తూ చూస్తూ దారినపోయే దానయ్య కివ్వలేరు కదా మరి—పిల్లలు సుఖ పడాలనీ సంతోషంగా వుండాలనీ కన్న వాళ్లు ఆశలు పెంచుకోటం అక్రమం ఏంకాదు' అన్నాడు జగ్గరాజుగారు వూరుకో లేక

'అదిగో అక్కడే వస్తుంది చిక్కు — అమ్మాయికి అదృష్టం కలిసిరావాలి కాని మనం అందలం ఎక్కించాలంటే కుదురు తుందిటండీ—మన చేతిలో ఏం లేదు దైవ ఘటన వుండాలి, అంటూ ఓ ప్రక్కనుంచి వేదాంతం మాట్లాడుతూనే మరో ప్రక్క నుంచి దీనికిదీ దానికది అంటూ అన్నిం టికీ అన్నివంకలూ పెడతారు—ఏమో నేను మాత్రం ఒకటే ప్రిన్సిపల్ పెట్టు కున్నాను మా అమ్మాయిల్ని వాళ్ళు 'మేమింక చదువుకోం' అనేదాకా చదివిస్తాను. ఆ పైన ఉద్యోగంలో చేర్పిస్తాను. వాళ్లనీ వాళ్ల ఉద్యోగాల్ని చూసి ఎవరైనా చేసుకో వాలే కాని నేనొక్క కానీ కట్నం ఇవ్వను— మంచి సాంప్రదాయం అబ్బాయి అమ్మాయికి నచ్చటం తప్ప నా కింకేమీ అక్కర్లేదు — అతను మంచి సంపాదన పరుడైతే పెళ్ల యాక భార్యని ఉద్యోగం మానిపించి మహా రాణిలా చూసుకోమను — అంతేకాని నేను మాత్రం అలాంటివాడే కావాలని వెతకను' అన్నాడు సదానందం. బల్లగుద్ది నలుగురికీ వినిపించేలా మరీ చెప్పి చిరునవ్వుతో చుట్టూ కలయజూశాడు గర్వంగా.

'మీరు అదృష్టవంతులండీ— ఈమాటే నేను మా ఇంట్లో అంటే మా ఆవిడ ఇవాళనుంచి ఉపవాసాలు మొదలు పెడు తుంది—ఆడపిల్లలచేత ఉద్యోగాలు చేయిస్తా నంటావుటరా అంటూ మా నాన్న చిందులు తొక్కుతాడు — అయినా ఘటనుండాలి అంటూ ముక్కు మూసుక్కూర్చుంటే యెలా అవుతుంది మానవయత్నం కూడ వుండొద్దూ' అన్నాడు జగ్గరాజుగారు...

ఇప్పుడు ఆలోచిస్తుంటే సదానందం



మాటల్లో కొంతవరకూ నిజం వుందేమో వనిపిస్తోంది రంగనాథానికి— లేకపోతే తను లక్షణంగా ఆ సుందరమ్మగారి అక్క కొడుక్కి ఇవ్వటానికి అంగీకరించేవాడ్ని అనుకున్నాడు.

'అయినా అందరితో నాకు వంతేమిటి— వాళ్లలా నాకేం పదిమంది లేరు — ఉన్న ఒక్క పిల్ల మనసూ గ్రహించకుండా ఎవరికో ఒకడికి కట్టబెట్టాల్సిన అవసరం నాకేం లేదు— అది బి. ఏ. చదవాలని సరదా పడుతోంది. దాని తెలివితేటలూ మార్కులూ చూస్తుంటే నాకూ ముచ్చట గానే వుంది — ఏముంది మూడేళ్లు కళ్లు మూసుకుంటే ఆ చదువయిపోతుంది—అన్ని విధాల అమ్మాయికి తగినవాడిని వెతికి పెళ్లిచేస్తాను. అవసరం అయితే ఇంటిమీద అప్పుతెచ్చి కట్నం గుమ్మరిస్తాను. నాకేమిటి' అని తన భుజాలు తనే చరుచుకున్నాడు.

రిజల్ట్సు వచ్చాయి. సుజాత ఫస్టు క్లాసులో పాసయింది.

తన మాటలు ఆ తండ్రీ కూతురూ లక్ష్యపెట్టరని తెలిసినా నోరు మూసుకు కూర్చోలేక మరోసారి చెప్పి చూసింది.

'ఈ మూడేళ్ల చదువూ అయింతరువాత అప్పుడు సంబంధాలు చూడటం మొదలు పెడతారా — ఏమో బాబు మీ యిష్టం — తీరాచేసి వెంటనే ఏదీ కుదరకపోతే— ఆ రామయ్యగారి పిల్లల్ని చూస్తున్నాం కదూ.

## సుజాత

పాతికేసేళ్లు నిండిపోయినా వాళ్లకి పెళ్లి కొడుకులు దొరకలేదు — అలాంటి వాళ్లని చూస్తుంటేనే...'

'చూడటం మానేసేయి హాయిగా— లేకపోతే చిమ్మిలి ముద్దలాంటి ఆ అమ్మాయిలకి బంగారపు బొమ్మలాంటి మన సుజాకి పోలిక తెస్తావేమిటి — నీకు రాను రాను చాదస్తం వచ్చేస్తోంది మరీను' అంటూ కసురుకున్నాడు రంగనాథం.

'నలుగుర్ని చూసయినా మనం జాగ్రత్త పడాలి కదా అని...' ఇంకా ఏదో చెప్పబోతున్న ఆవిడ్ని ఈసారి కూతురే అడ్డుకుంది.

'వాళ్ల గురించిన బెంగ వాళ్లకంటె నీకే ఎక్కువున్నట్లుందే' అంటూ.

'నువ్వసలు కనీసం యాభై సంవత్సరాల క్రితం పుట్టాల్సిన దానివి. ఈ రోజుల్లో అసలు బియే చదవని ఆడపిల్లే లేదు — రమా వాళ్ల చిన్న మామయ్య కూతురు అమెరికా కూడా వెళ్లి చదువుకుని వచ్చింది— నీ మాటలు వింటే నలుగురూ ఆశ్చర్యపోతారు' అంటూ గయ్యిమంది.

'సరేనమ్మా — నీ ఇష్టం మీ నాన్నగారి యిష్టం' అనేసింది ఇంక ఏమీ అనలేక మీనాక్షమ్మ.

ఎవరింట్లో పెళ్లి బాజాలు మోగినా, తనయింట్లో ఆ శుభకార్యం ఎప్పుడు జరుగుతుందా అని తహతహ లాడిపోయేది.

ప్రక్కింటి పార్వతమ్మగారి కోడలికి గాజులు పెడ్తున్నారని పేరంటానికి వెళ్లివచ్చి 'బోలెడుందన్న పేరేగాని ఘనంగా ఏమీ తీసుకు రావేలేదు వాళ్లు—పార్వతమ్మగారి మొహం చిన్నబుచ్చుకున్నట్లు స్పష్టంగా కనిపిస్తూనే వుంది పాపం.' అని కూతురితో పైకిచెప్పి, 'రేపు నేనుచెయ్యాల్సినప్పుడు వూరంతా చెప్పుకునేలా గొప్పగా చేస్తాను—మాట వుండిపోతుంది — మరో వందరూపాయలు మనవి కాదనుకుంటే ఎన్నయినా చెయ్యొచ్చు.' అనుకుంది లోలోపల. ఆ సంఘటనని వూహించుకుంటూ — ఇరుగింటి ఇందిరమ్మగారికి మనవడు పుట్టాడని తెలిసి చూసివచ్చి అలా మనవడ్ని ఎత్తుకుని ముద్దాడేరోజు తనకెప్పుడు వస్తుందా అని మురిసిపోయింది.

'అమ్మాయి పెళ్లిచేసి అత్తవారింటికి పంపించేశాకమనిద్దరం హాయిగాయాత్రలు చేసివద్దాం' అని సరదా పడుతూండేది.

'ఎదిగిన పిల్లకి సంబంధాలు చూడాలనే తొందరయినా లేదు ఏం మనిషో...అంటూ విసుక్కుంటూండేది మధ్య మధ్య.

'చూస్తానులే' అంటూ రంగనాథం సమాధానం చెప్తూనే వున్నాడు. రోజులు గడిచిపోతూనే వున్నాయి.

తెల్లవారటం చీకటి పడటం, తిరిగి తెల్లవారటం అనేది ఎవరికోసం ఆగకుండా సాగిపోతూనే వుంటుంది-కాని, ఆగా తన దారిన తను నిరంతరంగా ప్రవహించిపోతూ వుండే కాలవాహిని కల్పించిన పరిస్థితులు మాత్రం అందరిపట్లా ఒక్కలాగే వుండవు కొందరిని అదృష్టం వరించి అందలం ఎక్కిస్తుంది — మరి కొందరిని అథః పాతాళానికి అణిచివేస్తుంది —

ప్రక్కవూరి కరణంగారు ఆరెకరాల బంగారంలాంటి మాగాణితో పాటుగా తన కూతుర్ని సూర్యానికి ధారపోసి శాంతమ్మ అహంకారాన్ని మరో మెట్టుపైకి ఎక్కించాడు —

ఇటు, రంగనాథం కుటుంబం విన్నడూ ఎవ్వరూ వూహించని సంఘటనలని ఎదుర్కొంది-అదంతా మరోగాథ. చివరికి ఆ తల్లీ కూతురూ హైదరాబాదు చేరటం, సుజాత ఉద్యోగం చూసుకోటం జరిగింది.

* * *



సాయంకాలం నాలుగంటలయింది–జ్యేష్ట మాసపు ఎండ ఇంకా చుర్రుమనిపిస్తూనే వుంది.

'ఇప్పుడే వెళ్లాలిటమ్మా–ఎప్పుడో ఆరు గంటలకి కదా పార్టీ–బయట ఎండ మరీ పేల్చేస్తోంది' హడావిడిగా తయారవుతున్న కూతురితో అంది మీనాక్షమ్మ.

'పనులు చేసుకునే వాళ్లకి ఎండ కొండ ఏమిటమ్మా–ఈ హైదరాబాదు ఎండకి నేను అలవాటు పడిపోయాను' అంటూ తల్లిచేతిలో కాఫీగ్లాసు అందుకుంది.

'ఈఏడు బొత్తిగా వానలుకూడ కరువయిపోయాయి. అదివరకు ఇంతవేటు లేదుట–జనం మరీ అల్లాడి పోతున్నారు–పరేకాని ఈ ఎండలో ఇప్పుడు బస్సుదాకా

విడిచి వెళ్ళకు రిక్షా చేసుకో' తనసంగతి తను చూసుకోగలిగే వయస్సు వచ్చినా తల్లి ప్రేమ అలా అనిపిస్తుంది.

'అలాగే' అంటూ ఖాళీగ్లాసు తల్లి చేతికిచ్చి అద్దంలో మరోసారి మొహం చూచుకుని, తలుపులు తెరుచుకుని బయట పడింది సుజాత.

ఎండపొడ సూటిగా మొహంమీద పడుతుంటే హేండ్‌బ్యాగ్ అడ్డుపెట్టుకుని రిక్షాకోసం చూస్తూ నడుస్తోంది— సందు మలుపులో వున్న రిక్షా అబ్బి హాయిగా అందులో పడుకుని నిదర పోతున్నాడు.

మధ్యాహ్నం అప్పుడు తలుపులన్నీ వేసుకుని హాయిగా ఫాను పెట్టుకుని గదిలో విశ్రాంతి తీసుకుంటున్నవాళ్ళే 'అబ్బా ఎండలు' అంటూ ఆపసోపాలు పడి పోతారు— పనిలేని కాస్త వ్యవధిలోను, కనిపించిన చెట్టుక్రింద నిశ్చింతగా కళ్ళుమూసుకుని విశ్రాంతి తీసుకుంటున్నాడు వీడు—ఏదైనా జరుగుబాటుని బట్టే—' అనుకుంటూ ముందుకు సాగబోయింది — ఈలోగా రిక్షా అబ్బి లేచికూర్చుని ఆవలిస్తూ, 'రిక్షా కావాలామ్మా' అంటూ పిలిచాడు.

రిక్షా కొస్తదూరం అయినా వెళ్ళిందో లేదో, చూస్తూండగానే ఎండ పోయి ఆకాశం అంతా నల్లగా మేఘాలు కమ్ముకు వచ్చేశాయి. చల్లటిగాలి వంటికి హాయిగా తాకుతూంటే, 'వాన వచ్చేలా వుంది' అనుకున్న సుజాత 'కాస్త త్వరగా పోనీ' అని వాడికి చెప్తూండగానే టపటప ఆమె మొహం మీద ఒడిలోను జారిపడ్డాయి. 'అబ్బ ఇంత పెద్ద చినుకులేమిటి' అని తెల్లబోతూ 'అరే వడగళ్ళు నే నెప్పుడూ చూడనేలేదు' అనుకుని సంబరపడి పోయింది చిన్నపిల్లలా.

రిక్షాని ఓవారకి ఆపి గబగబ పరదా కట్టేలోపునే గంపలతో గుమ్మరించినట్లు వడగళ్ళు పడటం, అలా కురిసి, ఎంత హఠాత్తుగా వచ్చిందో అంత హఠాత్తుగానూ వెలిసిపోయింది.

తలపాగా వూడదీసి తలమీదనుంచి భుజాలచుట్టూ కప్పుకొని ఓ గోడవార నిలబడి సిగరెట్టు ముట్టించిన రిక్షా అబ్బి, వాన వెలిసిపోవటం చూసి, ఆ బట్ట పిండి దులిపి మళ్ళీ తలకి చుట్టేసుకుంటూ వచ్చాడు.

'ఈతడి బట్టలతో ఎలా వెళ్ళటం' అనుకుని రిక్షా వెనక్కి తిప్పమంది సుజాత.

'వచ్చావా, నీమాటే అనుకుంటున్నాను ఎక్కడ చిక్కుపడిపోయావో అని — ముందా బట్టలు మార్చుకో— ఇంత మొహం తుడుచుకో' అంటూ టవల్ అందించి కూతురి చేతిలో బ్యాగ్ అందుకుంది మీనాక్షమ్మ.

'మొదట చిన్నవిగానే వున్నాయి. కాని తరువాత అబ్బ మరీ పెద్ద ఉసిరికాయలాగ పడుతూంటే మొహానికి దెబ్బకూడ తగులుతుందని చేతులు అడ్డపెట్టుకున్నాను.' బట్టలు మార్చుకుని వచ్చి, అరచేతిలో పౌడరు వేసుకుని మొహానికి రాసుకోబోతూ నుదుట తడుముకుంటూ అంది సుజాత.

'చూస్తూండగానే మొత్తేసింది— వీటికే మనం ఆశ్చర్యపోతున్నాం కాని వో ఏడు ఇంత పెద్ద పెద్ద ఇటిక ముక్కలాగ పడ్డాయట. రోడ్డుమీది లైట్లన్నీ పగిలి పోయాయట. వీళ్ళ డాబామీద కుప్ప పోసినట్లు అలా వుండిపోతే వాన వెలిశాక పారలతో తవ్వి అవతల పారేశారుట — వీటినే నేను ఆశ్చర్యంగా చూస్తుంటే జానికమ్మగారు చెప్పారు — ఇక్కడ వడగళ్ళ వానలు మామూలేట' తడిబట్టలు దండెంమీద ఆరేస్తూనే చెప్పింది మీనాక్షమ్మ—

రెండు నిమిషాలలో తయారయి మళ్ళీ బయలుదేరింది సుజాత.

నీలకంఠంగారు విదేశాలకి వెళ్తున్న సందర్భంలో ఆయన ఏర్పాటు చేసిన పార్టీ జరగబోతోంది అవాళ ఆరుగంటలకి. ఆఫీసు ఆవరణలో పెద్ద షామియానా వేశారు. ఏర్పాట్లు అన్నీ చాలా భాగం పూర్తి అయిపోయాయి. అయినా ఆఫీసు స్టాఫ్, ఫ్యాక్టరీ పనివాళ్ళు అంతా నడుం కట్టుకుని తమయింట్లో శుభకార్యం జరుగుతున్నంత హడావిడిగా అటూ ఇటూ తిరుగుతూ చేతికందిన పని అందుకుంటున్నారు. ఆదివారం కావటంవల్ల అందరికీ శలవే. అయినా ముందుగా వచ్చిన నలుగురూ నాలుగు పనుల్లోనూ జొరబడిపోయారు.

రిక్షాదిగి లోపలికి వస్తూ 'అందరూ వచ్చేసి నట్లున్నారు. ఛ నేనొక్కదాన్ని దర్జాగా, ఆలశ్యంగా వచ్చాను.' అనుకుని సిగ్గుపడిపోయి.

'నేనూ త్వరగానే రావాలనుకున్నాను, పాడువాన నేను బయలుదేరే సరికి పట్టుకుంది.' అంది ఎదురుగా కనిపించిన సీతాపతిగారితో,

'ఆ ఫరవాలేదులే—వాళ్ళంతా చేస్తున్నారుగా—అయినా ఇవాళ ఈ వాన చాలా చికాకు పెట్టేసిందిలే. ఏదోలే వాతావరణం కాస్త చల్లబడింది.' అంటూనే హడావిడిగా మరో పనిమీద వెళ్ళిపోయాడు ఆయన.

ఏర్పాట్లన్నీ ముగిశాయి. అతిథులు ఒక్కొక్కరే రావటం మొదలు పెట్టారు— ఇద్దరు మంత్రులుకూడ ఆహూతులలో వుండటం ఆపార్టీ విశేషం.

అల్పాహారా నంతరం వచ్చిన వాళ్ళలో కొంతమంది ప్రముఖులు, మంత్రులు నీలకంఠంగారిని అభినందిస్తూ కాస్సేపు మాట్లాడారు — అన్నపూర్ణ ఇంజనీరింగ్ వర్క్స్ ఒక్క హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్‌లోనే కాకుండా దేశం మొత్తంమీద ఓ చెప్పుకోదగిన స్థానం సంపాదించుకున్నదనీ, ఆ ఫ్యాక్టరీలో తయారయిన సరుకు విదేశాలకి కూడ విరివిగా ఎగుమతి అవటం మనం అందరూ గర్వించవలసిన విషయం అనీ, ఆ ప్రయత్నంమీద వెళ్తున్న నీలకంఠంగారు ఆ ప్రయాణం దిగ్విజయంగా ముగించుకుని తిరిగి రావాలని తామంతా కోరుకుంటున్నామనీ — ఇదే అర్థం వచ్చే మాటలు అంతా తలోరకంగా చెప్పారు—

నీలకంఠంగారి ప్రయాణంలో మరో ఉద్దేశ్యం కూడవుంది — ఏదైనా ఒక ఫారిన్ కంపెనీతో కలిసి తన ఫ్యాక్టరీలో స్కూటర్లు తయారుచేసే యూనిట్ నెలకొల్పాలనేది ఆయన చిరకాల వాంఛితం — అందుకు కావలసిన సాధనసంపత్తిని సమకూర్చుకోటానికి, సంప్రతింపులు జరపటానికి కూడ ఈ ఈ ప్రయాణం ఉద్దేశింపబడింది—ఆ విషయం ఆయన గోప్యంగానే వుంచారు.

ప్రయాణానికి కారణాలు ఏమైనాకాని దానికోసం ఈ పార్టీ ఇదీ అంటూ ఇంత ఆట్టహాసం చేసే మనిషికాదు ఆయన—అయితే ఇవాళ ఇన్ని ఏర్పాట్లు చేశాడు అంటే దానికి వేరే కారణంకూడ వుంది.

నెలరోజుల క్రిందట వాళ్ళ ఫ్యాక్టరీ మూసివేయవలసిన పరిస్థితి ఏర్పడింది— కారణం మామూలిదే—యజమానులకీ పనివారికీ మధ్య తగవు — చిత్రం ఏమిటంటే

ఎప్పుడు ఏ ఫ్యాక్టరీ యజమానులకి కార్మికులకీ మధ్య వివాదాలు వచ్చినా తప్పంతా యజమానులదే అయివుంటుంది అన్నదృష్టి చాలామందిలో నాటుకు పోయింది–కార్మికుల కోర్కెలూ షరతులూ ఎంతవరకు సబబుగా వున్నాయి అనే విషయం చాలామంది ఆలోచించరు–అయినా అసలు కారణం తెలుసుకోకుండా ఏ ఒక్కవర్గాన్నీ నిందించటం సరి అయిన పద్ధతికాదు–ఒక సంవత్సరం అనుకోకుండా పెద్ద ఆర్డర్లు రావడంవల్ల—వకాలంలో అంత సరుకునూ సప్లయిచెయ్యటానికి మరికొంతమంది పనివారిని తీసుకుని ఉత్పత్తి పెరిగేలా చూసుకుంటాడు యజమాని–అలాంటి డిమాండు ఎప్పుడూ వుంటుందని చెప్పలేం—మీ సరుకు అమ్ముడు పోవటంతోకాని మీకు లాభాలు రాకపోవటంతోకాని మా కెలాంటి సంబంధమూ లేదు. టెంపరరీగా తీసుకున్న లేబర్ని పెర్మనెంట్ చెయ్యాల్సిందే. గత సంవత్సరం ఇచ్చినట్లుగా బోనసులు ఇవ్వాల్సిందే అని ఒత్తిడి తీసుకురావటం న్యాయం కాదు–

ఇప్పటికే అధికమైన పన్నుల భారంతో కృంగిపోతూ సాటి ఉత్పత్తిదారుల పోటీకి తట్టుకుంటూ ఫ్యాక్టరీ నడుపుకుంటూ వస్తున్న యజమానికి కార్మికుల కోర్కెలకి యెల్లవేళలా సమ్మతించటం తలకి మించిన పనే అవుతుంది–తను పెట్టిన పెట్టుబడికి కనీస లాభాలయినా రావాలనుకోటం నేరం కాదుకదా–

అయితే ఈ విషయాలన్నీ పనివారికి తెలియవా అనే ప్రశ్న రావచ్చు–కాని డబ్బు ఎక్కువగా ఇప్పిస్తాం అంటే ఎవరికైనా ఆశగానే వుంటుంది — యజమాని పరాయివాడు, లేబరులీడర్లు మనవాళ్లు అనే భావం వాళ్లకి ఏర్పడిపోతుంది–

అన్నపూర్ణా ఇంజనీరింగు వర్క్స్ విషయంలో అలాగే జరిగింది–ఇద్దరూ ఒక ఒప్పందానికి రాలేకపోవడంవల్ల ఇంక రేపటి నుండి ఫ్యాక్టరీ మూలపడుతుంది అనేవరకు వచ్చింది–ఆ సమయంలో మనం బాగా పుంజుకుని సరుకు విరివిగా అమ్ముకోవచ్చు అని సంబరపడ్డారు కొంతమంది — వాణ్యానికీ మన్నికకీ పేరుపొందిన ఆ సరుకు మళ్లీ తయారయి వచ్చే లోపున తమ దగ్గర వున్న వాటిమీద అధిక లాభాలు గడించవచ్చునని ఆశపడ్డారు వర్తకులు — కాని అందర్నీ ఆశ్చర్యపరుస్తూ, ఆశలు పెంచుకున్నాళ్ళకి ఎంత నిరాశ అసూయకలిగేలా, సమ్మె విరమించుకుంటున్నాం అన్న ప్రకటన వెలువడింది.

'ఆ లేబరు లీడర్లకి చాటుగా ఇంత ముట్టచెప్పి బెడద వదిలించుకున్నాడు నీలకంఠంగారు.' అనుకున్నావాళ్లుకూడ లేకపోలేదు.

కాని జరిగింది అదికాదు–వర్కర్లే పరిస్థితి అర్థం చేసుకున్నారు–ఇది అడగండి అది అడగండి అంటూ తమకి పురికొల్పి చివరికి స్వలాభం చూసుకునే మధ్యవర్తుల అసలు రంగు వాళ్లు గుర్తించగలిగారు–తమ పొరపాటు తెలుసుకుని ఎప్పటిలా పనిలోకి రావటానికీ ఒప్పుకున్నారు అది నీలకంఠంగారి ఋజువర్తనకి ఒక తార్కాణమే–అయితే అది ఆధారంగా తీసుకుని ఆయన పనివారిమీద ఎలాంటి అలుసు ప్రదర్శించలేదు–

తాను సాధించిన ఘన విజయాన్ని నలుగురికీ గొప్పగా చెప్పుకోవాలని కాకపోయినా అసలు పరిస్థితిని నలుగురి దృష్టిలోకి తీసుకురావాలనీ, పదిమందితోనూ ఓ రోజు సరదాగా గడపాలనీ ఆయనకి అనిపించింది–అందుకే ఏర్పాటుచేశారు ఆ పార్టీ–

పెద్దలు మాట్లాడటం అయ్యాక నీలకంఠంగారు లేచారు–తమ ఆసనాన్ని అందుకుని వచ్చి, అమూల్యమైన వాళ్ళ కాలంలో కొంత తనకోసం వినియోగించిన పెద్దలందరికీ పేరు పేరునా కృతజ్ఞత తెలుపుకున్నారు — తన ఫ్యాక్టరీ ఈనాడు ఈ స్థితిలో వుండటానికి తన పెట్టుబడి ఒక్కటె కారణం కాదని ఫ్యాక్టరీ వర్కర్లు ఆఫీసు సిబ్బంది ప్రముఖ వ్యాపారసంస్థలు అందరికీ ఇందులో భాగం వుందని, తనతో అన్నివిధాల సహకరిస్తూ ఇంత సంతృప్తికరంగా పని సాగటానికి తోడ్పడుతున్న ప్రతి ఒక్కరికీ కృతజ్ఞత తెలుపుకోవటం తన బాధ్యత అని అన్నారు.

ఏ పరిశ్రమ అభివృద్ధి చెందాలన్నా ప్రభుత్వమూ, లేబరు యూనియన్లూ ఎలాంటి ఆంక్షలు విధించకుండా సహకరించాలనీ, ఇందులో ఏ లాంటి రాజకీయపు ఎత్తులకిగాని, స్వలాభంకోసం వర్కర్లని పావులుగా వుపయోగించుకుంటూ సమ్మె చెయ్యండి, యజమానుని ఘెరావ్ చెయ్యండి అని పురిగొల్పే మధ్యవర్తుల జోక్యంగాని వుండకూడదనీ తన అభిప్రాయం వెల్లడించారు–అదృష్టవశాత్తూ ఇంతవరకూ తను అలాంటి ఇబ్బందులను ఎదుర్కోలేదనీ–ఇకముందుకూడ ఇదే విధమైన సహకారం తనకి లభించాలనీ ఆశాభావం వ్యక్తం చేశారు–ఆయన మాటలలో వేరే అర్థాలు స్ఫురించిన కొంతమంది నవ్వుకున్నారు — కొంతమంది ఏమీ చెయ్యలేక పైకి నవ్వేసి లోపల పళ్లు నూరుకున్నారు —ఇష్టం వున్నా లేకపోయినా పదిమందితో పాటు చప్పట్లుకొట్టారు—పార్టీ ముగిసింది!

(ఇంకా వుంది)



# వారఫలం

**6-9-1968 శుక్రవారం మొదలు**
**12-9-1968 గురువారం వరకు**

**మేషం :** వృత్తి వ్యాపారాల్లో, మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు ఏర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. పోటి వారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**వృషభం :** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులన కల్సుకొంటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. వారం ఆఖరులో అనుకోని చికాకులకు గురి కాగలరు. ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**మిధునం :** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. విద్యా, వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం :** కొన్ని వ్యవహారాల్లో మీరు శ్రమ పడినా ప్రయోజనం ఉండదు. వృత్తిలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి ఏర్పడుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం :** భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు ఏర్పడతాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కన్య :** కొన్ని వ్యవహారాలు సులువుగా నెరవేరినా, మరికొన్నింటిలో శ్రమ కలుగుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

**తుల :** మీకు ముముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

**వృశ్చికం :** కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలదు.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు సామాన్యంగా ఉంటాయి. దైవ కార్యాలు నెరవేరుతాయి.

**ధనుస్సు :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభించగలవు. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**మకరం :** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కుంభం :** మీ చాకచక్యమే అన్ని వ్యవహారాల్లోను అనుకూలతను సాధించగలదు. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. కోర్టు వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మీనం :** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకుంటాయి. వ్యాపారంలో శ్రమ కలుగుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవ కార్యాలు నెరవేరుతాయి.

— మహేష్



## ఆశ్రయం

నాటకం




చాలా అర్జెంటు విషయాలు, గోప్యవిషయాలు ఎందరెందరితోనో మాటాడవలసి వుంటుంది. నా అవసరం ఎంతో మంది పెద్దలకి కావల్సి వుంటుంది. కొందరు స్వయంగా కలుసుకుని మాటాడుతారు. కొందరేమో ఫోనెత్తి పిలుస్తారు. ఫోన్‌లకి గొంతు చించుకువలసిన అవసరం నాకేంలేదు. కనీసం ఆ సమయాల్లోనైనా నీ గొంతు నొక్కి కూచుంటే, నా గొంతుకి శ్రమ తప్పుతుంది అని చెబుతున్నాను. అర్థమవుతుందా ?

సీత: (మెల్లిగా నవ్వి అన్నది) మీ దయవల్ల నా చెవులింకా పని చేస్తూనే వున్నాయి.

చక్ర: (హేళనగా అన్నాడు) ఆహా.... అల్లాగా. మరి ఎవడి దయవల్ల ఆకళ్లు పనిచెయ్యడం మానుకున్నాయో చెప్పగలవా సీతా!

సీత: అది నా ఖర్మ. కాని పాణిగారూ! నేను అంధురాలినైనా, ఈ చీకటిలోనే నాకోసం వో సుందర దృశ్యాన్ని ఎన్నో వీళ్ల కృషితో కట్టుకుని, దాన్నిచూస్తో మురిసిపోతున్నాను. అప్పుడు నా ఆవేశం పాటగానూ, నా ఆనందం లయగానూ మారి నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తాయి. అస్తమానం నాకా దృశ్యం కనిపించదు. అస్తమానం నేను పాడుకోలేను. దేవుడనుగ్రహించిన క్షణాన్ని వరప్రసాదంగా భావించి పరవశిస్తాను. సరిగ్గా—సరిగ్గా అప్పుడే మీరు నా నోరుమూయించే అధికారాన్ని నాకు గుర్తు చేస్తున్నారు.

చక్ర: భేష్.... అయితే ఒక పని చేద్దాం. దేవుణ్ణి పిలిపించి ఎగ్రిమెంటు రాసుకుందాం. 'రేయ్ దేవుడూ! నువ్వు వేళాపాళా లేకుండా మా దంపతులమధ్య కలతలు పెట్టకు. నేను బిజీగా వున్నప్పుడు మా శ్రీమతికి 'అద్భుతక్షణాన్ని' ప్రసాదించి నన్ను చీకాకుపరిస్తే మర్యాదదక్కదు గనక—నేనింట్లో లేనప్పుడు మాత్రమే సీత పాటని పర్మిట్ చేయి ఆవటా'ని ఒక ఒప్పందానికొచ్చేస్తే ఈ పీడా విరుగడవుతుం దేమో?

సీత: ఏమండి.

చక్ర: చెప్పండి.

సీత: నా పాట మీకిష్టంలేదా?

చక్ర: నీపాటేకాదు ఏపాటైనాసరే— ఐ డోంట్ లైక్. పాటలు పాడుకుంటూ కూచుంటే జీవితాని కక్కరిగే లాభమేవిటి? ఆ పాట డబ్బునిస్తుందా, కూడుపెడుతుందా? సీతా, నేను కళాకారుణ్నికాను. కళ, కళంటూ వీధులుపట్టుకు తిరిగేంత తీరుబడీలేదు. నేను ఎదిగే మనిషిని. నాక్కావలసినవి చాలా వున్నాయి. కళని చెప్పి తిరిగే కళాకారులందర్నీ పీకపిసికి చంపాలని వుంటుందినాకు. ఐ హేట్ దెమ్. కళపేరుతో బాగుపడే మార్గాలు వెతికే పెద్దల్నే లైక్ చేస్తాను. వాళ్లే నా దృష్టిలో నిజమైన కళామూర్తులు. ఏ విద్యైనాసరే, అది మనిషిని వున్న పళంగా పెంచి వుద్ధరించాల్సిందే తప్ప, ఇబ్బంది కలిగించకూడదు. అఫ్‌కోర్స్— మువ్వు నీటుగానే పాడొచ్చు. నీ వెనుక అటు మావగారుగానీ, ఇటు నే న్నీభర్తనుగానీ లేకుండా మవ్వొక్కర్తవీ

(గత సంచిక తరువాయి,

రెండవ భాగం

( ఇది రెండేళ్ళ తర్వాత జరిగిన కథ. అదే మేడ. అలంకరణలో హోదా పెరిగింది.చెన్నకేశవులుమంత్రి అయ్యేడు. ఆ మేడలో చక్రపాణి సోఫాలో కాళ్లు చాపి ఫోనులో ఎవర్నో 'వింటున్నాడు'. వెనుక గదిలో సీత పాడుకోడం మూలంగా స్పష్టంగా వినలేకపోతున్నాడు. విసుగ్గా గదిలోకి తొంగిచూచేడు.)

నీ రూపులో చూపు
ఆ చూపులో తూపు
నాటుకొనె నీ వేళ
నవనీత హృదయాల ॥వచ్చి॥

చక్ర: (ఫోను హౌత్‌పీస్ మీద చేతినుంచి గట్టిగా అరిచేడు) నాన్‌సెన్స్! ఏవిటా పాటకచేరి! కాసేపు నోరుమూసుకో. పెద్ద మనుషుల్తో మాటాడుతున్నాను.(పాటఆగిపోయింది.) ఏంసార్! ఏవిటంటారు?.... పాటా? అవునండి మా ఆవిడే! చక్కగా పాడుతుందిలేండి. ఐ జస్ట్ లైక్ హార్‌సాంగ్స్..... మీకూ బాగుందా?.. తేంక్యూ.. ఆదిసరె.... ఇక చెప్పండి..... మీ పర్మిట్‌కి ఒచ్చిన బెంగేమీ లేదు. కాకపోతే, మావయ్యకొంచెం బిజీగా వున్నాడు. ఇవాళరావాలి. రాగానే నేను అన్నిసంగతులూ మాటాడుతాను. రైట్....(ఫోన్ పెట్టేడు) రాస్కెల్! పాట బాగుందిట. పాట. (లేచి నించుని నూటు సర్దుకున్నాడు.) ఈగుడ్డిమొహం చూసేడుకాడు, నా మొహమ్మీదనే ఏడ్చి వెళ్ళిపోగలడు. వెధవ'టేస్టూ వీడూను.సీతా!

( సీత ఒచ్చింది )

చక్ర: ఏవిటి విశేషం? ఉదయమే పాటందుకున్నావు?

సీత: పాట పాడేందుక్కూడా నాకిక్కడ అధికారం లేదా?

చక్ర: నోర్ముయ్, నాకెదురు చెప్పడం గూడాను.

సీత: సాధారణంగా నేను నోరుమూసుకునే వుంటున్నాను. ఎప్పుడోగాని గొంతుపలకదు. అప్పుడు క్షమించండి. పాడుకోడం మానుకోలేను.

చక్ర: పాడొద్దని ఎవడన్నాడు? పాడుకోవోయ్. నిక్షేపంగా పాడుకో. అవుతే, నీ పాట మూలంగా ఇక్కడ నా పనులు చెడిపోకూడదంటాను. ఈ ఇంటో ఫోనున్న సంగతి మరిచిపోతే ఎలా? నేను

ఆ పాటల్తో బాగుపడగలవా?

సీత: బాగుపడటమంటే మీా ఉద్దేశం?

చక్ర: బాగుపడడమన్నా, ఎదిగిపోవడమన్నా, పెరిగిపోవడమన్నా, మేసేయడమన్నా, అవతలి వాడి మెప్పు పొందడమన్నా— ఈ ఎట్సెట్రా బాపతంతా నా దృష్టిలో ఒక్కటే. డబ్బు! నేనే ఉద్దేశంతో మాటాడినా డబ్బే ప్రధానం.

సీత: కొందరు డబ్బుని ప్రేమిస్తారు. కొందరు డబ్బుని ద్వేషిస్తారు.

చక్ర. ఫూల్స్. ఫూల్స్ సీతా డబ్బుని ద్వేషించేది.

సీత: మీ దృష్టిలోవాళ్లు ఫూల్సేనేమో! కానీ, మీరంటూన్న డబ్బులో సుఖంలేదు పాణిగారూ!

చక్ర: నేన్నమ్మను.

సీత: ఉదాహరణకి నన్నే తీసుకోండి. నేను డబ్బులేని మనిషికి పుట్టివుంటే నా బతుక్కి ఒక అర్థం వుండేది. డబ్బున్న ఇంట్లోపుట్టి నాన్నచేతా, మీచేతా నేను నాకిష్టంలేని చాలా విడ్డూరాలు వింటున్నాను. అప్పుడు నా మనస్సెంత అల్లల్లాడిపోతుంటుందో మీరెవరైనా గ్రహించేరా?

చక్ర: ప్లేటు మార్చడంలో సీతా నీకు నువ్వేసాటి. వెరీగుడ్.... మీనాన్న ఎన్నికలో! నేనుసాయపడ్డాను గనుకనే ఆయనిప్పుడు మంత్రిగారయ్యేరవునా? ఇంత హెల్ప్ చేసేను గనుక నువ్వునాకు భార్యవయ్యేవు. అదీ కరెక్టేగా. నీ జాతకమనే రూపాయి బిళ్లకిది బొమ్మ! బొరుసు చెపుతాను విను. తాడూ బొంగరంలేని ఆ సత్యంగాడు మీనాన్నకేవిధంగానూ ఉపయోగించలేకపోగా, ఆయన కోపాగ్నికి మలమలమాడి చచ్చేవాడు. నువ్వు వాడిని పెళ్లిచేసుకుని ఈ మేడకి దూరంగా ఎక్కడో ఒకచిన్న పాకలో నీ జీవితం వెళ్లబోసుకునేదానివి. ఆకల్తో చావకపోయినా,వాడు తెచ్చే ముష్టి వందరూపాయలు— మీనాన్న మెళ్లోపడే దండ ఖరీదు— దాంతో బతకడమెలాగో తెలీక, పేదపాటలు పాడుకుంటో ఎన్నాళ్లు బతికేవారు? ఈలోగా, వాడు ఆ సత్యంగాడు నీతో విసిగిపోయి నిన్నొదిలిపెట్టి ఏ టైపిస్టునో, నర్సునో లేవదీసుకుపోయి—

సీత: ఆపండి. బావని అవమానించకండి. అతను మీరనుకున్నంత నీచుడుకాడు. బావ సంగతి నాకు తెలుసు. అతను అమాయకుడు. అతనిలో కల్మషంలేదు. అతని మనసులో యిన్ని భయంకరమైన సుడిగుండాలు లేవు. మీకు తెలుసో తెలిదో —అతను నా మూలంగానే పెళ్లి చేసుకోడం మానుకున్నాడు.

చక్ర: వాడి గురించి ఇంతనీటుగా చెబుతున్నావు, వాడితో లేచి పోతావా ఏవిటీ?

సీత: ఛీ!.... ఆ మాటనేందుకు మీనోరెలా ఒచ్చింది? మీమనసెలా ఒప్పింది?

చక్ర: మరేంలేదు. చాలామంది పిరికి సన్నాసులు మనసులో పెళ్లాలమీద అనుమానం పెంచుకుని బాధపడతాతారు. మన సంగతలాకాదు. డైరెక్ట్ ఎటాక్. నాకు అనుమానం కలగదు. కలిగితే 'ఏవిటీ కథా?' అని అడిగేస్తానే తప్ప దాచుకుని కుమిలిపోడం నాకిష్టంలేదు. నిన్ను నిర్లక్ష్యం చేస్తున్నానని నువ్వెన్నోసార్లు అన్నావు. నిజవే.... ఐ డోంట్ లైక్ యూ! పెళ్లంటావా? అది తప్పనిసరై పోయింది. అంతమాత్రాన అగ్నిసాక్షిగా జరిగిన పెళ్లికి కట్టుబడి మనసుల్ని మోసం చేసుకోడం మహాపాపం! అందుకోసం, మన థియరీ ప్రత్యేకంగా వుంది. సంఘ కట్టుబాట్లకి పూర్తిగా లొంగిపోయేవో సోదిక్కూడా రావు. గనక లొంగినట్టు నటించు. నీ మనస్సుకి ఏం తోస్తే అదిచెయ్యి. ఫినిష్. నీతి, ధర్మం, వగైరాలన్నీ పనికిరాని మాటలు. అందుచేత ఫర్లేదు సీతా, సత్యం మనింటికి ఒస్తూనే వున్నాడుగా— నాకేం అభ్యంతరం లేదు.

సీత: ఏవండీ.... నేను వినలేను. చెప్పకండి. మీ థియరీలతో నాకు అసహ్యం కలిగించకండి. నన్ను బతకనివ్వండిలా. (క్షణమాగి అన్నది) నేనింకేమీ వినలేను.

(చక్రపాణి చాలా వికృతంగా నవ్వి, ఆనవ్వునో చోట ఆపి అన్నాడు).

చక్ర: అన్న, తమ్ముడూ, అక్కా, చెల్లెల్లూ, చివరికి కట్టుకున్న భార్యా ఎవరైనా ఫర్లేదు— నేను బాగుపడేందుకు వాళ్లేవిధంగా ఉపకరించినా సంతోషిస్తాను. నేన్నిజవే చెబుతున్నాను సీతా! నేను రవుడీనికాను. బతకనేర్చిన మనిషిని. ఇనాళ నానోటినుంచి ఈ నిజం విని నువ్వు కుమిలిపోతే చెప్పలేను గానీ, ఒక విధంగా మీనాన్న నాజాతివాడే. అందికే, మీనాన్నకి అల్లుడినయ్యేను. మా జాతి పెద్దలనేకమంది బయటవున్నారు. యుగధర్మం తెలీని గుడ్డిపక్షివి నువ్వు. నీవల్ల నాకొక్కటే లాభం— మావ పరపతిని పంచుకోడం. నీకళ్లు గూడా నిక్షేపంగా వుంటే (నవ్వేడు. చెవులు మూసుకుంది సీత) చెప్పన్లే. కానీ చూసేవ్, నేనేం స్వార్థపరుడినిగాను. నీ ప్రేమని సత్యానికి పంచివ్వమని ఎందుకు చెబుతున్నానో తెలుసా? ఆరకంగానైనా నువ్వు మానసికంగా కుదుటబడతావని.

సీత: మీకు ఆత్మాభిమానం లేదు. నైతికంగా మీరు చచ్చి పోయేరు.

చక్ర: రెండుముక్కల్లో నా గురించి చాలా కరెక్ట్‌గా చెప్పేవ్, కానిపిల్లా! ఈ విద్యలో నన్నుమించిన గురువులనేకమంది బయటెంతో విలాసంగా,నిశ్చింతంగా బతుకుతున్నారు. వాళ్లందరి మాటేవిటి

**డాక్టర్ కబుర్లు**

[illegible]

వంశంలో మరెవరికీ అతి మూత్రవ్యాధి లేకపోయినా కొందరికి రావటానికి కారణం ఏమిటి?

కొందరికి ఈరోగం వచ్చే స్వభావం ఉంటుంది. వాళ్లలో వ్యాధి కనిపించకపోవచ్చు కాని వారి దేహాలలో వ్యాధివచ్చే ధోరణి ఉంటుంది. ఈధోరణి వంశ పారంపర్యంగా రావచ్చు.

మరొకవింత ఏమిటంటే కొందరి వంశంలో రెండు తరాలుగా అతి మూత్రవ్యాధి ఉండవచ్చు. వారు తగిన చికిత్స పొందక (రోగనిర్ణయం తప్పుకావటంచేత) వారివంశంలో అతి మూత్రవ్యాధి లేదనుకొనవచ్చు.

ఇంతేకాక, వ్యాధి లోపల అణిగి మణిగి ఎన్నో రోజుల తర్వాత బయటపడవచ్చు. దీనికి చిహ్నాలు: విపరీతమయిన దాహం, తరచు మూత్ర విసర్జన, దురదలు తీపికోసం తహతహ, బలహీనత, తేలికగా జబ్బుపడటం వదలని బడలిక.

ఒక పెద్దమనిషిని ఎవరో అడిగారుట, 'పిచ్చి తల్లి దండ్రుల నుంచి సంక్రమిస్తుందా?' అని.

'పిల్లల దగ్గరనుంచీ రావచ్చు,



నన్నాడుట ఆయన. తమ పిల్లలకి అతి మూత్యవ్యాధి ఉందని తెలిసిన తర్వాతనే ఎందరో తామూ తగిన పరీక్ష చేయించుకుంటారు.

హెచ్. ఎల్. హెర్షెన్‌సోన్
(కాపీరయిటు)

## లిట్ క్విజ్ నెం. 38—18 క్లూలు

1. నిజంగా, అసందర్భత్వం/ఉన్మాదం అప్పుడప్పుడు సంభవించుట బుద్ధిమంతులైన వ్యక్తులకు చిహ్నమైన యెడల అట్టి ఆదర గౌరవాల పాశించేవారు అరుదుకాదు.

2. మన అభిలాషలు/భావనలు మన జీవనాలను నడిపే గొప్ప శక్తిని కలిగిస్తాయి.

3. ధర్మములు పలు స్వరాలలో ప్రసంగించవచ్చు, పలు ముఖ వైఖరులను దాల్చవచ్చు, పలుభిన్న భాషలలో ప్రసంగించవచ్చు, కాని వాటి ఒక్కటే ప్రామాణిక స్వరం దయా—భావం/అంతరాత్మిక స్వరం అయివున్నది.

4. భారతీయ బజార్లు ధరల హెచ్చు—తగ్గుల సందర్భంలో చాల సహకారి/చంచలం అయివున్నవి.

5. ఒక మానవుడు జీవితమును ఎట్లు గడిపెనో! మీరు తెలిసికొనగోరే యెడల అతడు ఎట్లు మరణించునో/వస్త్రధారణ మొనర్చునో వీక్షించుట సర్వదా అవసరం.

6. ఒకవస్తువు యొక్క స్వత్వం / అస్తిత్వం, స్వయం ఆ వస్తువుతో భిన్నంకాదు.

7. శిక్షణ వ్యక్తియొక్క మనస్సము / వ్యక్తిత్వమును అతనిని సామాజికం గాను మరియు ఆధ్యాత్మికంగాకూడ వికసింపజేయునట్లు వృద్ధిపొందుంచుతుంది.

8. ఏ భాషలోనైనా అభిప్రాయము యొక్క మధురార్థములను ప్రకటించుటలో విశ్వాసపాత్రత/వశ్యత మరియు శైలియొక్క శుద్ధత నిదానంగా వృద్ధియగును.

9. నిజంగా మానవుడు ఎంత ఎక్కువగా పొందియుంటాడో / వాంఛించుతాడో అతడుఅంత ఎక్కువగా భిక్షకుడవుతాడు.

10. ఇతిహాసం / సమాజం మరియు సభ్యత, మానవ మనోబాహుళ్యతా నిరూపణలు.

11. ఎవరి హృదయం శూన్యం మరియు ఆశా/ప్రేమ రహితమై యుండునో ఆవ్యక్తి ఒక్క క్షణమాత్రమైనా జీవింపజాలరు.

12. కేవలం మానవ / వినమ్ర జీవిగా మనం ఈశ్వరుని అన్వేషింపగలం మరియు, ఆయనలో విలీనమైపోవ యత్నింపగలం.

13. మన శిక్షణలో ఆదర్శవాద/యదార్థవాద మందు ఇంకనూ లోపము గలదు.

14. ప్రకృతి మన ప్రేరణ / మనోరంజనకు శాశ్వత చెలమయై వున్నది.

15. మొదలంట ఉపేక్షింపబడే పక్షంలోస్వతంత్రత/నైతికత రాజనీతిజ్ఞ జీవనమందు అత్యుచ్చ మేరలయందు నిలిపియుంచబడజాలదు.

16. స్థిరపరచబడిన దరలు బజార్లకు/లాభములకు గ్యారంటీ భావమును సమకూర్చును.

17. భారతదేశంలో మనం పేదరికము / స్థిరత్వమును స్వాభావికంగా తలంపజాలుము.

18 ~~~~జమైనా అది ఎంత సభ్యతగలైనదిగా వున్నను ఏ దేశమైనా అది ఎంత బాగుగా సుసంగటిత పరచబడినదైయున్నను వ్యవస్థ/ధర్మం లేనిదే వర్ధిల్లి నేరదు.

## No. 38: 18 CLUES

1. Indeed, if **Absurdity Insanity** is sometimes the hallmark of genious, the claimants for the honour are not so rare.

2. Our **Ambitions Emotions** constitute the great driving power of our lives.

3 Religions may speak with many voices, may wear many faces may speak in many dialects, but their one authentic voice is the voice of **Compassion / Conscience.**

4. The Indian market is very **Conducive / Sensitive** to the movement of prices

5. If you want to know how a man has lived it is always necessary to see how he **Dies / Dresses!**

6. The **Essence / Existence** of a thing is inseparable from the thing itself.

7. Education aims at so moulding the **Faculty / Personality** of the individual as to develop him socially as well as spiritually.

8. **Fidelity / Flexibility** in the expression of fine shades of meaning and precision of expression are matters of slow growth in a language

9. Really the more a man **Gets / Wants**, the more he is a beggar

10. **History / Society** and civilization are the mind of man writ large.

11. Nobody can live for a moment if his heart is blank and devoid of **Hope / Love.**

12. It is only as a **Human / Humble** being that we can seek God and try to unite with Him.

13. Want of **Idealism / Realism** still clings to our education

14. Nature is our perennial fountain of **Inspiration / Recreation.**

15. **Liberty / Morality** cannot be preserved at high levels of political life when it is ignored at the bottom.

16. Stabilised prices imply guaranteed **Markets / Profits.**

17. We, in India, have tended to take **Poverty / stability** for granted.

18. No society however civilised it may be, no State how-ever well organised it may be can do without **Regulation / Religion.**

**గమనిక:** పై క్లూలు భారతీయ గ్రంథకర్తల పుస్తకములనుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు, వాటి పుస్తకముల పేర్లు, అఫీషియల్ సొల్యూషన్‌తోపాటు లిట్ క్విజ్ వీక్లీలో ప్రచురించబడును.

## ఆశ్రయం

నలినా: నీ దగ్గరేమైనా అద్భుతశక్తులుంటే మమ్మల్ని శపించి పారేయ్. వెధవలం నల్లుల్లా మాడి చస్తాం. శపించగలవా?

సీత: అన్నింటికీ ఆభగవంతుడే వున్నాడు.

(కారుశబ్దం వినిపించింది)

చక్ర తప్పుకో. మామగారొచ్చినట్టున్నారు. ఇక మాటాడకు, బాగా అలిసిపోయివుంటారేమో ఆయనకి చక్కటి విశ్రాంతి అవసరం. (మాటాడుతూనే బీరువా దగ్గరికి వెళ్లి దాంట్లో వున్న బ్రాందీసీసా తీసేడు) నన్ను విసిగించినట్టు ఆయన్ని విసిగిస్తే ప్రయోజనం సున్నా. మామగారికి మందివ్వాలి. అతికష్టమ్మీద నేర్చుకున్నారు పాపం! వందమైళ్లదూరం నుంచి కార్లో ప్రయాణం. ఒళ్లునొప్పులు తప్పవు. మంత్రి పదవి మజా కాదు.

(ముందుగా రామదాసు ఒచ్చేడు)

చక్ర: భేష్.... అనుకున్నట్టు మందుతో రెడీగా వున్నావు. ఎంతైనా తెలివిగలవాడివి.

చక్ర. పారం ఆపు. మామగారు......

(చెన్నకేశవులు మెరిసిపోతూ వొచ్చేడు. అలా చేతిమీద పూలదండ ఖరీదులోనూ, అందంలోనూ చెప్పతగ్గది )

చెన్న: దాసూ!

దాసు: సార్!

చెన్న: ఇవాళ నేనెక్కడికి రాలేనోయ్! (దండని అవతలగా విసిరేడు. వొచ్చి సోఫాలో కూచున్నాడు) అవునయ్యాదాసూ! ఇంతకీ వాడేవంటాడు? ధరలనీ అందుబాటులో లేవంటాడు, అంతే గదూ.

దాసు. అవున్సార్!

చెన్న. వానికి నేనేం చెప్పేనో గుర్తులేదు దాసూ! ఇవాళ పేపరు చదివి చెప్పు. వాడు అడిగిందానికీ, మనం చెప్పిందానికీ—ఏవిటీ—అంతే. అదంతా సరిపోయిందో లేదో చూడు దాసూ!

దాసు: మరి సింహాచలంగారి వ్యవహారం? అతనేమో శోభనాద్రి గారికి కావలసిన వాడు.

చెన్న: అవునయ్యోవ్ దాసూ! గుర్తుంచుకో. వాడి బాసెవడూ? రాజులు గదూ, సాయింత్రం గుర్తు చెయ్యి, ఫోన్ చేద్దాం. ప్రమోషనేగా?

దాసు: లిటిగేషను గూడా వుందండి. సింహాచలం కంటే అవతల వాడెవడో సీనియరుట. దావాలు కోర్టులూ అని ఒకటే హడావిడట.

చెన్న: దాసూ! దావాల గురించిన నాకుటయ్యా చెబుతావ్. అవతల వాడికి ప్రమోషన్నిచ్చి అడవుల్లోపారేసి, ఎవడువీడూ, పేరేమిటున్నారు, సింహాచలం గదూ, కొత్త పోస్టు ఒకటేసి దాంట్లో యిరికించేస్తే సరిపోలా?

దాసు: సరిపోతుంది సార్! కానీ.....

చెన్న: దాసూ! నువ్వూ మందలో చేరేవేమిటయ్యా! ఇవన్నీ మన వ్యవహారాలు.

(చక్రపాణి బ్రాందీసీసా, గ్లాసులూ సర్ది టీపాయ్ మీదవుంచేడు. చెన్నకేశవులు నవ్వుతూ పుచు

**15** భాషలు **110** ఏజెంట్లు **190** పత్రికలలో ప్రకటనలు



గమనిక :

(1) లిట్ క్విజ్ నెం. 35 లో మొదటి బహుమతి విజేతలకు చెక్కులు పంపబడినవి.

(2) ఈసారి గుజరాత్ ముఖ్యమంత్రి ఫడ్ రిలీఫ్ ఫండ్‌కు రు. 1000/- లకు చెక్కు పంపబడినది.

(3) లిట్ క్విజ్ నెం. 35 లో విజేతలందరికీ వెండి స్పూన్, ట్రాన్సిస్టర్లతో సహా అన్ని బహుమతులు పంపబడినవి.

లిట్ క్విజ్ నెం. 38 అధికార ఎంట్రీ ఫారము

ఆఖరు ముగింపు తేదీ 11-9-68 బుధవారం

ADDRESS: LITQUIZ No. 38, ALANKAR, BALARAM STREET, BOMBAY-7. (W B)

గమనిక : (1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. (2) ఒక కూపన్‌మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టి వేయండి. (3) ఎంట్రీరుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M.O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M O రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. (4) I. P. O. క్రాస్ చేయవద్దు. అది లిట్ క్విజ్ నెం. 38, బొంబాయి-7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| Re. 1 | | 1 |
|---|---|---|
| 1 | ABSURDITY | INSANITY |
| 2 | AMBITIONS | EMOTIONS |
| 3 | COMPASSION | CONSCIENCE |
| 4 | CONDUCIVE | SENSITIVE |
| 5 | DIES | DRESSES |
| 6 | ESSENCE | EXISTENCE |
| 7 | FACULTY | PERSONALITY |
| 8 | FIDELITY | FLEXIBILITY |
| 9 | GETS | WANTS |
| 10 | HISTORY | SOCIETY |
| 11 | HOPE | LOVE |
| 12 | HUMAN | HUMBLE |
| 13 | IDEALISM | REALISM |
| 14 | INSPIRATION | RECREATION |
| 15 | LIBERTY | MORALITY |
| 16 | MARKETS | PROFITS |
| 17 | POVERTY | STABILITY |
| 18 | REGULATION | RELIGION |

| Re. 1 | | 2 |
|---|---|---|
| 1 | ABSURDITY | INSANITY |
| 2 | AMBITIONS | EMOTIONS |
| 3 | COMPASSION | CONSCIENCE |
| 4 | CONDUCIVE | SENSITIVE |
| 5 | DIES | DRESSES |
| 6 | ESSENCE | EXISTENCE |
| 7 | FACULTY | PERSONALITY |
| 8 | FIDELITY | FLEXIBILITY |
| 9 | GETS | WANTS |
| 10 | HISTORY | SOCIETY |
| 11 | HOPE | LOVE |
| 12 | HUMAN | HUMBLE |
| 13 | IDEALISM | REALISM |
| 14 | INSPIRATION | RECREATION |
| 15 | LIBERTY | MORALITY |
| 16 | MARKETS | PROFITS |
| 17 | POVERTY | STABILITY |
| 18 | REGULATION | RELIGION |

SEND FIRST TWO COUPONS & ENTER MiNiQuiZ (A) FREE

| Re. 1 | | 3 |
|---|---|---|
| 1 | ABSURDITY | INSANITY |
| 2 | AMBITIONS | EMOTIONS |
| 3 | COMPASSION | CONSCIENCE |
| 4 | CONDUCIVE | SENSITIVE |
| 5 | DIES | DRESSES |
| 6 | ESSENCE | EXISTENCE |
| 7 | FACULTY | PERSONALITY |
| 8 | FIDELITY | FLEXIBILITY |
| 9 | GETS | WANTS |
| 10 | HISTORY | SOCIETY |
| 11 | HOPE | LOVE |
| 12 | HUMAN | HUMBLE |
| 13 | IDEALISM | REALISM |
| 14 | INSPIRATION | RECREATION |
| 15 | LIBERTY | MORALITY |
| 16 | MARKETS | PROFITS |
| 17 | POVERTY | STABILITY |
| 18 | REGULATION | RELIGION |

| Re. 1 | | 4 |
|---|---|---|
| 1 | ABSURDITY | INSANITY |
| 2 | AMBITIONS | EMOTIONS |
| 3 | COMPASSION | CONSCIENCE |
| 4 | CONDUCIVE | SENSITIVE |
| 5 | DIES | DRESSES |
| 6 | ESSENCE | EXISTENCE |
| 7 | FACULTY | PERSONALITY |
| 8 | FIDELITY | FLEXIBILITY |
| 9 | GETS | WANTS |
| 10 | HISTORY | SOCIETY |
| 11 | HOPE | LOVE |
| 12 | HUMAN | HUMBLE |
| 13 | IDEALISM | REALISM |
| 14 | INSPIRATION | RECREATION |
| 15 | LIBERTY | MORALITY |
| 16 | MARKETS | PROFITS |
| 17 | POVERTY | STABILITY |
| 18 | REGULATION | RELIGION |

SEND FOUR COUPONS & ENTER BOTH MiNiQuiZ (A & B) FREE

No. 38

**MiniQuiZ (A)** — 6 CLUES FREE COUPON

| | |
|---|---|
| ABSURDITY | INSANITY |
| AMBITIONS | EMOTIONS |
| COMPASSION | CONSCIENCE |
| CONDUCIVE | SENSITIVE |
| DIES | DRESSES |
| ESSENCE | EXISTENCE |

**MiniQuiZ (B)** — 12 CLUES FREE COUPON

| | | | |
|---|---|---|---|
| FACULTY | PERSONALITY | IDEALISM | REALISM |
| FIDELITY | FLEXIBILITY | INSPIRATION | RECREATION |
| GETS | WANTS | LIBERTY | MORALITY |
| HISTORY | SOCIETY | MARKETS | PROFITS |
| HOPE | LOVE | POVERTY | STABILITY |
| HUMAN | HUMBLE | REGULATION | RELIGION |

**38** (ASVP)

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరు గారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/-. ఈ పూర్తి ఎంట్రీ ఫారము (4 కూపనులకు) ఫీజు రు. 4/-. M. O. రసీదు/I.P.O./లిట్ క్విజ్ క్యాష్ రసీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం.............

CAPITAL LETTERS

NAME ..........................................................................

ADDRESS ..........................................................................

..........................................................................

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను

లిట్ క్విజ్ నెం. 36 నుండి రు. 20.000/- లను 6 మంది విజేతలకు పంపుతాం.

59 మంది విజేతలు ఒక్కొక్కరికి రూ. ...

* పోస్టాఫీసు కౌంటర్ పెండుటకు 10 పైసల స్టాంపు అంటించి కవరుపై పంపవలెను.

* లిట్ క్విజ్ ఫీజు 8 సంవత్సరాలు రు. 2/- పంపవలెను.

ఆఖరు ముగింపు తేదీ: 11—9—68.

పోస్టులో అందుకొనుటకు: 15-9-68

# ఆశ్రయాం

కున్నాడు.)

చెన్న: రెస్టు లేదోయ్ అల్లుడూ! దేశంలో అల్లరి చిల్లరి వాళ్లెక్కువై పోతున్నారు. ఏవిటి. మాకే పాఠాలు చెబుతున్నారు. కాలికేస్తే మెడకీ, మెడకేస్తే కాలికీను, నీళ్లు తాగించవతల పారేస్తున్నారు. నువ్వు మెడకీ కాలికీ వేయవు. నీదగ్గరుంటేనే రెస్టు. పైగా — వజాగా మందు తాగిస్తావ్. ఎంత మంచివాడివోయ్.

చక్ర: ఎక్కడ విషయాలక్కడే మరిచిపోవాలి మీరు, సభలూ, సన్మానాలూ తప్పవు మరి. ఇంటికొచ్చి గూడా వాటిని మరచిపోకపోతే ఎలా?

చెన్న: మరి నేనేం చేసేననుకున్నావ్? నాలుగు ముక్కలి ముక్కలు—దాసురాసినవి— చెప్పకపోతే బాగుండదనేగదా సభకి వెళ్లేను. అవతలేమో ఆసభ మనవాడే పెట్టేడు. బలేవాడివల్లుడూ. ఆ జాగ్రత్తలు నాకూ తెలుసు. అన్నట్టు దాసూ.... రేపు పదిహేనో తారీఖు.... గుర్తుందా? (దాసు తలూపేడు) అలా తలూపుతే గాదు. మంచి భాషలో ఆరేడు పేజీలు రాయి. రామాయణంలాగా వుండాలి. అక్కడ దంచి పారేస్తాను.

చక్ర: ఇందాక మీరొచ్చేముందు క్షీర సాగరంగారు ఫోన్‌చేశారు. పర్మిట్ విషయమై అడిగేరు.

చెన్న: నువ్వేం చెప్పావ్?

చక్ర: అయిపోయిందన్నాను.

చెన్న: మరి నన్నేం చెప్పమంటావ్? ఏమయ్యా దాసూ? ఏం చెప్పమంటావ్:?

దాసు: మీ యిష్టంసార్, చక్రపాణి అయిపోయిందన్నాడుగా?

చెన్న: సరె కానివ్వు, అల్లాగే అల్లుడూ.

(సీత కదిలి లోపలి గదిలోకి వెళ్ళబోతుండగా చెన్నకేశవులు ఆవేపు చూసేడు. బ్రాందీతో గొంతు తడుపుకుని అల్లుడి వేపు తిరిగి సంగతేమిటన్నట్లు. అతను మామూలే అన్నట్టు పెదవి విరిచేడు. కాసేపు జరిగిం తర్వాత చెన్నకేశవులే అడిగాడు).

చెన్న: వాడు మా వాడొచ్చేడా?

చక్ర: ఎవరు? సత్యమేనా?

చెన్న: సుబ్బారావు.

చక్ర: రాలేదు.

చెన్న: మరి వొస్తున్నట్టు ఉత్తరం రాసేడే? వాడికేమో ట్రాన్స్‌ఫర్ కావాలిట. మనిషిని కొరికి పారేస్తున్నాడు. నేనిక్కడేమైనా తీరుబడిగా కూర్చున్నానా? ఏవయ్యా దాసూ? ఏమిటంటావ్?

దాసు: అవున్సార్, చాలా హడావుడిగా వున్నాం.

చెన్న: వాడి ట్రాన్స్‌ఫర్ విషయమేమిటో నువ్వే చూడరాదటయ్యా? ఇంతచిన్న విషయాన్ని కూడా నా మీదికి నెట్టేస్తే ఎలా దాసు?

దాసు: అలాగేసార్.... ఇవాళే చూస్తాను.

చెన్న: (తాగుతూన్న గ్లాసు వేపూ, అల్లుడువేపూ చూచి అన్నాడు) ఏవిటోయ్ అల్లుడూ! మహ ఘాటుగావుంది. బ్రాండ్ మార్చేవా? ఏమైనా కలిపేవా? గాడిదమీద ఎక్కి కూచున్నట్టుంది. గాడిదంటే గుర్తుకొచ్చేడు, వల్లభరావు నియోజకవర్గంలో అల్లర్లవుతాయేవిటి దాసూ? ఈ దెబ్బతో మనవాడి జాతకం గోవిందేనా?

దాసు: అయిపోయిందిసార్! ఇక అట్నుంచి వొత్తిడి వుండదు.

చెన్న: (తలతిరుగుతున్నా తాగడం మానలేదు) ఏం విసురోయ్ దాసూ! తలతిరిగిపోతుందనుకో! నోరు మూయలేక పోతున్నాను. దవడలన్నీ గజగజా ఒణికిపోతున్నాయి. మొహం పొంగిపోయిందేమో చూడు. పొంగే వుంటుంది. మజాగా వుందోయ్ పాణి! రేపు మరో నాలుగు 'కాయలు' ఈ బ్రాండువే తెప్పించు. అబ్బబ్బ— దీందుంప తెగ మనిషిని మొత్తం వూపిపారేస్తుందనుకో. ఇండియా తయారీకాదేమిటీ? అద్గదీ అల్లా చెప్పు. ఒరేయ్ సన్నాసులూ.... మందంటే యిలా వుండాలి. దాసూ! నాకిప్పుడు సరదాగావుందోయ్. వెంటనే మీటింగోటి పెట్టి నన్ను పిలిచెయ్. నీపాఠం చదవకుండానే మాట్లాడి పారేస్తాను. ఒచ్చేనెలలో రచయితల మహాసభ కదూ. ఆరోజు కొంచెం పుచ్చుకుంటే దిగులుండదు. సోదరులారా!.... (ఆగిఅన్నాడు) పాణి! మంచి మందే సంపాయించేవోయ్. నీ కడుపుచల్లగా— రేపు మరచిపోకుండా మరికొన్ని పట్రా.

(సీత రావడం చూచి మాటలాపేడు. సీత తండ్రిని చాలా ఖచ్చితంగా అడిగేసింది).

సీత: కళ్ళు పోయి నేను అదృష్టవంతురాలినయ్యేను నాన్నా. ఇంత మనిషివీ ఎంత అల్పంగా మాటాడేవో గమనించేవా?

చెన్న: ఏమిటోయ్ పాణి! సీత అంటూంది. పేపర్లో రాయిస్తుందేమో కనుక్కో.. కొంచెం అదుపులో వుంచవయ్యా.. మన విషయాల్లో జోక్యం కల్పించుకోరాదని ఖచ్చితంగా చెప్పు.

సీత: మధ్య వారి కెందుకూ చెబుతావు? స్వయంగా నాతోనే చెప్పు నాన్నా. మరేం బాధ పడన్నేను. సింహాసనమ్మీద వున్నవాడివి. కనీసం ఆ ఆసనానికైనా గౌరవాన్ని తెచ్చిపెట్టు. నేను గర్విస్తాను.

చెన్న: ఏయ్ సీతా! ఏమిటి నీ అల్లరి. పో ముందిక్కడ్నుంచి. నా యిష్టమొచ్చినట్టు నేను చేసుకుంటాను. నువ్వెవర్తివి చెప్పేందుకు? శనివి దాపురించేవు. సుఖపడే మనిషిని మొత్తే మొద్దువి. నువ్వా నాకు నీతులు చెప్పేది?

సీత: (ఏడు పొచ్చింది) అవున్నాన్నా! నేను శనినే. ఈ శని విరగడైపోతే ఈ యింట్లో మీరంతా సుఖంగా వుండొచ్చు. నాన్నా..... నేను గుడ్డిదాన్ని. ఎవరో యింత పెడితే తింటూన్నదాన్ని. ఆ పెట్టేదాంట్లో చిటికెడు విషం చాలు నాన్నా. అంతా క్షణంలో పని. పీడా విరగడై పోతుంది. ఈ యింటికి పట్టిన శని నాతోనే మసైపోతుందనుకుంటే ఆ ప్రయత్నం తప్పకుండా చేయించు నాన్నా.

చెన్న: ఏమయ్యోయ్ పాణి! శృతి మించింది. శోకం నా కిష్టం లేదు. నే నూరుకోను. ముందా నోరు మూయించు. దాసూ! నా పక్కన మంచో...

వళ్ళు తూలుతోంది. డాన్స్ చేయిస్తుందేవి టోయ్. (దాసు చెన్నకేశవులి పక్కకొచ్చి) పాయం పట్టేడు. చెన్నకేశవులు మేడ మెట్లెక్కడం ప్రారంభించేడు) గుడ్డిదైనా, కూత ఘనంగా వుంది. ఏం చూచుకునో ఆ మిడిసిపాటు. మగవాడు అనేకం చేస్తాడు. ఆడది నోరు మూసు క్కూచోవాలి. రేపట్నుంచి ఈ యింట్లో ఎవరైనాసరే, నా మాట కెదురు చెబితే కాల్చి పారేస్తాను. దాసూ! గట్టిగా పట్టుకో. నువ్వూ తాగేవా? వూగిపోతున్నావ్. పాణీ! రేపు మందు విషయం గుర్తుంచుకో.

(మేడమీదికి వెళ్ళిపోయేడు చెన్నకేశవులు, దాసూను. చక్రపాణి సీసాలోది గ్లాసులో వంచుకున్నాడు. శబ్ద మయ్యింది. ఆ శబ్దాన్నిగ్రహించి అన్నది సీత )

సీత. మీరూ ప్రారంభిస్తున్నారా?

చక్ర: మరేం చేయను? తాగడమే ఒక సివిలిజేషన్ సీతా. అందునా మంత్రిగారి అల్లుడ్ని

సీత· ఆ మాట చెప్పుకోడానికి సిగ్గులేదూ?

చక్ర సిగ్గా (నవ్వేడు) ఎందుకు సిగ్గు? ఈ మంత్రిగారికి అల్లుడి నైనందుకా? నీకు మొగుడినైనందుకా? నేనేం సిగ్గుకి భయపడే మనిషిని కాదు సీతా! ఆ పప్పులు మందగ్గిర వుడకవు. సీతా— నీకో సూత్రం చెబుతాను విను.

సీత: నేను వినలేను.

చక్ర: (ఏదో అనబోయి ఆగేడు. చివరికి అన్నాడు) అయితే నువ్వీ జన్మలో సుఖపడలేవు.

(సీతని తప్పించుకుని మధ్య గదిలోకి వెళ్ళిపోయేడు. సీత మొహాన్ని రెండు చేతుల్తో కప్పుకున్నది. వచ్చే ఏడుపుని దిగమింగుకున్నది అదే వేళకి సుబ్బారావు ఒచ్చేడు — చేతిలో సూటుకేసు వగైరాను. అతని కాలి శబ్దం విని సీత అడిగింది )

సీత . ఎవరది?

సుబ్బా : నేను సీతా! సుబ్బారావుని.

సీత . (ఉత్సాహంగా అన్నది) అన్నయ్యా! ఎన్నాళ్ళకి ఒచ్చేవురా. రా, లోపలికొచ్చి కూచో.

సుబ్బా : బాబాయి వున్నాడా?

సీత : అంతా వున్నారు. ముందు కూర్చో.

సుబ్బా·కూర్చుంటాగానీ, బాబాయి బిజీగా వున్నాడా?

సీత · నువ్వు నాన్నని చూచ్చేందుకొచ్చేవా? నన్ను చూడటాని కొచ్చేవా?

సుబ్బా : నిన్ను చూస్తూ కూచుంటే నా పనులేమవుతాయి సీతా! నువ్వేమైనా ఆర్చగలవా, తీర్చగలవా? అఫ్టరాల్ సీతవి. ఒక ఆడ పిల్లవి

సీత : పైగా గుడ్డిదాన్ని. నిజమే చెప్పావురా. నేను అప్రయోజకురాలిని.

సుబ్బా · నా బదిలీకోసం వచ్చేనే సీతా, బాబాయితో చెడామడా రెండు మాటాడేసి వెళ్ళిపోతాను.

సీత (కోపం వచ్చింది) వెళ్ళి నాన్నని చూడు పో. ఒరేయ్ మీరంతా దొంగ్రలా. అవకాశవాదులు. మీకు ప్రేమాభిమానాలు లేవు. అవి చచ్చి బతుకుతున్న మనుషులు. వెళ్ళు.

సుబ్బా · అబ్బబ్బ. వూసిపారేసేవ్ పో. ఎంతకోపమే నీకు. అవునే సీతా సుఖంగా వున్నావా?

సీత : నాతో మాటాడకు. వెళ్ళి నాన్నని కలుసుకో. పో.

సుబ్బా : పోతాలేవే బాబూ! ఖంగారు పెట్టకు ఇవాళంతా ఇక్కడే వుంటాను. బాబాయి వుంటాడో వుండడోనని వచ్చేనా, నిక్షేపంగా వున్నాడని చల్లటి ఖబురు చెప్పేవు.

సీత : ఈ యింటికి మీరు రాకండా వుంటేనే నాకు సుఖం. మీ సొంత పనులమీదొచ్చి, ఒక పూట గడిపి వెళ్ళిపోతారు. ఆ తర్వాత, ఒరేయ్ ఆ తర్వాత నే నెంత బాధపడిపోతానో తెలుసా? ఈ ఇంట్లో ఒక్కర్తినీ కూచుని, ఏవి టేవిటో తలుచుకుని గుండెలవిసేలా ఏడవడం నేర్చుకున్నారా. మీ సుఖాలూ, మీ రాజకీయాలూ, అవే మీకు ముఖ్యం? నే నెవర్ని మీకు? పొండి వెళ్ళిపొండి.

(చక్రపాణి గబ గబా ఒచ్చేడు. చేతులుచాస్తూ అన్నాడు.)

చక్ర: హౌ డియూ యూడు? (సుబ్బారావు చేతిని పుచ్చుకున్నాడు )

సుబ్బా·చంపేరు. ఆ చేతిని తొలిగించండి ఇనుప మనుషులు!

చక్ర : ఎంత సేపయింది ఒచ్చి.

సుబ్బా : ఎంతోనా? ఇప్పుడే. వొచ్చినవాడ్ని వొచ్చినట్టు నిలబెట్టి కడిగవతల పారేసింది సీత. ఏమిటో అనుకున్నాను, బ్రహ్మాండమైన జోకులు నేర్చిందే మా సీత!

చక్ర : జోకులా?

సుబ్బా : మరి. దాన్నే అడగండి. నేను దొంగనట. రాస్కెల్‌నట. ప్రేమాభిమానాలు చచ్చి బతుకుతున్న మనిషినట ఒకటా రెండా—సమయాని కొచ్చి రక్షించేరు గనక బతికిపోయేను. అమ్మ! ఏం దులిప్పారేసిందండి బాబూ!

చక్ర · అది మీమీద కోపం కాదండి. మీమీదున్న అభిమానం.

(సీత లోపలికి వెళ్ళబోయింది)

సుబ్బా : సీతా!

సీత : నాన్నగారు మేడమీదున్నారు. వెళ్ళు. (సీత వెళ్ళిపోయింది )

(సుబ్బారావు మేడమీదికి వెళ్ళేడు. చక్రపాణి సీత గది పక్క గదిలోకి వెళ్ళేడు. రెండు క్షణాలు నిశ్శబ్దంగా వుంది మేడమించి సుబ్బారావు నవ్వు వినిపించింది)

సుబ్బా . బాబాయో బాబాయ్ వండ్రఫుల్ యువా జోకు.

చెన్న . వ వెధవ జోకుట జోకు

సుబ్బా : మరి జోకుకాదా? మంత్రి మహాశయులు 'చూద్దాంలే' అంటే చాలు అది క్లాస్ వన్ జోక్ తమిళంలో 'పార్కలాం' అంటారు.

చెన్న : ముందా నోరుమూసి ఈ కాగితంచూడు.

(మళ్ళీ నిశ్శబ్దం. కాసేపట్లో ఫోన్ మోగింది· అది అలా మోగుతూనే వుంది ముందుగా సీత వచ్చి గుమ్మం దగ్గిర నిలబడి—ఎవరూ ఫోన్ దగ్గిరకు వెళ్ళలేదని తెలిసి రెండు అడుగులు వేసింది సీతని చూచి మెడదిగిన చెన్నకేశవులు ఆగిపోయేడు. చెన్నకేశవుల్తోపాటు రామదాసూ, సుబ్బారావూను ఎవర్నీ చూడకుండానే చక్రపాణి రివ్వునవచ్చి ఫో నెత్తేడు ఆ శబ్దం విని సీత ఆగిపోయింది.)

చక్ర : ఎవరూ .మిస్ మంజులా! గుడ్‌మార్నింగ్ (మౌత్‌పీస్‌ని చేత్తో మూసి చెన్నకేశవులి వేపు చూసేడు చెన్నకేశవులు మేడ ఎక్కేడు. అతన్తోపాటు రామదాసు, సుబ్బారావూ వెళ్ళిపోయేరు. సీతని విసుగ్గా చూచి ఫోన్‌లో మాటాడటం ప్రారంభించేడు) ఈ ఇంట్లో మంజూ, అనాగరికుల మధ్య బతుకుతున్నాననే విషయం గుర్తుకు వొచ్చినప్పుడు నేనెంత తల్లడిల్లిపోతుంటానో తెలుసా? ఇక్కడ నాకు ప్రైవసీ లేదు మంజూ!. .నువ్వంత మెత్తగా మాటా



ఉకు. నాకు మతిపోతోంది. ఎక్కడున్నావ్. ..
వెరీగుడ్. .. ..ఎంతసేపుంటావు?. ..... కవిత్వం చెప్పకు మంజూ. యుగాంతంవరకూ నాకోసం వెయిట్ చేయడానికి నేను నీ భర్తనా? నా కా చాన్సులేదు అచ్చా...మరో అరగంటలో నీ ముందువాలిపోతాను. ఒకే. దటీజ్ రైట్. (ఫోను పెట్టేస్తూ అన్నాడు) స్వీట్ మంజూ!

(మేడదిగాడు సుబ్బారావు. బొమ్మలా నించున్న సీతనీ, విరవీగుతూన్న పాణినీ చూసేడు)

సుబ్బా బావుంది బావగారూ! వరసెంతో బావుంది. ఎవరాస్వీటు? ఏమాజోకు?

చక్ర· మిస్ మంజుల ... ఒక ముద్దబంతిపూవు.

సుబ్బా· వాసనుంటుందా?.... బావగారూ! . నేను హాస్యగాడినేకాదు. సీరియస్ మనిషిని గూడాను. ఎన్నాళ్ల పరిచయం మీది?

# ఆశ్రయం

సీత· (సుబ్బారావులో కలిగిన ఈ వింత పరిణామానికి తల్లడిల్లిపోయింది) అన్నయ్యా!

సుబ్బా: మంజూ.... జూ .. అదొక కుక్క బావగారూ ఐనో మంజూ! ఐనోఎవిర్‌థింగ్.

చక్ర: (ఆశ్చర్యపోయేడు) మిస్టర్!

సుబ్బా జోకులేయకండి. సమయంకాదు అరగంటలో వెళ్ళిపోతారా? మళ్ళా తిరిగి ఎప్పుడొస్తారు?

చక్ర: నాన్‌సెన్స్, బుర్రతిరుగుతుందా?

సుబ్బా: నాక్కాదు, మేడమీద బాబాయికి, ఆయన్నంటిపెట్టుకున్న రామదాసుకీ, ఇక్కడ మీకూను. నా బుర్ర తిరగదు సీతా ఒక పనిచెయ్యి ... నువ్వు తయారవ్వు...... బావగారి వెంటవెళ్ళి జూని పలాకరించిరా!

చక్ర పిచ్చి సుబ్బారావ్! సీతా నా వెంటవస్తే బరువనుకున్నావా? రమ్మను. నేనూ సంతోషిస్తాను.

సీత వెళ్ళిపోనివ్వు అన్నయ్యా! మీరెవ్వరూ ఆయన్ని బాగుచేయలేరు ఆయన నాన్ననే గెలిచేరు! నువ్వెంత, వెళ్ళిపోనివ్వు ఇదంతా నా ఖర్మ. (సీత తనగదిలోకి వెళ్ళిపోయింది చక్రపాణినవ్వేడు)

సుబా నవ్వకండి బావగారూ! ఇక్కడి మంచితనాన్ని లిని బతుకుతున్నారు మీరు నవ్వకండి. సెల్లాన్ని అవమానించిన వాడెవ్వడూ బాగుపడలేదు నవ్వకండి

(అతనూ సీతగదిలోకి వెళ్ళిపోయేడు. చక్రపాణి విసురుగా బయటికి వెళ్ల బోయేడు గానీ సత్యం ఎదురావడంతో ఆగిపోయేడు. సత్యం అంత అకస్మాత్తుగా ప్రత్యక్షమైనందుకు ఆశ్చర్యపోయేడు

చక్ర: ఎన్నాళ్లకి చూసేనోయ్ సత్యం! క్షేమమా?

సత్య (ఏం మాట్లాడలేదు)

చక్ర రా. లోపలికొచ్చి కూచో.

సత్య (వొచ్చికూచున్నాడు)

చక్ర పని మీదొచ్చేవా? ఎన్నాళ్ళుంటావ్?

సత్య నేనూ సుబ్బారావు కలిసే ఒచ్చాం.

చక్ర మరి ఆవిషయం అతను చెప్పేడుగాదే? ఇంత సేపట్నుంచీ బయటే నించున్నావా?

సత్య ఇప్పుడూ లోపలికి వొచ్చేవాడినికాదు. కాని రాక తప్పలేదు

చక్ర సీతని పిలిచేదా?

సత్య ఎందుకు?

చక్ర· నువ్వు సీతతో మాటాడుతూండు. నాకు బయట పనుంది

సత్య మిస్ మంజూ దగ్గరికేనా?

చక్ర: విషయం విన్నావన్నమాట, వెరీగుడ్ సీతని పిలిచేదా?

సత్య సీతోమాట్లాడేందుకే వొచ్చాను.

చక్ర. అర్జంటా?

సత్య చాలా!

చక్ర (కూర్చున్నాడు) అవుతే చెప్పు.

సత్య: నువ్వు దుర్మార్గుడివి, నీతి నిజాయితీ లేని మనిషివి ఒప్పుకో.

చక్ర: నువ్వరిగి పోయిన రికార్డువి. ఎన్నిసార్లు ఒప్పుకోమంటావు? అడిగేందుకు నీకు సిగ్గులేదేమో గాని వినేందుకు నాకు సిగ్గుగా వుంది.

సత్య సీతని పెళ్లిచేసుకున్న ప్రయత్నాలకి నువ్వు సిగ్గుపడి చావవలసిన పని. కనక నీకు సిగ్గు గురించి తెలీదు.

చక్ర: (కాసేపు ఆలోచించి అన్నాడు) ఏవిటోమాటాడాలని వొచ్చేనన్నావ్?

సత్య మంజూ గింజూని మరిచిపో!

చక్ర వూ!... మరిచిపోయి?

సత్య: సీతని ప్రేమించు. సీతదేవత పాణి, సీతని ఆదరించడం నేర్చుకుని పుణ్యం కట్టుకో. మావయ్యకి నీకూ వున్న బంధుత్వం నాకు తెలుసు. మీ లౌక్యాల్తో, ఎత్తుగడలతో సీతకి అన్యాయం చేయకండి.

చక్ర: నువ్వన్నట్టే సీతని ప్రేమించడం ప్రారంభి స్తానే అనుకో. దానివల్ల నువ్వుపొందే 'లాభం' ఏమిటి?

సత్య లాభం. ఇక్కడగూడా వ్యాపారాన్ని గుర్తు చేయకుపాణి! నాకు బాధగా వుంటుంది.

చక్ర లాభంకాకపోతే మరోటి. సీతని ఉద్ధరించమని కోరడంలో నీ ఉద్దేశమేమిటి?

సత్య: సీత సుఖపడాలి.

చక్ర: దాని సుఖదుఃఖాల్తో నీకేమిటి పనంటున్నాను?

సత్య సీత నా ప్రాణం.

చక్ర నిజం?

సత్య ఈనిజం నీకెప్పట్నుంచో తెలుసు. సీతమీద నాకు ప్రేమగానీ, జాలిగాని దూరంకావు.

చక్ర సీతనింకా ప్రేమిస్తూనే వున్నావా?

సత్య: ఏంతప్పా? మనిషిని మనిషి ప్రేమించడం నేరమా?

చక్ర: నువ్వు సీతని ప్రేమిస్తున్నట్టే నేను మంజూని ప్రేమిస్తున్నాను.

సత్య: కాదు కామిస్తున్నావు.

చక్ర: నువ్వు సీతని కామించడంలేదని ఋజువుందా?

సత్య: నా ఆత్మ!

చక్ర: నాన్‌సెన్స్, యూస్‌లెస్ ఆర్గ్యుమెంట్!

సత్య అదినీబోటి అనాగరికుడికి అర్థం కాదు.

చక్ర: నేనా అనాగరికుడ్ని?

సత్య: జీవితమంటే నువ్వాడే పదమూడు ముక్కలాటకాదు పాణి! దారుణమైన నీ ప్లాన్స్‌కి ఇంతటితోనైనా మంగళవాక్యం పలుకు సీతకి జీవితం పట్ల ఆసక్తి కలుగజెయి సీత అమాయకురాలు. అల్పసంతోషి. నిన్ను దేవుడిగా ఎంచి జీవితాంతం నీకు ఋణపడి వుంటుంది. ఈ తృప్తి పిమించిన సుఖం మంజూలోగాని, సీసాల్లోగానీ దొరకదు

చక్ర: మంజూ అంటున్నావు, పదమూడుముక్కలాటంటున్నావు, సీసాలంటున్నావు— ఏవిటీ కధ? నాగురించి అంతా తెలుసుకునే వొచ్చేవా?

సత్య సీతతో నీ పెళ్ళయిన ఈ రెండేళ్ళుగా నేను నీ విషయాలే సేకరిస్తున్నాను.

చక్ర వెరీబేడ్ హాబీ! టూ ఇయర్స్ .. నీ జీవితంలో రెండేళ్లు ఎందుకూ పనికిరాకుండా తగులడిపోయేయి. వెర్రివాడా? నీ గురించేవిటో నువ్వు చూచుకోడం మాని పరాయి వాడి జోక్యానికి పోయావా? వేస్ట్. ఈ రెండేళ్లలో— పెళ్లి చేసుకుంటే ఇద్దరు పిల్లల్ని పొందేవాడివి, వ్యాపారంచేసి, బాగుపడటం తెలుస్తే ఏబై అరవై వేలు సంపాయించే వాడివి, మజా చేయడం ప్రారంభిస్తే క్లైమేక్స్ పొలిమేరల్లో వుండేవాడివి. రాజకీయాల్లో తిరగడం నేర్చుకుంటే ఛోటానాయకుడివై వెలిగేవాడివి, ఖూసీలుచేసే తాహతుంటే ఏభై ఎందిని జనాభాలెక్కల్లో తగ్గించేవాడివి— ఇవేమీ చేయలేకపోగా, వేట కుక్కలాగా నన్ను పసిగట్టడంతోటే రెండేళ్ళు గడిపేసి ఫూల్‌వైపోయేవు. ఐ పిటీయూ. నిన్నీ స్థితిలో చూస్తుంటే ఏడుపు ముంచుకు వస్తోంది లే చిట్టీ— అక్కడమందుంది. రెండు చుక్కలు పుచ్చుకుంటే ఉత్సాహం పొంగి, నా కారెక్కికూర్చుంటావు. అతర్వాత నువ్వు చేయబోయేదంతా మజానే!

చెప్పేది వింటున్నాను.

చక్ర: ఇంకోచక్కటి రహస్యం చెబుతాను. అది గూడా విను. (గబగబా వెళ్ళి సీసాలో బ్రాందీన్ని గ్లాసులోకి వొంచి తీసుకొచ్చేడు) ఇది పుచ్చుకో. నేను చెప్పేది వింటే నువ్వు ఉక్కిరిబిక్కిరై పోయి తట్టుకోలేక సతమతవుతావు మనిషినా పరిస్థితుల్లో స్టడీగా నించోబెట్టడం ఈ ద్రవానికే తెలుసు. అది దాని డ్యూటీ. పుచ్చుకో.

సత్య: అఖ్ఖర్లేదు.

చక్ర: అయితే నేను పుచ్చుకుంటాను. (కొంచెం రుచిచూచి సత్యం చుట్టూ తిరుగుతూ చెప్పేడు) నిజమేనోయ్ సత్యం. నువ్వు చెప్పిందంతా నిజమే నేను సీతకి అన్యాయం చేస్తున్న మాటెంతో నిజం. (సీతా, సుబ్బారావూ వొచ్చి గుమ్మం దగ్గర నించున్నారు) నాసరదాల్తో, నా సుఖాల్తో సీతని పూర్తిగా మరిచి పోయేను. పార్డన్మీ! నువ్వు సీతని ప్రేమిస్తున్న మనిషివి గదూ, సీత దుఃఖపడితే నువ్వు చూళ్ళేవుగదూ, పాపం— అది గూడా నిజమే! సీతమీద ఇంత జాలీ ప్రేమా వున్న మనిషివి నీకు నేనిప్పుడేం చెప్పినా చేయగలవు. నేనేమో నువ్వనుకున్నంత అర్జంటుగా మంచి సన్యాసినై పోయేందుకు అవకాశాలు తక్కువ. సీత సుఖపడాలంటే ఒకేఒక మార్గం వుంది—విను— లీగల్‌గా సీత నా పెళ్ళామే, సీతని సంతోషపెట్టే కార్యక్రమం నువ్వు ఆరంబించు సత్యం. విత్‌ప్లెజర్ నేన్దానికి యస్సంటాను. ఇక సమస్యేలేదు.

సత్య: (చివాలునలేచి చెయ్యెత్తేడు) యూ రాస్కెల్!

సీత. బావా!

(సత్యం ఎత్తినచేతిని దించాడు).

చక్ర: (క్రూరంగా నవ్వేడు) గుడ్డిదైనా నీ ప్రతి చర్యనీ గమనిస్తోంది సీత నా ప్రాణం తీసేవాడివి క్షణంలో. సీత మాటతో గక్కున ఆగిపోయేవు మా యిద్దరి సఖ్యం యిప్పుడర్థమైందనుకుంటాను (రుద్రుడయ్యాడు) ఫూల్! నన్ను కొట్టి పారేసే మనిషివా? అవుట్ క్షణంలో యిక్కడ్నుంచి వెళ్ళిపోవాలి. లేకపోతే కాల్చి పారేస్తాను.

సీత వెళ్లిపోబావా? మళ్లా ఈ యింటికి రాకు నా మీదనీకు మమకారం ఎందుకుండాలసలు? నేను నీకు పరాయిదాన్ని వెళ్ళిపో బావా! నేనిక్కడ వుండటం మూలంగానే కదా ఒచ్చేవు మళ్ళా నువ్విక్కడికి వచ్చే అవసరం వుండదు. నేనో నిశ్చయానికి వచ్చాను ఈ పాపిష్ఠి బ్రతుకు యింకా బతకలేను. నా మూలంగా మీకెవ్వరికీ యింకా ఏ ఇబ్బందీ వుండదు నేను వెళ్ళిపోతాను. మీ అందరికీ దూరంగా వెళ్లిపోతాను. ఎక్కడో రాలిపోతాను. నా శవాన్ని సైతం మీకందకుండా చేస్తాను సెలవు బావా . ఇక వెళ్ళిపో ..

(చెన్నకేశవులు రామదాసుతో మేడదిగి ఒచ్చేడు)

చెన్న ఏవిటీకాకిగోల . వెళ్లిపో. . వెళ్లిపోతా .దాసూ సంగతేమిటో కనుక్కో .. ఈ ఇల్లు ఎసంబ్లీ అయిపోతుంది . ఈ ఇంట్లో నిద్రపోడానికి వీలుందో లేదో గూడా కనుక్కో. వీళ్ళేదంటే అందర్నీ బయటికి తోసి తలుపులు బిగించు. ఇడియట్స్

చక్ర: మీ మేనల్లుడొచ్చి చిన్నగాలి దుమారం సృష్టించేడు. అమ్మడేమో ప్రాణం తీసుకుంటానని మారాము చేస్తోంది.

చెన్న అంతముచ్చటగా వుందా? దాసూ .. మేడమీద నా రివాల్వరుంది. పట్టుకొచ్చి సీతకివ్వు.

సీత. నాన్నా!

చెన్న: సైలెన్స్.

సుబ్బా ఏం జోకురా బాబూ! బాబాయికి జై.

చెన్న నోర్మూయ్యరా ఉట్టిగా వినండి ఎవరైనా నోరు తెరిచేరో ... పీక నులిమి వేస్తాడు దాసు . పదవోయి దాసు

(దాసు చెన్నకేశవుల్ని మేడమీదికి తీసుకువెళ్ళాడు)

చక్ర. విన్నారుగా అదీ విషయం ఎవర్నో ఒకర్ని కాల్చి చంపాలని మావగారికి సరదాగా వుంది తర్వాత మీ యిష్టం

(ఫోన్ మోగింది చక్రపాణి అందుకున్నాడు).

చక్ర: సారీమంజూ!.... లేటయిందికదూ ఇదిగో ఒచ్చేస్తున్నా

(ఏం చేయాలో తోచక మిగతా ముగ్గురూ అవాక్కయి బొమ్మల్లా నించున్నారు. వాళ్ళనా స్థితిలో చూస్తున్న చక్రపాణికి సరదాగా వుంది. సరిగ్గా అప్పుడే తెర పడింది )

(ముగింపు పైవారం)



# అసభ్యత ఆదరించ తగినదేనా?

ఆంధ్రసచిత్రవారపత్రిక 23-8-68 సంచికలో ప్రచురించిన 'అసభ్యత చలన చిత్రాలలో మాత్రమేనా?' అన్న శ్రీ సి వి రమణగారి వ్యాసంపై పాఠకులు వెలి బుచ్చిన అభిప్రాయాలలో కొన్నిటిని ఈ దిగువ ప్రచురిస్తున్నాము

—సం॥

మీరు 23—8—68వ తేదీ ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురించిన సి వి రమణగారి 'అసభ్యత చలనచిత్రాలలో మాత్రమేనా?' అన్న వ్యాసం చదివాను

'సెక్సు' ఎక్కువగా ఉన్న చిత్రాలను, సెక్సు పత్రికలను సమర్థిస్తూ దానికి సోదాహరణంగా పురాణేతిహాసాలను, ప్రాచీన కావ్యాలను ఉదహరిస్తూ, 'సెక్సు' అనేది యీ నాటిదిగాదని, ఆనాటినుండి కావ్యాలలో, శిల్పాలలో నిండి ఉన్నట్లుగా పేర్కొన్నారు ఆ వ్యాస రచయిత

కావ్యాలు నవరస భరితాలు నవరసాల్లో శృంగార రసం కూడా ఒకటేగదా! మిగతారసాలు పోషింపబడి నట్లే శృంగార రసంకూడా ఆ కావ్యాలలో పోషింప బడింది రచయిత అన్నట్టుగా కొన్ని గ్రంథాలలో శృంగారరసం ఎక్కువ మోతాదులో ఉండి ఉండ వచ్చును కాని, అవి అశ్లీలంగా, అసభ్యంగా లేవే? ఒక వేళ ఒకే దృష్టితో పరిశీలిస్తే కొంతమందికి కావ్యాల నిండా పచ్చి శృంగారమే కన్పించి ఉండవచ్చు అంత మాత్రంచేత అది సర్వజనాభిప్రాయంగా పేర్కొన లేముగదా!

రచయిత అభ్యుదయ భావాన్ని మెచ్చుకోవాల్సిందే కాని భాగవతంలాంటి ఉద్గ్రంథాన్ని ఆడిపోసుకో కుండా 'యిది నా వ్యక్తిగత అభిప్రాయం' అని చివర్లో ఒప్పుకున్నట్లయితే అందరూ హర్షించేవారు

చలనచిత్రాలలో అసభ్యతని సమర్థిస్తూ, అశ్లీల సాహిత్యాన్ని మెచ్చుకుంటూ విమర్శకుల్ని ఆడిపోశారు రచయిత

'అసభ్య చిత్రాలు' ఎక్కువగా విజయవంతమవు తున్నట్లుగా చెప్పారు సెక్సులేని చిత్రాలు ఎన్నో ప్రజాభిమానం చూరగొన్నాయి అలాగే సెక్సు ఎక్కువగా ఉన్న చిత్రాలు ఎన్నో 'ఫెయిల్' అయి వాయి దీనికేమంటారు

"సెక్సు పత్రికలు కోకొల్లలుగా ఉద్భవిస్తున్నాయి అవన్నీ నిలవదొక్కుకో గల్గుతున్నాయి' అన్నారు రచయిత సెక్సు పత్రికలు రోజుకొకటి చొప్పున వస్తున్నాయి నిజమే కాని అవి నిలదొక్కుకో గల్గుతున్నాయా? వచ్చే సంచిక వస్తుందో, రాదో కూడ చెప్ప లేని పరిస్థితిలో అవి — ఉన్నాయి యువతరం వారి ఆదరణ మాత్రమే పొందగల్గుతున్నాయి వాటికి 'భారీ ఆదరణ' ఎలా లభిస్తుంది?

రచయిత అన్నట్టుగా అందరికి 'సెక్సు' మీద అభిరుచి ఉంటుంది 'సెక్సు' జీవితానికి అవసరం కూడాను కాని అది బాహాటంగా, అసభ్యంగా, అపరి మితంగా, ఉండకూడదు

కాలంతోపాటు ఎదగని వాళ్ళను 'బూజు మను ష్యులు' అని విమర్శించారు అయితే మారిపోయే కాలంతోపాటు ప్రతిక్షణం అభిప్రాయాలను, అల వాట్లను మార్చుకోవటమేనా అభ్యుదయవాదుల లక్షణం?

యిలాంటి రచనలు వాదోపవాదాన్ని లేవదీస్తాయి గాని, ఏ ప్రయోజనాన్ని సాధించలేవు వ్యాసరచ యితే తన అభిప్రాయంతో వ్యక్తిగతంగా ఏకీ భవించ లేరని నా ఉద్దేశ్యం యిక యితరుల విషయం చెప్ప నక్కరలేదు

డి చంద్ర (మద్రాసు)

## అసభ్యతని అరికట్టాలి?

అసభ్యత ఎక్కడ ఏరూపంలో వున్నా హర్షించ దగ్గది కాదు పదిమంది వానిని కోరినంతమాత్రాన ఆదరించినంత మాత్రాన అది సభ్యతగా మారదు దిండు కింద సెక్సు పుస్తకాలు పెట్టుకునిపైకి మటుకు వాటిని తిట్టే వారు నిజాయితీలేనివారు ఒక సినిమా చూసి అది బాగులేదని తిట్టే వాణ్ణి అది ఎందుకు చూశావు అనడిగితే ఏమం టాడు? చూడందే అది బాగులేదని ఎలాతెలు స్తుంది? అది బాగులేదని పదిమంది చెప్తే విని చూడ్డం మానేసే బుద్ధిమంతులూ వున్నారు అన్ని సినిమాలూ అలాగే వుంటున్నప్పుడు గొంగ లిలో వెంట్రుకలు ఏరతామా అనుకుని కాలక్షేపం కోసం చూసే వారూ వున్నారు అంతమాత్రాన అలాంటి సినిమాలనే ప్రేక్షకులు ఆదరిస్తారను కునే నిర్మాతలూ తయారైనారు

కాలం మారవచ్చు అభిరుచులు మారవచ్చు కాని మన సంస్కృతి, నైతిక విలువలు—యివి ఎప్పుడూ ఒకటిగానే వుంటాయి ఏది సభ్యత అనేది నిర్ణయించడానికి మారని ఆ విలువలే తూకపు రాళ్ళు కావాలి గాని యితర దేశాల ఉదాహరణల తోను, పదిమంది అవునంటే చాలనే తేలికవాదాల తోను నిర్ణయించలేం అటువంటి విలువల్ని పట్టు కుని ప్రాకులాడేవారు కాలానికి ఎదురీదుతున్న బూజు మనుషులుగా కనిపించడం సహజం కాని సమాజపురోభివృద్ధిని, మన ప్రాచీన సంస్కృ తిని దృష్టిలో పెట్టుకుని ఆలోచిస్తే నేటి అసభ్య చిత్రాలు, హేయమైన సెక్సు పుస్తకాలు అసభ్యం గానే కనిపిస్తాయి, హేయంగానే కనిపిస్తాయి సమర్థనీయం ఎంతమాత్రమూ కావు స్వచ్ఛ మైన అద్దాల లోంచి చూసినప్పుడేగదా అసలు స్వరూపం తెలిసేది రంగుటద్దాలలోంచిచూసి మోసపోవడం తగునా?

నవ్యతనీ, నవజీవనాన్ని మానవుడు కోరడం తప్పుకాదు కాని నవ్యత పేరుతో ఏది వచ్చినా స్వీకరించడానికి మనం అవివేకులమా? విచక్షణా జ్ఞానంతో యిది మంచీ, యిది చెడూ అని తెలుసుకోలేని మూర్ఖులమా? నవ్యతకోసం సిని మాలు అసభ్యంగా వుండాలని ఎక్కడుంది? బూతు పుస్తకాలే నవజీవనానికి చిహ్నాలు కానక్కరలేదే! ఒక చెడ్డపుస్తకం అది చదివిన కొద్దిమంది అక్షరాస్యులలోనూ విచక్షణా జ్ఞానంలేని కొద్దిమం దిని మాత్రమే మారుస్తుంది కాని నేటిఅసభ్య సినిమాలు (దుష్ట సమాసమా!) చాలామందిని మారుస్తున్నాయి నేడు సినిమా నిర్మాణం, పుస్తక రచన ఒక కల్తీవ్యాపారి మనస్తత్వంలోనే సాగు తున్నవి ఒక్కటే తేడా కల్తీ వ్యాపారికి పట్టు బడితే ప్రభుత్వం శిక్షిస్తుందేమో నన్న భయ మైనా వుంది కల్తీ పదార్థాలే నేటి ప్రజలు కోరుతున్నారని చెప్పడం గూడా నేర్చుకుంటాడేమో (మంచి సరుకు అంత డబ్బు పెట్టి సామాన్య మానవుడు కొనగలడా!) మన నిర్మాతల్ని, బూతు పుస్తక రచయితల్నిచూసి

ఇకమన పూర్వ గ్రంథాలలోని అసభ్యత మన మన ప్రాచీన సంస్కృతిలో ఒక భాగమనుకోడం వింతగా వుంది దానిని తిట్టుకవిత్వంగా జమ కట్టి వేరే వుంచారానాడు వాటిని అసభ్యత యిలా వుంటుందనేందుకు ఉదాహరణ గ్రంథాలుగా పేర్కొంటారు గాని, అవే ప్రమాణ గ్రంథాలుగా స్వీకరిస్తామంటే ఎలా వుంటుంది? దొంగతనం చేయరాదనే నీతిని చెప్పే కథలో ఒకపిల్లవాడు దొంగతనం చేశాడనుకుందాం అది విని ఆపిల్ల వాడు చేయలేదా, నేనూ చేస్తాను అనేకుర్రవాని మనస్తత్వం లాగా వుంటుంది

ఇంతకూ మనం సినిమాలకూ, పుస్తకాలకూ సంబంధించి నంతవరకూ ఏది అసభ్యత? అని ప్రశ్నించుకోడం మాని దీనినెలా అరికట్టడం? అని ఆలోచించాల్సిన సమయం ఎపుడోవచ్చింది.

ఎల్వియస్ (మద్రాసు)

▣ లక్ష్యాధికారి నాగభూషణం టిప్‌టాప్ సూర్యకాంతం చేతి కీలుబొమ్మ అయ్యాడు. ఆమెకోసం కన్నబిడ్డలనే దూరం చేసుకున్నాడు. ఒకరోజు విజయనిర్మల తన తండ్రి నాగభూషణంను చూడాలని వస్తుంది. కన్నతండ్రిని చూడనివ్వకుండా సూర్యకాంతం అడ్డుపడుతుంది. నిర్మలకు ఒళ్ళు మండింది. ఆచెంపా యీ చెంపా వాయించింది. సూర్యకాంతం గడిబిడి చేస్తుంది. ఈ గలభాను తట్టుకోలేని నాగభూషణం కిందికి దిగివస్తాడు. 'నిన్ను చూడనివ్వలేదు నాన్నా' అని తండ్రితో చెప్పింది విజయనిర్మల. 'ఎంత నంగనాచివే, యిది చేసిన ఆర్భాటం చూసారుగా డార్లింగ్' అంటూ నాగభూషణం చెయ్యి పట్టుకుంటుంది సూర్యకాంతం. ఇరకాటంలో పడ్డాడు పాపం నాగభూషణం, ఒకర్నిచూస్తేనా రక్తం పంచుకుపుట్టిన కూతురు. మరొకర్ని చూస్తే తను గాఢంగా ప్రేమించే యువతి. వీరిద్దర్లో యెవర్ని సమర్థించాలి? యెవర్ని ఓదార్చాలి? అనేడి ప్రశ్నలకు సమాధానం నవజ్యోతి సంస్థ నిర్మించే 'నడమంత్రపుసిరి'

శ్రీయుతులు వందనం సాంబశివరావులు నిర్మించిన యీ చిత్రంలో విజయనిర్మల, హరనాథ్, నాగభూషణం, సూర్యకాంతం, రాజనాల, రాజబాబు, విజయలలిత, సత్యనారాయణ, అనూరాధ, ఉదయచంద్రిక వివిధ భూమికల్లో విశిష్టమయిన నటనతో మిమ్మల్ని రంజింపచేసే విధంగా యువదర్శకుడు శ్రీ తాతినేని రామారావు డైరెక్టు చేసారు. కూర్చున్న మూడు గంటలూ హాయిగా, వుత్సాహంగా ఫీల్ అయ్యేలా జూనియర్ సముద్రాల సంభాషణలను వ్రాస్తే, మనస్సుకు సంతోషాన్ని, వుత్తేజాన్ని యేర్పరచే రీతిగ శ్రీయుతులు నారాయణరెడ్డి, దాశరథి కొసరాజు పాటలను రచిస్తే, ఆపాటలకు చలపతిరావు కమ్మటి బాణీలను సమకూర్చారు చిత్రాన్ని చక్కటి కోణాల్లో వి. ఎస్. ఆర్. స్వామి చిత్రించి, వెంకట్రావు వేసినసెట్లకు మంచి ఎఫెక్టు తెప్పించారు. ఈచిత్రాన్ని ఆంధ్రాలో మీకు చూపించే బాధ్యతను రాయల్ ఫిలింస్ తీసికొన్నారు. సెప్టెంబరు చివరలో విడుదలవుతుంది.

# సినిమా

## అనాచారమేకాదు-దురాచారం!

ఆదర్శభావాలు, సంఘ సంస్కరణాభిలాష ధ్యేయంగా పెట్టుకోవడమేగాక కార్యాచరణలో చూపించ దల్చుకున్నాడు హరనాథ్ వరకట్నం మన సమాజానికి నిషేధం అంటాడు; జాతి శక్తివంతం కావాలంటే రక్తసంకరం తప్పదుఅంటాడు; మేనరికం అనాచారమేకాదు దురాచారం అంటాడు హరనాథ్! ఇన్ని వుత్తమ ఆశయాలను తన జీవితంలో నెరవేర్చుకో గలడా, లేదా అన్నప్రశ్నకు సమాధానం బాలా ప్రొడక్షన్స్ 'బంగారు సంకెళ్లు' చిత్రం చూస్తే తేలిపోతుంది. నేటి సంఘంలో జరిగే అన్యాయాన్ని, అవినీతిని నిర్మూలించేది ఎలా? ఈ సమస్యను అభ్యుదయ భావాలుగల దర్శకుడు శ్రీ జి. రామినీడు యీ చిత్రంలో యెలా చిత్రించాడో ఆయాదృశ్యాలు యెంత సహజంగా మీలో ముద్రించబడ్తాయో 'బంగారు సంకెళ్ళు' చూసినతర్వాతగానీ చెప్పలేం. సమస్యాత్మక చిత్రంలోని వివిధ పాత్రలను జమున, గుమ్మడి, హరనాథ్, ప్రభాకరరెడ్డి, రాజబాబు, రమాప్రభ, రావికొండలరావు, అల్లు రామలింగయ్య, టి. జి. కమలాదేవి కాకరాల, జ్యోతి, రాధిక పోషించారు.

ఈ చిత్రం విజయవంతంగా పూర్తయ్యేందుకు శ్రీయుతులు దాసరి గోపాలక్రిష్ణ, పింగళి, పూర్ణచంద్రరావు, వి. ఏస్. ఆర్. స్వామి, హీరాలాల్, రాజేంద్రకుమార్, అంకిరెడ్డి, రావు గోపాలరావు, కె. చటర్జీ వివిధశాఖలను నిర్వహించారు. శ్రీ వి. సత్యనారాయణచే నిర్మించబడ్డ యీ చిత్రం విశాలాంధ్రంతటా పూర్ణా పిక్చర్స్ద్వారా విడుదల కాబోతుంది.

## ముప్పు తప్పించుకోడానికి మారు వేషాలు

ధూళిపాళ, ప్రభాకరరెడ్డి రాజ్యాపహరణకు కుట్ర పన్నుతున్నారనేడి రహస్యం రాజశ్రీ, విజయలలితలకు తెలిసిపోయింది, ఇక అంతఃపురంలో వుంటే ముప్పుతప్పదు అని అబలలు యిద్దరూ మారువేషాల్లో పహరావాళ్ల కళ్ళుగప్పి తప్పించుకుని పోబోయే సమయంలో సత్యనారాయణ, రాజబాబు యెదురుపడ్తారు. ఈ ఘటాల దగ్గర్నుండి తప్పించుకోవాలిగ! అందుకని వాళ్లను మెప్పించే ఒక పాటను కమ్మగా పాడడం ప్రారంభిస్తారు, రాజశ్రీ, వి. లలిత:

ఎంతమజాగుందారూ—
ఎంత ఖుషీగుండారూ

ఇంతై అంతై బుల్ బుల్ బంతుల్లా
గుండారూ ! !
బాపురే బలేబలే బాగుండా రెహ్హా !
దొరలల్లె వుండారూ-సరదాగావుండారూ
అవకాలుచిక్కితే గద్దెనెక్కేలా గుండారూ
యెహ్హా !

అంటూ మారువేషాల్లోవున్న విజయలలిత, రాజశ్రీలు తమ ఆటపాటలతో ఆ మూర్ఖుల్ని కవ్వించేస్తారు. శ్రీ కొసరాజు కలంనుండి వెలువడ్డ యీ సాహిత్యానికి, జానకి, ఈశ్వరి తమ కంఠాన్ని సత్యంచెప్పిన విధంగా సవరించు కున్నారు. ఈ రసవత్తర ఘట్టాన్ని మీరు ఆస్వాదించే విధంగా దర్శకుడు విశ్వనాథం చిత్రీకరణలో చురుకుదనాన్ని చూపించారు. ఈ చిత్రాన్ని శ్రీయుతులు ప్రకాశరావు, పూర్ణచంద్రరావులు నవభారత్ ఫిలింస్ బ్యానర్ యొక్క మొదటి కానుకగ మీకు సమర్పిస్తున్నారు.

* * *

ప్రసాద్ స్టుడియోలో గోపాలకృష్ణా పిక్చర్స్ 'కథానాయకుడు' చిత్రం యొక్క

# సినిమా

షూటింగు శరవేగంతో సాగిపోతూంది ఆగస్టు 21 నుండి 31 వరకు జరిగే యీ షెడ్యూలులో దాదాపు సగం చిత్రం పూర్తవుతుందని నిర్మాత గోపాలకృష్ణ వివరించారు. ఈ వారం జరిగిన షూటింగు వివరం క్లుప్తంగా మీకు వెల్లడిస్తా.

నాగయ్యకు నాల్గునూ సాల జీతం బాకీ పడ్డాడు నాగభూషణం. ఏరోజు కారోజు వాయిదా వెయ్యడం అలవాటు నాగభూషణానికి. ఒకరోజు నాగయ్య డబ్బు వసూలు చెయ్యాలనే పట్టుదలతో నాగభూషణం యింటిముందు సత్యాగ్రహం చేస్తాడు. ఈ విషయాన్ని కాకరాల నాగభూషణంతో చెప్తాడు. ఆ సమయంలో నాగభూషణం తన మిత్రులతో 'మందు' సేవిస్తుంటాడు. కాకరాల అన్న మాటలను విన్న నాగభూషణం ఏమని సమాధానం చెప్పివుంటాడో వూహించుకోండి. నిషాలో వున్న భూషణం నాగయ్యను మెడబెట్టి బయటకు నెట్టమని కాకరాలకు ఆదేశిస్తాడు. ఈ సన్నివేశంలో నాగభూషణం అతి సహజంగా నటించి సన్నివేశాన్ని రక్తి కట్టించాడు. నాగభూషణం, మిక్కిలినేని, అల్లు రామలింగయ్య, రాఘవులు దుష్ట చతుష్టయంగా నటిస్తున్న యీ చిత్రాన్ని శ్రీ హేమాంబరధరరావు డైరెక్టు చేస్తున్నారు. జయలలిత, రామారావు నాయకీ నాయకులుగ నటించే యీ చిత్రానికి టి. వి. రాజు సంగీతాన్ని వినిపిస్తున్నారు. కెమెరాను వి. ఎస్. ఆర్. స్వామి, కళను బి. ఎన్. కృష్ణ నిర్వహించే యీ చిత్రానికి 'కథానాయకుడు' అని పేరు పెట్టబడింది.

**పదిహేను రోజుల్లో ఆరురీళ్ల చిత్రం!**

ప్రారంభించి పక్షంరోజులు అయినా కాలేదు; ఆరురీళ్ల చిత్రం తయారైంది డి.బి.ఎన్. అండ్ డేగా కంబైన్స్ నిర్మిస్తున్న 'అన్నదమ్ములు' చిత్రం. ఈ వారంలో జరిగిన షూటింగు విశేషాలు —

# మీకు తెలుసా?

ప్రముఖ నటి జయలలిత నటించిన మొదటి చిత్రం 'ఎపిసిల్' ఇంగ్లీషు చిత్రం'.

ప్రముఖ దర్శకుడు శ్రీ వి. రామచంద్రరావు జయలక్ష్మి పిక్చర్స్ నిర్మించిన 'తంగై' తెలుగు చిత్రంలో శ్రీ మల్లికార్జునరావు నిర్దేశకత్వంలో ఒక చిన్న పాత్రను పోషించారు.

శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, పండరీబాయి దంపతులుగా నటించిన చిత్రం ఎ. వి. ఎం. వారి 'వదిన'.

గ్లామర్ తార కుమారి జయలలిత యిప్పటిదాకా 45 చిత్రల్లో నటించింది. ఇందులో తమిళం 30, తెలుగు 10, కన్నడం 5.

శ్రీ ఎ. నాగేశ్వరరావు నటించిన మొదటి తమిళ చిత్రం ఎ. వి. ఎం వారి 'ఓర్ యిరవు.'

శ్రీ ఎన్. టి. రామారావు, వైజయంతిమాల కలసి నటించిన చిత్రం ఎ. వి. ఎం. వారి 'సంఘం'.

# సినిమా డైరీ

● మధు పిక్చర్స్ నిర్మిస్తున్న చిత్రానికి శ్రీ ఎస్. ఎస్. ప్రకాశంవద్ద సహాయకుడిగ వుండే శ్రీహరిని నిర్మాత శ్రీ మల్లికార్జున రావు ఎడిటరుగా నియమించారు.

● ముక్తా ఫిలింస్ నిర్మిస్తున్న నాల్గవ చిత్రంలో వాణిశ్రీ, శివాజీ నాయకీ నాయకులుగ నటిస్తున్నారు. ఈ చిత్రం యొక్క షూటింగు ఆగస్టు 24 వ ప్రారంభమైంది.

● ప్రముఖ నటి కుమారి వాణిశ్రీ మాధవనాయర్ కాలనీలో కొన్న స్థలంలో యిల్లు కట్టడానికై ఆగస్టు 18 వ తేదీ తెల్లవారుజామున గం 2—15ని లకు శంకుస్థాపన చేయించింది.

● విజయగిరిధ్వజ షూటింగులో ఆగస్టు 23 న శ్రీ రామారావు, కాంచన, షీలాలు పాల్గొన్నారు.

● నవశక్తి ఫిలింస్ "నిండుసంసారం" చిత్రంకో శ్రీరామారావు, కృష్ణకుమారినటించిన ప్రేమ గీతాన్ని శ్రీ సి. ఎస్. రావ్ చిత్రీకరించారు.

● నవభారత్ ఫిలింస్ "అగ్నిమీద గుగ్గిలం"యొక్క ఆఖరి కాల్‌షీటు ఆగస్టు 22 న గోల్డెన్‌లో జరిగింది. శ్రీయుతులు ప్రభాకరరెడ్డి, సత్యనారాయణ రాజబాబు, ధూళిపాళ,ఆనంద మోహన్‌లు పాల్గొన్నారు. శ్రీయుతులు ప్రకాశరావు, పూర్ణచంద్రరావు నిర్మించే యీ చిత్రం సెప్టెంబరు 12న విడుదలవుతుంది.

● విజయ, సురేష్ కంబైన్స్ నిర్మిస్తున్న జానపద చిత్రంయొక్క మొదటి పాటరికార్డింగ్ సెప్టెంబరు 4న వేణు సంగీత సారధ్యంలో జరుగుతుంది. ఈ చిత్రానికి జి. విశ్వనాథం దర్శకుడు.

● తారకరామా పిక్చర్స్ నిర్మించే సాంఘిక చిత్రంలోని ఆరు పాటలను ప్రముఖ హిందీ నేపథ్య గాయకుడు శ్రీ మహమ్మద్‌రఫీ పాడ్తారు. శ్రీ టి. వి. రాజు సంగీత దర్శకత్వం వహించే యీ చిత్రాన్ని శ్రీ పుండరీకాక్షయ్యకు శ్రీ బి. ఎ. సుబ్బారావు డైరెక్టు చేస్తారు.

● శ్రీ టి. ఎల్. కాంతారావుచే నిర్మితమయ్యే "సప్తస్వరాలు" చిత్రంలో రఫీ,మన్నాడేలు కలిసి పాడే పాటను శ్రీ టి .వి. రాజు రికార్డు చేయించనున్నారు.

● శ్రీ ఎ. కె. వేలన్ "నీటిబుడగ" చిత్రంయొక్క దర్శకత్వం బాధ్యతను శ్రీమతి సావిత్రికి అప్పగించారు, ముఖ్యపాత్రలను సావిత్రి, చలం ప్రభాకరరెడ్డి ధరిస్తారు.

# మీ చర్మాన్ని పుష్పదళం లాగ మెత్తగా, మృదువుగా యౌవనంగా వుంచుకోండి...

ఇందుకు మీ చర్మమందలి స్వాభావిక తేమను మీరు నిలబెట్టుకోవాలి. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్‌లోగల ఒక ప్రత్యేకమైన పదార్థము 'హ్యూమెక్టెంట్' చర్మపు తేమను నిలబెట్టి మీ చర్మాన్ని దుమ్ము, వాతావరణమునుండి రక్షిస్తుంది. తేలికైన, మంచువంటి పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మిమ్మలిని సొగసుగా కనబడేటట్టు వుంచి మీ చర్మాన్ని ఎల్లప్పుడు అందంగా, మృదువుగా, యౌవనంగా వుంచుతుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మాత్రమే రాసుకొంటే మీ ముఖము సహజ మనోహరత్వముతో వుంటుంది. లేకపోతే అది రాసుకొన్న తరువాత పౌడర్ అద్దుకోవచ్చును. అప్పుడు పౌడర్ గంటల కొలది ఏక రీతిగా అంటుకొని వుంటుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్: ప్రపంచమంతటా అందకత్తెలు వాడే క్రీమ్!




**పాండ్స్** వ్యానిషింగ్ క్రీమ్ పౌడర్ అద్దుకొనుటకు ఉత్తమమైనది

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

P-4999

# శ్రీ వాణీ సాహిత్య క్రాస్‌వర్డ్ పజిల్ నెం. 14

Licensed by the District Collector Warangal. L. No.1 Dt 8—10—67
(ఈ పజిల్ తాలూకు కీ సొల్యూషన్ జిల్లా కలెక్టర్‌గారి కార్యాలయములో సీలు చేయబడినది)

నిఘంటువు : శబ్దార్థ చంద్రిక

## రూ. 800 లు

## పోటీచేసి గెలుపొందండి !

మొదటి బహుమతి రు. 400 రైట్ ఆన్సర్
రెండవ బహుమతి రు. 250 ఒక తప్పు ఆన్సర్
3వ బహుమతి రు. 150 రెండు తప్పుల ఆన్సర్

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ప్రి | శ్వ | 2 సా | | డు | ■ | 3 మ | | 4 చి | క |
| ద్వే | ■ | | ■ | ■ | 5 | | ■ | | ■ |
| | ■ | క | ■ | 6 | లు | ■ | 7 | కు | 8 వ |
| ■ | 9 | డు | 10 గ | ■ | 11 గు | | ■ | ■ | |
| ■ | ■ | ■ | 12 | టి | ■ | ■ | ■ | 13 | లు |
| 14 | చా | 15 ర | ము | ■ | 16 | ■ | 17 | ■ | ■ |
| జ్ఞి | ■ | | ■ | ■ | 18 ర | | ర | మి | ■ |
| ■ | ■ | 19 ని | | ము | ■ | ■ | వే | ■ | ■ |
| ■ | 20 | ■ | ■ | ■ | ■ | 21 శై | | 22 ర | ము |
| 23 | రి | క | ■ | 24 | లా | | ■ | | ■ |

ముగింపు తేది ౨౧—౫ ౧౯౬౮

### నెం. 14 ఆధారములు

**అడ్డము:-** 1. కాశీక్షేత్రమందు నెలకొన్న దేవుడు. 3. ఇది యెడారులలో దూరమునుగా నీరున్నట్లు భ్రమింపజేస్తుంది. 5. రైతులు ప్రభుత్వానికి చెల్లించేది. 6. ఇది మన ముఖ్యావయవములలో నొకటి. 7. ఈ లక్షణముగల పుత్రునిచే వంశము రాణించునందురు. 9. దానధర్మములు చేయుటకైతే మనసొప్పదుకాని దీనిక్రింద యెంత ఖర్చయినా లెక్క చేయరు కొందరు. 11. కొండయందు తొలువబడిన గొప్ప బిలము. 12. జడలుగల సన్యాసి. 13. పట్టణము. 14. నేటి నాయకులలో చాలామంది ఎన్నికలకుముందు ఆయా ప్రాంతాలలో ఇదిచేసి ఓటర్లను ఆకర్షించడము పరిపాటి. 18. ఇంచుమించు. 19. ఇది పలికేవారికి వేరే తపస్సక్కర లేదన్నారు పెద్దలు. 21. షడృతువులలో నొకటి. 23. గోరువంక పిట్ట. 24. పండిత నెహ్రూకు ప్రియమైన పుష్పము.

**నిలువు:-** 1. ఈతని పొరుగు మనకు ప్రక్కలో బల్లెము వంటిది. 2. పరలోకము లేదనేవాడు. 3. సమృద్ధి. 4. పిల్లలు అల్లరి చేస్తున్నప్పుడు మనకిది కలుగుట సహజము. 5. ఇది కలిగినప్పుడుమాత్రమే భగవంతుని తలుస్తారు కొందరు. 8. న్యాయవాది. 10. దీనికి సింహము కలలోకి వస్తేచాలు చస్తుందట. 14. ఇది కలిగి ప్రవర్తించుటయే మానవ ధర్మము. 15. సూర్యుడు ప్రకాశింపని సమయము 16. పశువులు మొదలైనవాని పాడుగాటిముఖము. 17. ఇతర దేశమునందుండి వచ్చినవాడు. 20. పార్వతీ దేవి 21. ఆశ్రిత రక్షకుడని పేరుగాంచిన చక్రవర్తి. 22. ఆనందము.

## కూపను ఒక్కొంటికి ఒక్క రూపాయి మాత్రమే

**నిబంధనలు:-** 1. కూపనులు తుడుపులు, కొట్టివేతలులేకుండా తెల్లకాగితముపై చదరము గళ్ళరూపములో గీసి చక్కగా సిరాతో వ్రాసి పంపవచ్చును. లేదా 30 పైసల పోస్టేజి పంపినచో అచ్చు కూపనులు పంపుదుము. కాని లిస్టురూపములో వ్రాయబడిన కూపనులు చెల్లనేరవు. 2. ప్రవేశరుసుము ప్రతికూపనకు ఒక్కరూపాయి చొప్పున నగదురూపమునగాని, మనియార్డర్ లేక క్రాస్‌చేయని పోస్టల్‌ఆర్డర్‌ద్వారాగాని పంపాలి. మనియార్డరైనచో M.O.రసీదు కూపనుతో తప్పక జతచేసిపంపవలెను. లేనిచో కూపనులు పోటీలో నుంచబడవు. 3. ఒకపేరుతో రెండు కూపనులకంటే యెక్కువ పంపరాదు. ప్రతి కూపనుపైన మరియు పోస్టల్‌ఆర్డరు, మనియార్డర్‌ఫారములవెనుకభాగమున తప్పక పోటీదారుని పూర్తిపేరు, అడ్రసు వగైరా విశదముగా వ్రాయవలెను. 4. కూపనులు ముగింపుతేది సాయంత్రం 8 గంటలలోపుగా మాకు చేరునట్లు పంపాలి నియమిత సమయందాటినతరువాతవచ్చిన కూపనులు పోటీలో చేర్చబడవు. 5. ఈ పజిల్పులో ప్రతిపోటీదారు తానుపంపే రైటు మొదలు రెండు తప్పులవరకుగల ప్రతి కూపనుకు బహుమతిపొందవచ్చును. 6. A. కీ సొల్యూషను మాత్రం 'ఆంధ్ర పత్రిక' తెలుగు దినపత్రికలో ముగింపు తేది తరువాత ఒక వారములో ప్రకటించబడును. విజేతల లిస్టు, కొత్త పజిల్ కూపనులు వగైరా కావలసినవారు 30 పైసల పోస్టేజి పంపి తెప్పించుకొనవలెను. 6.B. తమ కూపనుల పునఃపరిశీలనకోరే పోటీదారులు విజేతల లిస్టు ప్రకటించబడిన తేదీలగాయతు 30దినములలోపుగా రూ.5లు స్క్రూటినీ ఫీజు క్రింద మనియార్డరుద్వారా పంపుతూ ఒకదరఖాస్తు స్క్రూటినీ కమిటీ చైర్మన్‌గారిపేర వ్రాసి M.O. రశీదు దానితో తప్పక జతపరచి మేనేజర్ అడ్రసుకు పంపవలెను. అప్పుడు వీలైనంత త్వరలో కమిటీ నిర్ణయాన్ని పోటీదారులకు తెలుపుదుము అట్టిపోటీదారులు విజేతలేయైనచో రావలసినబహుమతి మొత్తముతోపాటు స్క్రూటినీ ఫీజుకూడ తిరిగి పంపించబడును. కానిచో స్క్రూటినీ ఫీజు వాపసుచేయబడదు. నిర్ణీత గడువు దాటిన తరువాత ఎట్టి ఆక్షేపణలు అంగీకరింపబడవు. 7. కీ సొల్యూషన్‌లోని మాటకు సరిపోని ప్రతిమాట ఒక తప్పుగా నెంచబడును. 8. ఈ పజిలుతాలూకు అన్ని విషయములలో మేనేజరుదే తుదినిర్ణయము. 9. ఇండియాలో తప్పయితర దేశములలో నివసించువారు ఈ పోటీలో పాల్గొనుట నిషేధించడమైనది. 10. పై నిబంధనలు ప్రభుత్వ రూల్సు ననుసరించి రూపొందించబడినవి. కావున పోటీదారులెల్లరు పాటించి సహకరింపగోరుచున్నాము. 11. కూపనులు మనియార్డర్లు వగైరా ఈ దిగువ అడ్రసుకు మాత్రమే పంపాలి.

**The Manager, Sri Vani Sahitya Puzzles, Warangal-2. (A.P.)**

## సినిమా

హీరో కృష్ణ మనసు క్షోభించింది; ఎక్కడో ఆకాశంకేసి చూస్తూ పరధ్యానంగా వుంటాడు. ఎప్పుడూ నవ్వుతూ, కులాసాగా కబుర్లు చెప్పే కృష్ణ యిలావుండడాన్ని చూచి ఆశ్చర్యం వేసింది...కారణం లేనిదే యిలా యెందుకుంటాడనుకున్నా. నా వూహ నిజమే అయింది. కృష్ణగారాబు చెల్లి చంద్రకళ. అమాయకత్వం సుగుణంగాగొన్న ఆమె అనవసరమయిన అపనిందకుగురి అయింది. భరించరాని దుఃఖంతో చెల్లెలు కుమిలిపోతుంటే, అన్నయ్యకు మనస్సు నెమ్మదిగ ఎలావుంటుంది చెప్పండి? ఈ



'అగ్గిమీదగుగ్గిలం'లో విజయలలిత.

బిగువయిన సన్నివేశంలో చంద్రకళ, కృష్ణ దర్శకుడు శ్రీరామచంద్రరావు ఆశించిన విధంగా నటించారు. శ్రీ వి. ఎస్. ఆర్. స్వామి ప్రసాద్ స్టుడియోలో 'కథానాయకుడు, షూటింగుకు హాజరుకావలసిన నిర్బంధం యేర్పడడంవల్ల తాత్కాలికంగ యీ సెట్టుకు కన్నప్పన్ కెమెరాను కదిలించాడు. ఈ చిత్రంలోని ముఖ్యపాత్రల్లో విజయనిర్మల, కృష్ణ, రాంమోహన్, చంద్రకళ, చంద్రమోహన్, సంధ్యారాణి, రాజబాబు, మీనాకుమారి, ఛాయాదేవి, కె. వి. చలం అగుపడ్తారు. శ్రీ డి. బి. నారాయణ నిర్మిస్తున్న యీ చిత్రాన్ని శ్రీఫిలింస్ విశాలాంధ్రలో విడుదల చేస్తారు.

* * *

వాహిని స్టూడియోలో వాణిశ్రీ బిడ్డకు పుట్టినరోజు పండుగ జరుగుతుందని విని ఇక్కడికి వెళ్ళా. వాణిశ్రీకి పెళ్ళికాలేదే? మరి బిడ్డ అంటున్నారు అని మీరు తొందరపడి అడిగితే ఎలా? ఈ వైభవం బి ఎన్ రెడ్డి దర్శకత్వంలో నిర్మితమయ్యే 'బంగారు పంజరం' చిత్రంలోనిది పసిపాపను ఆశీర్వదించిం దెవరని అడగరేం? కన్నతల్లి వాణిశ్రీ, శోభన్ బాబు, తాతయ్య త్యాగరాజు, టి జి కమలాదేవి, శ్రీరంజని, గీతాంజలి, శాకరాం, జి వి జి, ప్రసాద్ మరియు రావికొండలరావులు ఉయ్యాలలో పాపను జోకొడ్తూ టి జి కమలాదేవిపాడే పాటను సూలమంగళం రాజలక్ష్మి కమ్మగా



'శ్రీరామకథ'లో అంజలీదేవి, జయలలిత.

పాడితే, బుల్ బుల్ తన కెమెరా చాతుర్యన్ని చకచక చూపించారు.

**నాగరికతా—నైతిక విలువలూ**

కలియుగంలో భక్తిభావం రోజురోజుకి తగ్గిపోతూంది. మానవుడు కుళ్ళు, కపటం, మోసం, దొంగతనంలాంటి చెడ్డవిషయాలపై ఆసక్తి యెక్కువగా చూపిస్తున్నాడు. కొందరికి భగవంతుడు వున్నాడా? అన్న సందేహంకూడ వుంది. దానికి తగ్గట్టు యిప్పుడు నాగరికతా ప్రపంచంలో డాంబికానికి, ఆడంబర అలంకారానికి ప్రాముఖ్యత పెరుగుతూవుంది. ఈ సమయంలో మనిషిలో భక్తిభావాన్ని యేర్పరచే సాధనం (మలకంగా) సినిమా అనేదే నాభావం ఈమధ్య విడుదలయ్యే చిత్రాల్లోకూడ



# పాత బొమ్మలు — కొత్త కబుర్లు

ఈ చిత్రంలో వున్న వారిద్దరూ ఎవరో చెప్పుకోగలరా? ..పోనీ ఆ యిద్దరిలో ఏ ఒక్కరినైనా గుర్తు పట్టగలరేమో ఆలోచించి చెప్పండి, చూద్దాం! చప్పున పోల్చుకోగలిగితే చాలాగొప్ప. శ్రమతీసుకుని చెబితే మామూలు గొప్ప. అవకాశాలు రెండూ మీవే గనుక మెదడుకు పని కల్పించండి: కానివ్వండి మరి త్వరగా!

*   *   *

నన్ను చెప్పెయ్యమంటారా? పై చిత్రంలో వున్న వారిలో ఒకరు కాంచనమాల. రెండో వారు రామానుజాచారి. ఈ బొమ్మ—దర్శక పితామహ స్వర్గీయ హెచ్. ఎం. రెడ్డిగారు 1938 లో తీసిన "గృహలక్ష్మి" చిత్రం లోనిది. సందర్భం ఏమిటంటే—ఆయన పేరు కృష్ణ. ప్రాక్టీసున్న డాక్టరు! ఆమె పేరు మాధురి. వేశ్య. డాక్టరుగారు ఓ నృత్య ప్రదర్శనంలో యీ అమ్మాయిని చూసి—సారీ అమ్మాయినంటే అమ్మాయినే కాదు, ఆమె అందచందాలను, వంపుసొంపుల్ని చూసి— ముగ్ధుడై మనసు పడ్డారు. ఆపడ్డం ఆమె కనిపెట్టి నెమ్మదిగా ఆయన్ని లోబరచుకున్నది. ఇంకేముంది, "బుద్ధిమంతుడైన డాక్టరుగారి బుద్ధి కాస్తా పెడత్రోవన పట్టి భార్య, బిడ్డలు, ఇల్లు వాకిలీ అన్నీ వదిలిపెట్టి ఆమె యింటనే మకాం వేసి శృంగారంతో తేలిపోతున్నా రన్నమాట.

*   *   *

రామానుజాచారి గారి వివరాలు తెలీవు. కాంచనమాల గారినైనా ఇంటర్వ్యూ చేసి పాఠకులకు ఆమె అభిప్రాయాలు తెలియ చేయాలనుకున్నాను. కాని ఇపుడామె ఏమీ చెప్పగలిగితే స్థితిలో లేరని ఆమెకు సన్నిహితులైన వారి ద్వారా తెలుసుకోవటం జరిగింది. నాటి ప్రేక్షకులకి శ్రీమతి కాంచనమాల అంటే ఎంతో గ్లామర్ ఉండేదనీ, ఆమె చిత్రాల పట్ల విశేషమైన ఆదరాభిమానాలు కనపరిచేవారనీ తెలిసిన వాళ్ళు చెబుతారు.

ఈ బొమ్మ చూస్తుంటే— శృంగారం చిత్రాలలో నేడేకాదు, నాడు కూడా ఎక్కువగానే ఉండేదేమోనని అనిపిస్తుంది కదూ?

—మోహన్ కుమార్

పరిచయం:



కళాదర్శకుడు

## బి. ఎన్. కృష్ణ

చిన్నతనం నుండి బొమ్మలు గీయడం, గీసిన బొమ్మలకు రంగులు పూసి మురిసి పోవడం తనకు జీవనోపాధి కాగలదని కలలో నయినా వూహించ లేదంటాడు ఆర్టు డైరెక్టరు బి. ఎన్. కృష్ణ.

విమానదళంలో చేరాలని మద్రాసుకు వస్తే, ప్రముఖ దర్శక, నిర్మాత శ్రీ బి. ఏ. సుబ్బారావు "చెంచులక్ష్మి" చిత్రానికి దర్శకుడు శ్రీ వాలి వద్ద సహాయకుడిగ నియమించాడు. ఆసక్తి, వుత్సాహం సమ్మిళితమై వృత్తిలో పట్టుదలను పెంచింది. ఆ ఏకాగ్రతే మొదటి చిత్రంలోనే యీ యువకునికి మంచిపేరు తెచ్చిపెట్టింది. ఈ యువకుని కార్యశూరతకు మెచ్చి శ్రీ కొండారెడ్డి "రాజమకుటం" చిత్రానికి కళాదర్శకత్వాన్ని అప్పగించారు. అప్పటి నుండి యిప్పటివరకు తన మేధాసంపత్తిలో తెలుగు, కన్నడ, తమిళ చిత్రాలకు చక్కటి సెట్లను నిర్మించి దర్శక, నిర్మాతలను తృప్తిపరచి, చురుకయిన కళా దర్శకుడనెడి ప్రశంసను తెప్పించాడు.

దర్శకుడు సన్నివేశాన్ని విడమర్చి చెప్తే, దాని కనుగుణ్యంగా సందర్భానుసారంగా సెట్లను నిర్మించడం యితని కళవాటు. నిర్మాత యొక్క యిష్టాయిష్టాలను బట్టి సెట్ నిర్మాణం జరుగుతుంటుంది అంటాడు కృష్ణ.

ఇంత చిన్నవయస్సులోనే ఈర్ష్య జనితమయ్యే విజ్ఞానాన్ని సముపార్జించిన కృష్ణ భవిష్యత్తులో యింకెంత పేరు సంపాదించ గలడో వేచి చూద్దాం!

# సినిహా

అలాంటి దైవచింతను కల్గించేవి అరుదుగా వస్తున్నాయనుకుంటూ, ప్రజల్లో నైతిక విలువల్ని పెంచడానికి శ్రీ పద్మనాభం నిర్మించిన 'శ్రీరామకథ' చిత్రం తోడ్పడ గలదని ఆశించవచ్చు. దైవనింద యెంతటి అపరాధమో, దైవభక్తి అంతటి మహిమాన్వితము అని నిరూపించే పౌరాణిక చిత్రం 'శ్రీరామకథ' అక్టోబరులో మీ హృదయాన్ని కదలించి అప్పటినుండి మీలో దైవచింతను కలకాలం వుండేవిధంగా యీ చిత్రం చెయ్యగలదనే నమ్మకం రష్ చూసి చెప్పగల్గుతున్నాను.

**అమాయకుడి యిబ్బందులు?**

'సత్తెకాలపు సత్తెయ్య' చిత్రం చలం నట జీవితంలో ఒక మైలురాయి అనడం సమంజసం. ఆ కథను శ్రీ కె. బాలచందర్ ఎలా వ్రాసాడు అన్న విషయం నేను వ్రాయడంకన్నా మీరు చూసి చెప్పడం న్యాయం. సంఘంలో సత్యం జయిస్తుందా, అబద్ధం విహారం చేస్తుందా అన్న సమస్యకు యీ చిత్రం సరయిన సమాధానం.

అమాయకుడయిన ఒకడు ఎన్ని యిబ్బందులకు గురిఅవుతాడో, ఆ యిబ్బందుల నుండి న్యాయం, ధర్మం ఎలా రక్షిస్తుంద యీ చిత్రంచూస్తే మీకే తెలుస్తుంది. పసిపాపలు దైవసమానులు అనెడి వాక్యం అక్షరాలా నిజం అని నిరూపించే చక్కటి సాంఘిక చిత్రం 'సత్తెకాలపు సత్తెయ్య'. ఈ చిత్రంలో చలం ఆత్మహత్య చేసుకునేందుకు ప్రయత్నిస్తాడు. (అనవసరమయిన అపనిందకు గురికావడంతో) అప్పుడు అక్కడికి ఒక చిన్నారిపాప రావడం, అతనికి మనోనిబ్బరాన్ని కల్గించడాన్ని శ్రీ ఆత్రేయ ఎంత చక్కగా వ్రాసాడోనని వదిలేస్తే ఎలా-? మీరూ ఆ పాటయొక్క సాహిత్యాన్ని చవి చూడండి.

ముద్దు ముద్దు నవ్వు బుగ్గల్లో రువ్వు
జాజిమల్లె పూవు బజ్జోమ్మ నువ్వు
ఏయింటి పంటవో ఏతల్లి నోమువో



'బంగారుపిచ్చిక'లో చంద్రమోహన్, విజయనిర్మల.

మాయింటి వానికి నావంటి పేదకు
ప్రాణాలు పోసావు బతకాలి అన్నావు
ఉరిత్రాడు జోజోల ఉయ్యాల చేశావు!!

ఈ పాటకు పి బి శ్రీనివాస్‌గొంతు ఎంత ఎక్కటి భావాన్ని విప్పించింది? విశ్వనాథం విప్పించిన సంగీతం మీ అంతరంగాల్లో అనిర్వచనీయమయిన ఆనందాన్ని కల్గిస్తుందని అంటే అత్యుక్తి లేదేమో!

**కథా గమనంలో కొత్తదనం**

ముత్యాల జల్లు కురిసే
రతనాల మెఱుపు మెరిసే
వయసూ, మనసూ పరుగులుతీసె

అమమ్మా

అంటూ సుశీల విజయ గార్డెన్స్‌లో పాడుతూవుంటే. ఆ గాన మాధుర్యానికి నింగినవున్న మేఘాలు సహితం కరగి వాన జల్లును కురిపించ ప్రారంభించింది ఈ రసవత్తరమయిన పాటకు టి వి రాజా సంభైవాయిద్యాలను వుపయోగించి, దాశరథి సాహిత్యానికి నిండుదనాన్ని తీసుకొచ్చారు. ఈ పాటను కుమారి జయలలిత 'కథానాయకుడు' చిత్రంలో పాడుతుంది గోపాలక్రిష్ణ పిక్చర్సు నిర్మిస్తున్న సాంఘిక చిత్రంలో నాయికగ నటించే జయలలిత సెప్టెంబరునుండి షూటింగులో పాల్గొంటుంది. మొదటి షెడ్యూలులో యీ పాటను కథానాయికపై దర్శకులు హేమాంబధరరావు చిత్రీకరిస్తారు. సాంఘిక కథాగమనంలో కొత్తదనాన్ని ప్రదర్శించగల యీ చిత్రంలో ముళ్ళపూడి రమణ కలంబలం, భమిడిపాటి సంభాషణా చాతుర్యం అమోఘం అన్నాడు నిర్మాత గోపాలక్రిష్ణ.

* * *

మోడరన్ థియేటర్సు నిర్మిస్తున్న సాంఘిక చిత్రంలో కృష్ణకుమారి కాల్ షీట్లు కుదరనందువల్ల, షావుకారు జానకిని ఆపాత్రకు నియోగించి దర్శకుడు శ్రీ ఆర్. సుందరం సేలంలో క్లయిమాక్సు షూట్సాట్సి చిత్రీకరించారు. పతాక సన్నివేశంలో కాంతారావు, రాంమోహన్, రాజశ్రీ, జానకి, చలం. మీనాకుమారి, ప్రభాకర రెడ్డి, సత్యనారాయణ, త్యాగరాజు పాల్గొన్నారు.

—శ్రీనివాస్



ఆంధ్రపత్రిక ఎంప్లాయీస్ యూనియన్ (విజయవాడ) వారు ఆగస్టు 15 న — రైల్వే ఇన్‌స్టిట్యూట్‌హాలులో ప్రదర్శించిన "పూర్ణాహుతి" నాటకంలోని నటీ నటవర్గం. మొదటి వరుసలో కూర్చున్న పురుషులలో (రెండవవారు) — పర్యవేక్షకులు శ్రీ సి హెచ్ రామచంద్రరావు, చివరివారు) నాటక రచయిత — దర్శకుడు — శ్రీ భీశెట్టి లక్ష్మణరావ్ వున్నారు.

అపీ–ఇపీ

## పూర్ణాహుతి నాటక ప్రదర్శన

ఆంధ్రపత్రిక (విజయవాడ) ఎంప్లాయీస్ యూనియన్ ఆధ్వర్యంలో ఆగస్టు పదిహేనున సాయంత్రం స్థానిక రైల్వే ఇన్‌స్టిట్యూట్‌లో "పూర్ణాహుతి" నాటకం ప్రదర్శింపబడింది

నాటక రచయిత — దర్శకుడు, నాటకంలో ప్రముఖ పాత్రధారులందరూ ఆంధ్రపత్రికలో వుద్యోగులే

ఆంధ్రపత్రిక వ్యవస్థాపకులు, విశ్వదాత, దేశోద్ధారక, కళాప్రపూర్ణ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి శ్రద్ధాంజలి ఘటించుతూ ప్రారంభమైన "పూర్ణాహుతి" నాటకం రెండు గంటలపాటు నడిచింది

వరకట్న సమస్య వికటాట్టహాసాన్ని ఈ నాటకం చిత్రిస్తుంది వాగ్దానం చేసిన కట్నం ఇవ్వని కారణంగా తన ఇంట్లోనే వుండి మానసిక వ్యధకు గురి అవుతున్న పెద్ద కూతురునూ, కట్నం తీసుకురాని కారణంగా అత్తవారింట్లో చిత్రహింసకు గురి అవుతున్న రెండవ కూతురునూ వుద్ధరించటానికి ఆత్మాహుతి చేసుకున్న తిరుపతయ్య గాథ ఈ "పూర్ణాహుతి"

పాత్రధారులందరూ నాటకాన్ని చాల రసవత్తరంగా నిర్వహించటం ప్రశంసనీయం

తిరుపతయ్యగా నటించిన శ్రీ ఎం రామచంద్రరావు, వరదాచారి పాత్రధారి శ్రీ విజయకుమార్, వాసు పాత్రను నటించిన శ్రీ భీసెట్టి, వేణుగా శ్రీ ఇ కృష్ణారావు, పద్మగా కుమారి సునంద, కరుణాకరంగా యస్ రమణారావు తమ పాత్రలను సమర్థనీయంగా పోషించారు. సహాయనటీ నటులుగా వరలక్ష్మి, బాబూరావు, ఎస్ వెంకటేశ్వరరావు, దేవమణి, భాషా, యథోచితంగా నటించారు

నాటక రచన, దర్శకత్వం శ్రీ భీసెట్టి లక్ష్మణరావు, నాటకానికి మెరుగులు దిద్ది రూపురేఖలు కల్పించినవారు శ్రీ ఎస్ వి ఆర్ రావ్.

సంగీతం వేపా అండ్ పార్టీ, ప్లేబాక్, "వేమూరి" సి హెచ్ వరలక్ష్మి, వ్యాఖ్యాత ఎం. ఆనంద్, మేకప్ కె ఎస్, శాస్త్రి, లైటింగ్ రాజా బ్రదర్సు నిర్వహించారు (ఒ వి.)

## 'కీలుబొమ్మలు' నాటక ప్రదర్శన

డా జి వి కృష్ణారావు గారి నవల 'కీలుబొమ్మలు' శ్రీ శివం నాటకీకరించరు

ఈ నాటకాన్ని నాట్యవిద్యాలయ రిపర్టరీ వారు ఇటీవల రవీంద్ర భారతిలో ప్రదర్శించారు. నటవర్గం ఆ పాత్రల స్వభావాలను బాగా అధ్యయనం చేసినట్లు విదితమవుతుంది శ్రీయుతులు ఏ ఆర్ కృష్ణ, రవీంద్రరెడ్డి, సోమేశ్వరరావు, చంద్రశేఖరరావు, విశ్వేశ్వరరావు, రాంగోపాల్, ఆదినారాయణ, పి పి నాయుడు, ఎర్రయ్యా, అప్పన్న, శ్రీనివాసరావు, రాంబాబు, శ్రీమతులు పార్వతి, పుష్పలక్ష్మి, ఉషాబాల, కుమారి లక్ష్మి బాల నటులు రామనాథ్, గౌరీపతి మొదలైనవారు నటించారు శ్రీ డి రాజేశ్వరరావు సహాయ దర్శకుడుగా పని చేశారు. (ఒ వి)

# పుస్తకాలు

## లాడ్జింగులో ఒకరాత్రి

నవల• రచన కొసరాజు శేషయ్య ప్రచురణ విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ—2 పేజీలు 196, వెల రు 3—00

నాగరిక జీవితాన్ని కలుషితం చేస్తున్న లాడ్జింగుల రహస్యాలను రచ్చకీడ్చి, జరీ కండువాల బండారాన్ని బహిర్గత పరచి, పరిస్థితులకు దారమశై శీలాన్ని కోల్పోయిన దుర్భాగ్యులజీవితాలను బాగుపర్చవలసిన ఉత్తమ లక్ష్యాలతో రచన చేయ సంకల్పించి, భావనకు భాషకు పొత్తు కుదరక చివరకు అశ్లీలపు సాహితీ సృష్టి చేశారు శేషయ్య గారు ఈ నవలలో మోహనరావు అనే యువకుడు కోర్టు వనివిూద పట్నం పోయి అవసరార్థం కుతూహలంతో వో లాడ్జింగులో ఒక రాత్రి బస చేస్తాడు అక్కడ అతనికి తార, రాజరత్నం, నాగేశ్వరరావు మొదలైన వారితో పరిచయం అవుతుంది తార అతని స్నేహితుడు కృష్ణ అనే అతని భార్య, విధి బలీయమై లాడ్జింగు పాల బడుతుంది మోహనరావు, రాజరత్నం నాగేశ్వర రావులకు వివాహం జరిపించి, తార కృష్ణుల సంయోగానికి కారకుడై అపూర్వ వున్న లాడ్జింగుల మూసివేతకు కారకుడై హీరో అవుతాడు కథలో కృత్రిమత్వము, నాటకీయత వున్నాయి కనిపించిన ప్రతి పాత్రలోను ఏదో బలహీనత కొట్టవచ్చినట్లు కనబడుతుంది దాదాపు పాత్రలలో చాలా భాగం నియోగి బ్రాహ్మణ వంశానికి చెంది, ధర్మ భ్రష్టులుగా కనిపిస్తాయి నియోగి వంశాలలో కనిపించే రాజసం, త్యాగభావం లుప్తమై శీలహీనతమాత్రమే ఇందులో చూపబడింది రచయితకు బ్రాహ్మణ వంశాలతో గల పరిచయ శైథిల్యం, వారివారి ఆచార వ్యవహారములను అర్థం చేసికోలేక పోవడం స్పష్టంగా కనిపిస్తుంది ఇందులోని ఆడవారు కాలుజారినవారు సంప్రదాయాన్ని ఆచారాన్ని కాలదన్ని కడగండ్లపాలైనవారు ఇంక భాష విషయంలో చూస్తే, రచయిత తన కలాన్ని శిశృంఖలంగా నడిపించినట్లున్నది నవలా రచనలో ఇది ఒకరకమైన దిగంబరత్వం. ఇందుకు ఉదాహరణలు

పేజీ 10, "దొంగలొత్తుకొడుకులు యెరువులు అన్నీ బ్లాకున అమ్ముకు దొబ్బ మరిగి రైతులకు సున్నా చుట్టారుగా", "పట్టపగలు దోచుకునే నాయాళ్ళంతా పోగయ్యారు", "నీయమ్మా, యింకా రైతు యేమి తింటాడు?"

పేజీ 19, "యీ పళ్ళకొట్టు నంజ కొడుకులు ఒక్కడు కూడా సరిగా సొమ్ము యిచ్చిన పాపాన పోడు"

పేజీ 21, "యీ గుమాస్తా నాయాలు లేడూ వట్టిలఫంగి అనుకో"

పేజీ 22, "లేకేం బాబు, ఆ విధవరాలు తరువాతి గుంట లేదూ!"

పేజీ 139, "ఆ ప్యాంటు వేసుకుని [illegible] ంటే నేను అసౌకర్యంగా ఫీలు అవుతాను" "పక్కలో మీ ఆవిడ ఉండదుగా, యింకా మేమిటో?"

గొంగట్లో తింటూ వెంట్రుకలు లెక్కపెట్టుకోవడం వంటిది ఈ నవలలో ఇటువంటి దోషాలకోసం వెతకడం ఉత్త కాముక ప్రవృత్తి తప్ప ఇందులో మరేమీ చూపబడలేదు రచనలోని లోపం వల్ల ప్రయోజనం శూన్యమై పోయింది

165వ పేజీలో మోహనరావు మధ్యాహ్నం వేళ మేడమీదకు భార్యను పిలిపించుకుంటాడు అతనప్పుడు ప్రయాణ సన్నాహంలో వున్నాడు బయట కారు, అతని స్నేహితుడు, క్రిందహాల్లో అతని తల్లి, పాలేర్లు అందరూ వున్నారు అతనికోసం నిరీక్షిస్తూ, భార్య అలసి సొలసి మేడమీదకు వస్తుంది "దేనికి పిలిచారు?" అని అడుగుతుంది అప్పుడాతని సమాధానం, "దేనికేమిటోయ్, మూడు దినాలనుండి నీకోసం ఎంత తపించి పోతున్నానోయ్" అంటూ తలుపులు బిగిస్తాడు "అయ్యయ్యో, నాకు పనివుంది. పోవాలి!" అంది ఆమె భీతితో "ఆపనియేదో తరువాత ఆలోచిద్దాం" అంటూ ఆమెను చేతుల మధ్యకు తీసుకుని "అరగంట తరువాత బట్టలు మార్చుకొని" బయలు దేరుతాడు ఇంతచక్కని సంస్కారం ఈ నవలలో ప్రకటితమైంది! పాత్రోచితమైన భాష అంటే ఏమిటి సరిగా అర్థం చేసుకోకుండా మార్పు అనే పేరట అశ్లీలాన్ని ప్రవేశపెడుతూ చౌకబారుతనాన్ని, అసభ్య శృంగారాన్ని, చూపుతున్న మన నవలలకు ఇదీ మంచి ఉదాహరణ ఈనవలను ప్రచురించి విశాలాంధ్ర వారు తమ స్థాయిని తగ్గించుకున్నారే గాని, రచయిత స్థాయిని మాత్రం ఏమాత్రం పెంచలేక పోయారు

—శ్రీరామచంద్రమూర్తి

ఆటలు

## ఆస్ట్రేలియాలో మన ఆటగాళ్లకి తర్ఫీదు



జూనియర్ ఆటగాళ్ళు ఆనంద్ అమృతరాజ్, గౌరాంగ్ మిశ్రాలనికూడా ఆల్ ఇండియా టెన్నిస్ ఎసోసియేషన్ వారు ఆస్ట్రేలియాకి పంపుతున్నారని పోయిన వారమే రాశాను అక్కడ వారు కొంత తర్ఫీదు పొందుతారు ఆస్ట్రేలియా కొంతకాలంగా 'ప్రపంచ ఛాంపియన్' దేశంగా ఉంటోంది అక్కడ తర్ఫీదుకి మంచి అవకాశాలు ఉన్నాయి ఈ అవకాశాలకి బాగా దోహదం చేసిన వ్యక్తి హారీహాప్‌మాన్ ఈయన మనదేశంలోని ఎసోసియేషన్ కార్యదర్శి శ్రీ ఖన్నాతో తనకి వీలయినంత సహాయం చేస్తానని అన్నారుట ఇది చాలా మంచి వార్త! హాప్‌మాన్ పయికి తీసుకువచ్చిన వారిలో ఇద్దరు హోడ్, రోస్‌వాల్‌లు

అయితే-మనం ఒక విషయం మరిచిపోకూడదు హాప్‌మాన్ తర్ఫీదు ఎంత కాలం ఉంటుంది (మన ఆటగాళ్లకి)? మహా ఉంటే రెండు నెలలు ఇంత కొంచెం వ్యవధిలో సాధించేది ఏంత మాత్రం?

అందుకనే మన దేశానికే మంచి కోచ్ ఒక ఆతనిని పిలిపించి ఇక్కడ కొంతకాలం ఉంచే ఏర్పాట్లు చెయ్యాలి కొంతకాలం క్రితం మనకి నూర్ మహమ్మద్ ఉండేవాడు ఈయనని దేశంలో అన్ని చోట్లకీ పంపేవారు కొందరు విదేశ నిపుణులని కూడా పిలిపించేవారు అలాగే రాబోయే నిపుణుడిని దేశం పర్యటింప చేయ్యటం అవసరం ఇతను మదరాసు, ఢిల్లీ, బొంబాయి, కలకత్తా – ఇంకా మరి కొన్ని ఊర్లు—తిరిగి బాగా ఆడే చిన్నవారిని ఎన్నుకుని, వారిని ఒక కేంద్ర ప్రదేశానికి పిలిచి అక్కడ తీవ్రంగా తర్ఫీదు చెయ్యాలి ఆల్ ఇండియా టెన్నిస్ సంస్థ బీద సంస్థకాదు ఆ సంస్థకి కావలిసినంత డబ్బు ఉంది ఈ పథకం భరింపగలిగినదే!

ప్రస్తుతానికి ఆనంద్, గౌరాంగ్‌లని పంపవలసిందే, కాదనటం లేదు కాని, భావిని గురించి కూడా ఆలోచించాలి కదా!

— కె ఎస్ నరసింహన్

Editea Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street Madras 1 Chief Editor S. Sambhu Prasad

"ఓవల్‌టీను లో పుష్టికరమైన మాంసకృత్తులు, విటమినులు, ఫాస్ఫటైడులు, తాజా మీగడపాలు, ఇంకా పక్వమైన బార్లీనుంచి తయారు చేసిన మాల్టు ఉన్నాయి."

నిజానికి ఆరోగ్యం, దారుఢ్యం, శక్తి
పెంపొందాలంటే మీకివే కావాలి



ఓవల్‌టీన్‌లో ఆరోగ్యం, దారుఢ్యం, శక్తి వృద్ధి చేసే ముఖ్య వస్తువులన్నీ చేరి ఉన్నాయి. మీరు పాలలో ఓవల్‌టీన్ వేసినపుడు చక్కని రుచితో మించి దానిలో ఆరోగ్యం, దారుఢ్యం, శక్తి గూడా చేర్చుతున్నారు.

మధురమైన

**ఓవల్‌టీను**

త్రాగండి

ప్రతిరోజూ ప్రతిరోజూ ప్రతిరోజూ






ASP/J1/22/Tel

ఓవల్‌టీన్ ఇండియాలో జగత్‌జిత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ తయారుచేస్తున్నారు. ఎ. వాండర్ లిమిటెడ్, లండన్ వారి లైసెన్సు క్రింద. సోల్ డిస్ట్రిబ్యూటర్లు వోల్టాస్ లిమిటెడ్

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.